# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




ఏప్రెల్ 1958

సంపుటము 35 : : సంచిక 4

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1958



శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
20వ పుణ్యవర్ధంతి : చైత్ర శుద్ధ ద్వాదశీ మంగళవారం 1-4-58

# దేశోద్ధారక సంస్మృతి

శ్రీ దాశరథి కృష్ణమాచార్య

పుత్రిక కన్న నెక్కుడుగ
పూనిక తోడుత నాంధ్ర పత్రికా
పుత్రిక బెంచి యాంధ్ర జనముం
బరితుష్టుల జేసి స్వార్థ మే
మాత్రము లేని రీతిని సమస్త
ధనమ్మును దేశసేవకై
చిత్రిక బెట్టినట్టి ద్విజశేఖరు
గొల్చెద విశ్వదాతనున్.

కారాగారము పాఠశాలగ
జగత్కల్యాణ పాఠమ్ములన్
ధారాళమ్ముగ నేర్చి గాంధి గురు
నాజ్ఞన్ దేశసేవారతిన్
శూరాగ్రేసరుడై మహాంధ్రజన
సంస్తుత్యుండునై సర్వమున్
ధారంబోసిన విశ్వదాతను
మనోధామమ్మునన్ నిల్పెదన్.

శ్వేత పటకిరీట విభ్రాజిత శిరస్కు-
డుత్తరీయ మాల్యయుత గళుండు.
కాంతిపూర్ణ శాంత గంభీరనయనుండు
విశ్వదాత మదిని వెలయుగాత !

ఇమ్మనుచే తడవుగ గై
కొమ్మన్న నదెంతగాని, కుఱ్ఱల్ పెద్దల్
సమ్మానింపంబడిరి స
తమ్మును విద్యా వినోద తాత్పర్యములన్.

నాగాభరణ పదాంభో
జాగత సురభిళపరాగ హారి శిరస్కున్
నైగమ విద్యాపారగు
నాగేశ్వరు గొలుతు భక్తి నవ్య మనస్కున్.*

* 1-4-58 వ నాడు హైదరాబాదులో జరిగిన 20 వ దేశోద్ధారక వర్ధంతిలో చదివిన రచన.

# రాయల కృషిక జీవనప్రియత

శ్రీ యం. వి. యస్. సూర్యనారాయణ

కావ్యము జీవనమునకు అనుకరణము అనఁబడుచున్నది. అది వట్టి యనుకరణము మాత్రమే కాదు. ప్రకృతిపై, జీవనముపై, సమాజముపై కవి తన భాష్యమును గూడ వివరించును. అందుచే కావ్యమునందు కవి అభిరుచులు, వ్యక్తిత్వము ప్రస్ఫుటమగుచుండును. తన ప్రగాఢ పరిశీలన శక్తివలనను, సానుభూతిప్రవణమైన హృదయమువలనను అతఁడు సామాన్య మానవుల కంటెని యనుభూతి నందుచుండును. యుగధర్మము నతిక్రమించిన ఆ యసాధారణానుభూతులను సువ్యక్త రమణీయ శైలిలో ప్రకటించుట కతనచే కవిః క్రాంతదర్శి అని ప్రస్తుతింపబడుచున్నాఁడు. అతని యుదాత్త వివేకము కతనను, స్వార్థరహిత నిష్పాక్షిక దృష్టి మూలమునను కవి వాక్యములు విశ్వశ్రేయోదాయకములై యారాధనీయములు అనుసరణీయములు, నగుచున్నవి.

కవి వైయక్తికాభిరుచులు, జీవితముపై వాని దోసఁగు విమర్శనము అతఁడు గ్రహించిన కావ్యవస్తువును బట్టియు, వర్ణనాంశముల వానిఁ డిచ్చిన ప్రాధాన్యమును బట్టియు, అతని యుపమాన సామగ్రినుండియు, అర్థాంతరన్యాసముల మూలమున వాఁడు వెలువరించు భావముల ననుసరించియు గ్రహింపవచ్చును.

శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవభక్తురాలగు గోదాదేవి చరిత్రమును కావ్యవస్తువుగ స్వీకరించెను. విశిష్టాద్వైతమతముపై అతనికిఁగల అభినివేశమును, ఐహిక విషయాభిలాష నుడించిన పారమార్థిక దృష్టిని అతని ఇతివృత్తము స్పష్టము చేయుచున్నది.

ఆంధ్రప్రబంధ రచయితలు పెక్కురు సంస్కృతి వాఙ్మయ భాండారమును, ప్రాచీన కావ్యసంపదను తమ భావనా లతలకు దోహదములుగ గ్రహించిరి. తమ పరిసర ప్రకృతి, సమాజ జీవనము వారి హృదయములకు గల్గించిన స్పందనముకంటె తమ కాశ్రయుఁడైన రాజపోషకుని మెప్పే వారి రచనోత్సాహమునకు మూలమైనది. శ్రీకృష్ణరాయలు దీనికి ప్రథమాపవాదము. అతఁడు సాహితీ సమరాంగణ సార్వభౌముఁడు. తన యఖండ విక్రమముచే విశాల సామ్రాజ్యమును సంపాదించిన శక్తిశాలి. అతని పరిసరములెల్ల అతనికి విధేయములు. అతనికి ప్రియములు. మనోజ్ఞములు నగు వస్తువులు మాత్రమే అతని యెదుట నిలువఁగలవు. అతని యాస్థానకవులు అతని యభిరుచుల ననుసరించియే యతని మతించి సంప్రీతునిఁ జేయుదురు. అట్టి వైభవప్రసన్నము, స్తోత్రప్రవణమునైన పరిసరములలో జీవించు చక్రవర్తి హృదయము విలాస పరాయణతకు, గర్వాతిరేకమునకు నెలవై, వివేకమును గోల్పోయి అలుకోలు లేని భోగానుభవమునకే అఱ్ఱులు సాచుచుండుట సామాన్యము. ప్రజానురంజనము తమ కర్తవ్యమను నాత్మధర్మ పరిజ్ఞానముగల నృపులు మధ్యయుగమున మిగుల నరుదు. కాని శ్రీకృష్ణరాయలు ఆ తెగకుఁ జెందినవాఁడు కాఁడు. విశాల ప్రపంచమును, అందలి సామాజిక స్థితిగతులను పరిశీలించి సానుభూతికి లోనై, ఆత్మ విమర్శనమొనరించుకొను స్వభావముగల కవి యగుటచే తన యుగధర్మము నతిక్రమించినాఁడు. స్వధర్మరతిత్వగుఁడైన నరపాలునకుఁగల బాధ్యత లాతని హృదయ సాగరమున కల్లోలములు రేపుచుండెను.

"పగయును వగయును లేక యేపాటి గన్న
నలరు సామాన్య సంసారి యగుట మేలు."

అని యాతని కప్పుడప్పు డనిపించుచుండెను. ఏలన రాజ్యభూమికఁ దాల్చిన రాజునకు శాంతి, సహనము పూనియుండుట యొప్పదు.

తన యైశ్వర్యమును, వైభవము నెట్లు లభించుచున్నవను విమర్శన మాతని యెదను కదలించినది. శ్రమించి క్షేత్రలక్ష్మినుండి సంపద నుత్పత్తిచేయు కర్షకులే సామ్రాజ్యాధీసుల వైభవములకు మూలములన్న సత్యమతనికి సాక్షాత్కరించినది. చక్రవర్తియను గర్వ

గరిమ లేక దాని నిల్లు వెల్లడిచేసినాఁడు. పురవర్ణనమును పురస్కరించుకొని—

"నృపుల పదహాల రేఖల కెల్ల మా భు
జాగ్రహాల రేఖలే మూలమనుచు కోటి
కొండలుగ ధాన్యరాసు."

లను పండింతురు హాలికులు. తన సామ్రాజ్య సౌధమునకు పునాదులయిన యీ కృషికుల జీవనమును గూర్చి యీ రాజకవి కెంత శ్రద్ధయో యాతని యాముక్తమాల్యదను బట్టి మనకు విశదమగుచున్నది. ఎడనెడ నాతఁడు చిత్రించిన హాలిక జీవనాంశములు మనకాతని హృదయమును పట్టియిచ్చుచున్నవి. క్లిష్టరాజ కార్య సమ్యక్పర్యవేక్షణాంతరముల నాతఁడు వారి యోగక్షేమము లరయుచుండెఁబోలు. విశాలమైన దేశమును తనయేలుఁబడి క్రిందకుఁ దీసికొని వచ్చినంతనే రాజధర్మము నెఱవేరదు. తనరాజ్య మెంతయైనను అందు చెఱువులు పంటకాలువలు నిర్మించుటయు, పేదలకు పన్నులలో సదుపాయము చూపుటయు అతని యాదర్శములు.

"దేశ వైశాల్యమర్థసిద్ధికిని మూల
మిల యొకింతైన గుంట కాల్వలు రచించి
నయము పేదకు సరిఁగోరువన నొసంగి
ప్రబలఁజేసిన నర్థధర్మములు పెరుగు."

అని యామునాచార్యుఁడు తన కుమారున కుపదేశించిన రాజనీతి వ్యాజమున దానిని వెల్లడించినాఁడు. అర్థసిద్ధి ధర్మసమన్వితమై యుండుటయే యాతని యభిమతము. నేఁటి ప్రభుత్వములు అధికోత్పత్తికై నిర్మింపఁబూను ఇరిగేషను ప్రాజెక్టులు, వ్యవసాయకులనుండి వారి యాదాయము ననుసరించి క్రమాభివృద్ధిగ పన్నులు వసూలుచేయు విధానము శ్రీకృష్ణదేవరాయల యాదర్శమునం దుండెనని దీనివలన స్పష్టమగుచున్నది. అందువలననే యాతఁడు తన ప్రజల కంత ప్రీతి పాత్రుఁడయ్యెను.

అతివృష్టి, అనావృష్టి మున్నగు నీతిబాధలు కలిగి నష్టపడినపుడు, రైతులు పన్నులు చెల్లింపలేక పశువులను, ఇండ్లు వాకిండ్లను వదలుకొనిపోవుట యాకాలమున జరుగుచుండెను. శ్రీకృష్ణరాయ సార్వభౌముఁడు అట్టివారి నుపేక్షింపక వారిని పిలిపించి తగిన సహాయము చేయవలయుననియు, పెట్టుబడియిచ్చి మరల వ్యవసాయము చేసికొను సదుపాయములు కల్పింపవలెననియు తనయుద్యోగుల కాజ్ఞాపించెను. అట్లుగాక వారి ధాన్యములను, పసులను అమ్ముకొని వారియిండ్లు వంటచెఱకుగ నుపయోగింతురు లెమ్మను నధికారులు రణరంగమున వీరుల చావునే కోరు నక్కలవంటి వారనియు, అట్టియుద్యోగులు గల రాజునకు సప్తద్వీప సామ్రాజ్యము లభించినను సమృద్ధి యుండదనియు యామునాచార్యునిచేఁ బలికించినాఁడు.

ప్రజ నవసి చన్నఁబిలువ కప్పములఁ గొలుచు
నమ్మి యిండ్లింధనముల కాయె ననెడి
కలని నక్కైన యధికారి గల నృపతికి
ఏడు దీవులు గొన్న సమృద్ధి లేదు.

ఇట్టి ధర్మాత్ముఁడైన నృపతి యైశ్వర్యము ఉత్తరోత్తరాభివృద్ధి నందుటయు, వాఁ డవతార పురుషుఁడుగ స్తుతింపఁ బడుటయు నబ్బురమా ?

కృష్ణరాయల ఈ యభిప్రాయముల కనుగుణముగనే యాతని వర్ణనములును సాగినవి. ఇతర ప్రబంధాలు పోయిన త్రోవను కవి సమయములతో, ఉత్ప్రేక్షాతిశయోక్తులతో ప్రకృతి లక్షణములను మాత్రము వర్ణించి యూరకుండక స్వానుభవముచే నరసిన విషయములను చిత్రించుచు ఈ కవితా ప్రావీణ్య ఫణీశుఁడు వానిపైఁ దనయభిరుచుల కనురూపముగ వ్యాఖ్యానమును గూడ సంతరించినాఁడు. ఋతువర్ణనమున ముఖ్యముగ నాతని దృష్టి హాలికునిదృష్టి. వర్షాకాలవర్ణనము దానికై మొగము వాచియున్న కర్షకులను చేర్కొనకుండ సంపూర్ణమగునా? కాళిదాసు విప్రలంభ శృంగారరస బంధురమైన తన మేఘసందేశ కావ్యమునందును "త్వయ్యాయత్తం కృషిఫలమితి భ్రూవికారానభిజ్ఞైః, ప్రీతిస్నిగ్ధైర్జనపదవధూలోచనైః పీయమానః" అనుచు జానపదులు కృషిఫల సంధాయకుఁడగు జలదుని సందర్శింపఁ జూపిన యౌత్సుక్యమును పేర్కొనక విడువలేదు. తెనుఁగు కవులలో ఈ వాస్తవిక దృష్టిని విశేషముగ ప్రదర్శించినవాఁడు శ్రీకృష్ణరాయలే.

ఎంతో ఎదురుచూచిన వర్షాకాలము ఉఱుములతో, మెఱుపులతో నేతెంచినది. వర్షములు కురియగనే హాలికులు పొలములు దున్న నారంభించిరి. ఒక్కదానిని గూడ విడువక యుండఁగల పసులెల్ల దున్నుటకు వినియోగించుకొనఁబడినవి. అదను మించిపోకుండ దున్నుట పూర్తి చేయవలెను మఱి. మెట్టచేలయందలి

తెగని యావురు గ్రుబ్బలు, జొనుమళ్లయందలి దమ్ము లును పసువులకుఁ జాల శ్రమ కల్గించుచున్నవి. దున్న పోతులకు మెట్టుగుక్కరయు, ఎద్దులకు దమ్ముచేయు టయు మఱింతకష్టము. మనసాహితీ సమరాంగణ సార్వభౌముఁడు హాలికజీవనమందలి యీ ప్రధా నాంశము నిట్లు వర్ణించి యున్నాఁడు:

కాలుని దున్న నందినయి గంటెలు
  దున్నక మంటివా మహో
కాలుని నంది దున్నలినయి కర్దమ
  మున్నతిలేక మంటివా
హాలికు లెన్నఁడుం దెగని
  యారులచేలను జొనుమళ్ళనుం
గాలలి నేరుసాగి రిలఁగలు
  పసింగొని పేదమున్నగన్.

దున్నల శ్రమఁ జూచి యెద్దులకు, ఎడ్లకష్టముఁ గన్న దున్నలకు జాలి కలిగించునంతి తీవ్రముగా సాగు చున్నవి దుక్కిపనులు. యముని వాహనమైన దున్న పోతు తాను ఎద్దును కాకపోవుటచే గంటెదుబ్బులు దున్నవలసిన యవస్థ తప్పినదనియు, శివుని వాహన మైన నంది తాను మహిషమును కావంగున దమ్ములు చేయవలసిన బాధ తప్పినదనియు సంతసించుచుండెను. అవి తప్ప లోకమునఁగల మఱియే దున్నయు, ఎద్దును ఆపనిని తప్పించుకొనఁ జాలవయ్యెను.

హాలికులు దమ్ములు చేయునప్పుడు బురద త్రొక్కఁగా నందుండిన నీరుకట్టులు వారికాళ్ళకు జుట్టుకొనెను. నీరుకట్టలు ప్రమాదరహితములైన పాములు. అవి యగపడినను జంపరు రైతులు. అవి వారి కాలికిఁ జుట్టుకొన్నప్పుడు పసిమిరంగుగల వానికడుపు పైభాగము కన్పడుచు, పొలము దున్నుటలో మాయంతి వారు లేరని తమ ఘనతను ప్రదర్శించుటకు హాలికులు కాళ్ళకు వేయించుకొన్న బంగరు గండపెండెరము లేమో యన్నట్లు భాసించెను.

"వరఁజూ బడి రొంపిఁ ద్రొక్కఁగం
జరణంబులఁజుట్టె పసిడి చాయకడుపులం
బొరి నీరుకట్టెలమరెను బిరుదులు
హాలికులు దున్నఁ బెట్టిరో యనఁగన్"

కవితా చాతురీ ప్రశంసా సూచకముగ కవీశ్వ రులకు, సమద శాత్రవ విదళనమునకు శూర సింహు లకు బిరుదులుగ గండపెండెరములు తొని పాదమున నొడిగి సత్కరించు గుణపక్షపాతియగు నా సమ్రాట్టు ల్లజుడు లోకమున కంతకు నన్నదాతలగు హాలికప్రకాం డులకును నట్టిగండపెండెరములు వేయుట సముచిత మని భావించినాఁడు.

వర్షాకాలములందు పొలములు దున్నుట, విత్తన ములు చల్లుట మున్నగు పనులు పూర్తియైనతరువాత కొంతకాలము రైతులకు విశ్రాంతియుండును. ఆ దిన ములలో ఉదయము, సాయంకాలము మాత్రము పోయి పొలములు చూచి నీరుపెట్టి వచ్చిన చాలును. ఈ కాల ములోనె మధ్యాహ్నము నిద్రించుటకు వారి కవకా శము. వేసవిలో పొలముల మరమ్మతు పనులు జరుగు నప్పుడు వారికి విశ్రమించుటకు తీరికయుండదు. వర్షా కాలములో ఉన్నదానితో తృప్తిగ భుజించి రెడ్ల— గాఁతులసీమ ప్రాంతమున వీరే ప్రధాన వ్యవసాయ కులు—ముసుగు పట్టినందున శీతనివారణార్థము కుంపటి పెట్టుకొని పండుకొందురు. వారు భుజించునది వేఁడి వేఁడి సన్నగుగల యన్నము. గుగ్గు, చెంచలి, తుమ్మి, లేఁత తంటెపాకు పీనితో చింత చిగురుచేర్చి సమృద్ధిగ నూనెపోసి వండిన కూర పరియన్నము, నెయ్యి. వింత వింతరుచుల కూరలు లేకున్నను వారికి చింతలేదు. పశు వులు మేఁతకు పొలములకు పోయినవి. లేఁగ దూడలన్న వారికి మక్కువ యెక్కువ. వానిని తమ మంచము కోటకే కట్టివేసికొనిరి. అవి మచ్చికతో తమ యజమా ని రొమ్ములు నాకుచుండెను.

గుగ్గుం జెంచలి తుమ్మి లేఁదగిరి
సాకుం దింత్రిణీ పల్లవో
త్కరముం గూడఁ బొరంటి
నూనియలఁ గట్టావి ఘుట్టారు గో
గిరము లెక్కి తిమిన్ బసుల్ పొలమునోఁ
  ద్రోపులెమ్మియున్నాక మేఁ
తెరువుం గుంపటి మంచమెక్కి రి
  ప్రభుత్వకాప్తి రెడ్లజడిన్.

ఈ సౌఖ్యమే యా సరళజీవనులకు ప్రభుత్వాధి కారమెల్ల చేఁజిక్కినంత యానందముఁ గూర్చు చుండెను. సంతృప్తియే కదా సౌఖ్యమునకు మూలము. అవనీ ప్రభుత్వము ఇంతకంటె నధిక సౌఖ్యావహమని తోఁపలే దాసార్వభౌమునకు!

ఇంటికడ పెద్దరికము ఈ విధముగ ప్రభుత్వము నెఱపుచుండ పసులం దోలుకొని పొలములకుఁబోయిన వారి పాలికాఁపులు మఱొక విధముగ నానందించు చున్నారు. వారు ప్రొద్దున నేపోయి సాయంకాలము వఱకు మఱల యిండ్లకుఁ దిరిగిరారు. వారి యంగనలు తమ భర్తలకొఱకై ఓగిరము తీసికొని పోవుదురు. వారి ఆహారము అంబలియే. అంబలికుత్తి యే బుట్టలోనో పెట్టుకొని వాన ముసురులో తడువకుండ జమ్ముగూడ పైన వేసికొని వారు పొలములకుఁ బోవుదురు. అప్పటి కప్పుడే—భాద్రపద మాసము నాఁటికి—జొన్నలు మొదలగు పునాసలు కంకులతో నొప్పుచుండును. పొల ములోనున్న ఆ పాలికాఁపు కొన్ని కంకులను కోసి కొనివచ్చి దులిపి పిసికిళ్ళు రాల్చును—ఈ పిసికిళ్లకు దోఁద బిఱ్ఱుమని కొన్ని ప్రాంతముల నాముక—అవి తాను తినుటకేగాక తన కంబళిఁదెచ్చు ప్రియురాలి కిచ్చుటకుఁగూడను. తన గుడిసెలో నిల్లాలిఁకు పిసికిళ్లు సిద్ధముచేసి యుంచినంతలో నంబలి దుత్తతో నాతని ప్రేయసి వచ్చును. జమ్ముగూడ లోనికిఁదెచ్చిన నంబలి నీళ్ళు కాఁజే పొడి నేలయంతయు బురదయగును. కాన నామె దానిని ద్వారమునకే తగిలించి లోనికివచ్చును. ఆమెయు జవరాలు; అతఁడును వయసుకాఁడు. పైన ముసుగు. విస్రబ్ధ వివిక్త ప్రదేశము. అతఁడు గూర్చి యుంచిన పిసికిళ్ళు వారిరువురును మెసవుదురు. ఆనం దాంబుధి నోలలాడుదురు.

ఈ జానపదుల యానందజీవనము జగతీపతులను గూడ నువ్విళ్ళూరించునది. కృత్రిమ సౌందర్యములకు అభినయ బహుళమైన నాగరిక శృంగారములకు పుట్టి నిండ్లయిన అంతఃపురములలో నిట్టి వినిర్మలానందము నకు తావెక్కడ?

వర్షాకాల వర్ణనమున వలెనే శరద్వర్ణనమునఁ గూడ నీ రాజకవి తన కభిమాన విషయమైన పొలములు సస్యములు మున్నగు వ్యావసాయిక జీవనాంశములపై తన భావ చాలనము గావించినాఁడు. శరదృతువు వచ్చు నప్పటికి ప్రకృతి క్రొంగ్రొత్త శోభలు వెలార్చును. వరిచేలు పంట ముఖమునకు వచ్చియుండును. పండిన వరిచేలలోని వెన్నులు కొనిపోవుటకై చిలుకలు బారులు తీర్చి దొంగుచుండును. ఆకసమున బారులు గట్టి వరివెన్నుల ముక్కులఁగొని గూండ్లకు బోవు చుండు చిలుకల దండునుజూచి కవి యిట్లు ఉత్ప్రేక్షించినాఁడు.

> గూండ్లకై శాలిమంజరుల్గొనుచు మూఁగి
> యంబరమ్మునఁ బఱచు కీరాళు లొప్పెఁ
> బసరు టొంటొంటి యాకుతోఁ బండెబారి
> ఛేన ధియమున నెగసిన చేలనంగ.

కోఁతలకాలము చేరవచ్చినంగున కోసి వేయుదు రన్న ధియముచే వరిచేలు ఆకసమున కెగసినవా యన్నట్లు వరివెన్నుల ముక్కులఁగఱచుకొనిపోవు చిలు కల బారులు దూపట్టెను. పొలమంతయుఁబండి పసిమి రంగు వచ్చినను వెన్నుకడ నొక్కొక యాకుమాత్ర మింకను పచ్చగానే యున్నంగున చిలుకల వన్నెను బోలియుండెను.

ఆ కాలమున నెక్కువగనుండు చిలుకలు మున్నగు పక్షుల రాయిడినుండి పంటలను రక్షింపవల యును. ఆ పని సాధారణముగ పడఁతులే చేయుదు రు. గురుతరమైన యితర కృత్యములు పురుషులు చేసికొనుట కవకాశము కల్పింతురు. ఆ గోపికారాజి సౌభగమును వర్ణించునెడ మన కవీంద్రుఁడెంతయో చమత్కార మును జూపినాఁడు. మన్మథునికి సాహాయ్యము సేయఁ బూనుకొన్న రతీదేవి యోజనమంత పైనిలిచి యాతని వారువములకు చిలుకల వదల్చుచు, వానినిఁ దోలుటకై విపరీతకలువ మొగ్గలు దూరమేఁగకపోఁగా ఉరోజములు జడలును, కదలనట్లు చప్పట్లు చఱచుచు వారు దూప ఱుల హృదయములను దూఱఁగొనుచుండిరి "ఏకాం తమునందున్న జవరాండ్రు నెపంబిడి పల్కరించు" టకై త్రోవదుడిగిన తెరువరులకు చిలిపితనమున తప్పు త్రోవచెప్పి వారుపోవుచుండఁగ నా జాణలు బిట్టుగ నవ్వుచు, వఱులవారు వెనుదిరిగిన సిగ్గుపడుచుండిరి. వారొక ప్రక్క వరిచేలను, వేఱొకవైపున చెఱకుతోఁట లనుగూడ గాఁచుచుండిరి. చెఱకు కొంతకాలము వేసిన పొలమున వరియూడ్చి, యంతకుమున్ను వరి వేయు చుండిన చేనిలో చెఱకు వేయుదురు. కాళిదాసుని రఘువంశమునఁగూడ చెఱకుతోఁటల నీడలఁగూర్చుం డిన యిట్టి శాలిగోపికలు రఘువుకీర్తిని పాడుచుండినట్లు వర్ణింపఁబడియున్నది. "ఇక్షుచ్ఛాయా నిషాదిన్య స్తస్య గోప్తుర్గుణోదయమ్, ఆకుమారకథోద్ఘాతం శాలిగోప్యో జగుర్యశః"

ఈ పొలముకొఁపరి కన్నెల చిలిపితనము శ్రీవిలిపుత్తూరునందలి యారెకులకును దెలియును.

తలఁబక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ
కుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్స్నాత
ప్రభూత ద్విజా
వలి పిండీకృతశాటికల్నాఁ దదావాసంబుఁ
జేర్పంగ శే
పుల డిగ్గన్ వనఁబాఱు వానిఁగని నవ్వున్ శాలి
గోప్యోఘముల్.

ఆ గ్రామమందలి వరిమళ్లకొఱకేర్పడిన పిల్ల కాలువల రేవులలో ప్రభాతకాలమున బాతులు తమ తలలను ఱెక్కలలో దూర్చుకొని నిశ్శంకముగ నిద్రించుచుండెను. వానిం గాంచి పురరక్షణకై తిరుగు వారెకులు తెల్లవాఱుజామున నే స్నానము చేసిపోయిన బ్రాహ్మణులు మఱచిపోయిన దోవతుల పిండులనుకొని అవి యా విప్రులకందఁజేయుదమని నీటిలో దిగఁగా ఆ బాతులు లేచి పాఱిపోయెను. చెంత నేయున్న శాలిగోపికలు వారి పొరపాటును జూచి కిలకిల నవ్విరి. మఱి ఆ రెకులకు కోపమే వచ్చెనో? వారును నవ్వుకొనిరో?

వరి, చెఱకు పంటలేగాక యీ శరత్కాలమున పసుపుపచ్చగ పండిన పండ్లతో దోసతోఁటలు ఒక వింత యందమును విరియించును. అది చూచి స్పందించిన ఆంధ్రభోజుని కవితాహృదయము ఇట్లు అభివ్యక్తినందినది.

ఆళిగిరి దండలాముల తదంబర బింబితమయ్యెఁ
బాకని
ర్దళిత మహోఫలౌఘ హరితచ్ఛద
కర్కరికావనాలి వాఁ
గలను వివర్తితచ్ఛదనికాయము లోపల
పాంసుర కిమం
బలఁతిగఁ దాల్చి వింటఁగనవయ్యె విపాండు
పయోద ఖండముల్.

సంధ్యాసమయము. మింట నెలెడల వరివెన్నుల కొఱకు తిరుగు చిలుకల పంక్తులు. వాని నడుమ ఈరెండపడి పసిఁడి వెలుఁగులఁజిమ్ము తెలిమొయిలు తునుకలు. నేలపై ఆకుఁబచ్చని దోసతోఁట, అందలి పసుపుపచ్చని అరముగ్గినపండ్లు — వానిలోఁ గొన్ని బాగుగ పండినందువన పగిలి లోపలి తెల్లనిగుంజు కానవచ్చుచుండెను — ఈ నేలపై నున్న వేఁటిఱెక్కల వలె నిగనిగలాడు నింగిని ప్రతిఫలించినవాయన పై దృశ్యమింపు గులుకుచుండెను. పలుమాఱులు పంట వలంతిని, కనులపండువుసేయు అందలి సస్యములను ప్రియమూఱ వరపినవానికిఁ గాని యిట్టి దృశ్యము చిత్రింప నలవియగునా?

గ్రీష్మకాల వర్ణనముఁ గూడ మిగిలిన యంశము లతోఁబాటు కర్షకులజీవనమును, వారికి ప్రియమైన పొలముల దృశ్యములను వర్ణింపక విడువలేదీ కవి వర్యుఁడు.

వేసవిలో వరిమళ్లకు నిరక్షేత్రములకు నెంత యెండకాసిన నంతమంచిది. నేల బాగుగ నెండి నెఱియలు తీయవలెను. కాని తోఁటల కా గ్రీష్మము ప్రాణాంతికము. పచ్చనితోఁటలు పురమునకు శోభావహములేగాక వేసవిలో చల్లఁదనమునకుఁగూడ నావశ్యకములు. అందుచే నవి వాడిపోకుండునట్లు కర్షకులు వానికి నీరుతోడుచుందురు. ఆ కాలమున కాలువలయందుఁగూడ నీరుండదు. అందుచే చెలుఁగని నీరుగల బావులనుండియే నీటిని తోడవలయును. నీటిని తోడుట కేతములు ప్రధాన సాధనములు. సామాన్యముగా గ్రీష్మఋతువులో తెల్లవాఱుజామున నే పని ప్రారంభించి జాము ప్రొద్దెక్కునప్పటికి విరమింతురు. ఇట్టి వేసవి తొలిప్రొద్దులందలి కర్షకజీవనము వివరించునొక రమణీయాంశము ఆముక్తమాల్యదయందు వర్ణింపఁబడినది.

ప్రాతర్వేళల నట్టినట్ట సొగసై పాటెల్లెఁ
గుంభోంభితో
ద్ధూతాంబు ధ్వని వాద్యమై మరుదిగం
పుంజీభవత్పాటల
వ్రాతామ్రేడిత సిక్తభూసురభిళారామంబు
కుల్యాబహు
స్రోతస్స్పందుల సంధుయంత్రవతిక్రోత్ప్రేరిత
సేయౌఘముల్:

నీరుతోడు నేతములు వంచుటకు ఇద్దఱు ముగురు నియమింపఁబడుదురు. వారు శ్రమాపనోదనముకొఱకు గొంతులు కలిపి ఉచ్చైస్స్వరమున పాటలుపాడుచుందురు. ఆ పాటలకు బావిలో ఏతిపుఱాలు

మునుఁగు శబ్దము మృదంగవాద్యమువలె నొప్పుచుండెను. వేసవిలో తెల్లవాఱుజామున వీఁచువల్లని తెమ్మెర తిరఁగలపై తేలి కూడుచు ఆ గానము ఎంతయో మనోహరమై వినవచ్చును. ఆ కాలమున విరిసి తోఁటలయందు రాలిన పాటల పుష్పముల పరిమళము, నీరు పెట్టిన కాలియుండిన నేలనుండి విసలు వెలార్చి సొంపును వానికాపుటములకు విందులొనరించుచుండును. పలెలయందలి తోఁటలలో నిట్టి గానము, పరిమళము చవిమాచిన వానికి పట్టణజీవితము నిస్సారమై పేవగింపు కలిగించుననుట అతిశయోక్తి కాదు.

పురవర్ణనముల యందుఁ గూడ నీకవి పార్శ్వభాగముఁ డిల్లే విశిష్టతను గన్పఱచినాఁడు. మహారాజనగరమును వర్ణింపఁబూనిన పదట్టి నాగరిక శోభను వివరించి శ్రీ విలుబుత్తూరు వర్ణనమునందు మాత్రము గ్రామీణ జీవితమునందలి విశేషములను గూడ నుగ్గడించినాఁడు. అందెల్లెడల కోరకిత వారిశశ్యోరుహములు నిండుకొనియుండెను. సస్యసమృద్ధమైన గ్రామమునఁబండు వరి రకములెన్ని ?

పారిదిం జేర్చిన తీఁగమల్లియలు,
ఖర్జూరంబులున్, పుష్ప మం
జరులున్, మామిడి గుత్తులున్,
కుసుమముల్, సంపెంగలున్, పన్నగ
స్నగలున్ పాళులుగల్గి రాజనపుఁ
గాంతిం దారుము ల్వ్యాపి చే
లరుదారన్ వరుపువ్వుఁదోటల
బలాకానీక దంభంబునన్.

తీఁగమల్లియలు మొదలగు పేర్మితో నొప్పుటచే పూఁదోఁటలతో సామ్యము వహించి రాజనములచే వానిని మించినవై బలాకవ్యాజమున వానిని నపహసించుచున్నవఁట ఆ పురమునందలి వరిచేలు. ఇన్ని వరి రకములతో కృష్ణరాయల కెవ్వఁడు పరిచయమో ? విష్ణుచిత్తుఁడు తన యింటికతిథులుగ నరుదెంచిన భాగవతులకు శీతకాలమున 'పుముఁగుండావి సవోదనంబు' పెట్టువాఁడఁట. రాజనపుధాన్యము పుముఁగు సువాసనగలిగి యుండుటచే శ్రేష్ఠమును, రాయల కెక్కుడు ప్రియమైనదియును. అందువల్లనే గావలయు 'పెఱుమడికెత్తిన నీరును దిగియల రాజనపు మడికి నెక్కినట్లు' అని పేర్కొనపరి రాజనపుప్రశంస చేసినాఁడు. వరిచేలేగాక శ్రీవిలుబుత్తూరున కలుగుండ్ల తోడ నీస్వాదు పెనుబండ్లు వ్రేలుచు పనసలు, మహిమంపిలి చీరుచు వ్రాలియుండు గెలలు గల సుగంధి కదళీవన పంక్తులు, పోకతోఁటలు, అరుఁదోఁటలు మున్నగు వివిధ ఫలజాతులును పెంపుమీఱి యున్నట్లు వర్ణింపఁబడుట అచటి ధైశ్వర్య సమృద్ధిని మాత్రమే గాక కవీశ్వరుని యభిరుచి విశేషమును గూడ ఘోషించుచున్నది.

ఇట్లు వర్ణనముల యందుఁ దన కృషిక జీవనాభిరతిని వెల్లడించుటయే గాక రాయలు ఉపమానసామగ్రి నెన్నుకొనుటలోఁ గూడ దానిపై యాదరమును ప్రకటించినాఁడు. యామునాచార్యుఁడు తన కుమారునికి రాజనీతి నుపదేశించుచు "శత్రువులతో సంధి చేసికొనియో, తన దుర్గముల బలసంపద మూలముననో రాజ్యమును దండయాత్రల భయము లేకుండఁ జేసికొని యాపిమ్మట దేశమందలి క్షుద్రశత్రువులఁ బరిమార్పవలయునని చెప్పి దానికి "మును దన పీను చేసికొని... వెండిచేని మెత్తనకయి వేరు వెల్లకియుఁ ద్రవ్వు కర్షకునట్లు" అని దృష్టాంతమును జూపెను. ఎంతయో సహజమును, సుశోభనమునైన దీ పోలిక. కాని అంతఃపురాంతర్వర్తియగు స్త్రీజనానికి అటి జీవనము దిక్కించి లేనివానికి ఇది బోధకట్టునా ? అట్టే నృపుఁడు ధర్మార్థకామములనెడు త్రివర్గములందును సమాదరము వహించియుండవలయు ననియు, నొకప్పుడు ధర్మాంశమే హెచ్చించిన లాభమేయని చెప్పుచు నుపమానముగ "పెఱుమడి కెత్తిన నీరును దిగియుల రాజనపు మడికి నెక్కినట్లు" సంతోషింపఁ దగినదే యని తనయభిమాన విషయమునే ప్రస్తావించెను. విషయము గంభీరమైన రాజనీతియయ్యును సామాన్య కర్షకజీవనమందలి యుపమానములతో దానిని సుగమ మొనరించుట రెంటియందును సందివేసిన చేయి యగు వానికే సాధ్యము.

ఇట్టి యాదరాభిమానములఁ దన రాష్ట్రమునందలి కర్షకులను అరసి పాలించినవాఁడు గనుకనే

తొలఁగెను ధూమకేతు క్షోభ జనులకు
నతివృష్టి దోష భయంబు వాసె
కంటకాగమ భీతిఁగడచె నుద్ధత భూమి
భృత్కటకం బెల్ల కెత్తువడియె
మాసె నఘనార్తి మరు భూము లందును
నెల మూఁడు వానలు నిండఁగురిసె
అబాల గోపాల మఖిల సద్వ్రజము
నానందమున మున్కి నతిశయిల్లె
ప్రజల కెల్లను గడు రామ రాజ్యమయ్యె
చారుసత్త్వధుర్యుఁడీశ్వర నారసింహ
భూ విభుని కృష్ణరాయఁ డభ్యుదయ మొంది
పెంపు మీఱంగ ధాత్రి పాలింపుచుండ !

# కాంతి చక్రాలు

శ్రీ ఉండేల మాలకొండారెడ్డి

రాణికిఁ, బేదరాలికిని, రంగుల సానికి, నేకరీతిగా
నానెముఁగూర్చి, ఐదువతనమ్ము మిడఁజాలు మహార్ఘ సంస్కృతి
ప్రాణమ్ము లివ్వి, గాజులు, సువర్ణ మణిస్థగితమ్ము లెల్ల పూఁ
బోణులు! రండు! కైకొనుఁ డపూర్వము లీ నవకాంతి చక్రముల్.

సీతమ్మ ముంజేయి చెందమ్మి మొగ్గకుఁ
        గింజల్కముల నతికించినాఁడ,
తరుణ విద్యార్థినీ కరశాఖాశాఖికల్
        వంచి, క్రొంజిగురాకు లుంచినాఁడ,
తెరమీఁది చిత్రాంగి మెఱుఁగు కైదీవెలు
        నిమిరి, పూఁజొంపముల్ నింపినాఁడ,
కార్మిక సుందరి కర కార్ముకములకు
        గజ్జెల శింజిని కట్టినాఁడ,

        చిఱునగవై పరిచయముగఁ జిగురుఁబోండ్ల
        కరము లలరింపఁగల కళా పరిణతుండ,
        విశ్వమెఱిఁగిన గాజుల బేరగాఁడ,
        వెలుఁగు వలయాలు మీకయి నిలుచువాఁడ!

మ్రోగించుఁడీ రతనాల వీణియలు మీ ముంజేతు లల్లాడుచోఁ,
సాగించుఁడీ నిరతమ్ము మన్మథ ధనుర్జ్యాటంకృతుల్ ప్రోల్లస
ద్రాగమ్ముల్ మొలకెత్త మీ ప్రియుల చిత్తక్షోణి; సమ్మోహన
శ్రీ గేహమ్ములు వీని నొక్కపరి సంసేవించి చూడందగున్.

మెరుగు మీఁగడతోఁడి పెరుగు చిల్కెడి కాపు
        కన్నెముందు నటించు కవ్వమునకు,
సిరులిచ్చు వరిపంట తఱుఁగు మాలెతల కు
        ప్పిడులఁ గ్రోల్లుటకు లవిత్రములకు,

కమ్మని గుత్తివంకాయ తాళింపు చ
యృన దించు నిల్లాలి యంగుళులకు,
బిలిబిలి ముద్దు పల్కుల ముత్తెములు చెక్కు-
కవయిత్రి జాళువాంగటమునకు,

ఆ పసందు, రసస్ఫూర్తి, అబ్బఁగలవె
నా మలారములోఁ గొంటెనవ్వ నవ్వ
గాజుల సరాల మధుర నిక్వణము లేక?
కళలు నేర్చిన కలకంఠి కంకులార!

ఇవి మించుఁ దీవెలు, నవ వధూమణి బంధ
సంగతి మోహ ముప్పొంగఁ జేయు,
ఇవి యింద్రచాపముల్ యువతి కరస్పర్శ
సజ్యమ్ములై సుమాస్త్రములు కురియు,
తరుణ మృణాళవల్లరు లివి, దాంపత్య
సరసిలోఁ బ్రేమపుష్పములఁబూయు,
నెలవంక లివి గేహినీమణి ముంజేత
నటియించి, శోకాంధ పటలమడఁచు,

ఆదిమ సువాసినుల నుండి, ఆధునిక సు
వాసినుల దాఁక మెప్పుల నందుకొన్న
మాననీయ సౌందర్య సామగ్రు లివ్వి!
తొడిగి, సరిచూచి, మూల్యమ్ము లిడుఁడు సిదప.

పూత పిందె కాఙు లేతమామిడికొమ్మ
గాజు మట్టెలున్న కలికిమిన్న,
నిత్య చైత్రలక్ష్మి, నృత్యకేళీశాల
ఆమె కాలుమోపి నట్టినేల.

గాజు లొలిచివేసి, గడియారముంగట్టి
తిరుగు బస్తిపడుచ! తెలిసికొనుము!
శిశిర శీతవాత శిథిల వల్లికవోలె
చిన్నవోయె నీదు చిన్నిచేయి!

# మంచు శిఖరం

'కొలకలూరి'

ముక్కాలి పీటమీద కూర్చున్న రమేష్, ఎదురుగా వున్న చెక్క పెట్టెమీద చేతిలోని కత్తి నిలువుగా పొడిచాడు. ఠకీమని శబ్దంవచ్చింది.

వెనుక వెన్నెముకమీద ఏదో పెద్దబరువుబలంగా ప్రాకినట్లయింది. కరెంటు షాక్ లాగా త్రుళ్ళిపడ్డాడు. ఒళ్ళుజలదరించింది. గగుర్పొడిచింది.

చెక్క పెట్టెలోనికి దిగినకత్తి బుడ్డిదీపం కాంతిలో తళుక్కు తళుక్కుమని మెరుస్తోంది.

శరీరంలోని రక్తాన్నంతటినీ కూడదీసి, చేతిలో కూర్చుకొని నరాలన్నీ బలంగాబిగబట్టి, కత్తిపిడిమీద చెయి వేశాడు రమేష్.

ముఖం నల్లగా బొగ్గులాగావుంది. కళ్ళుకుంచించుకుపోయాయి. పళ్ళు నోటిలో ఒకదాన్ని మరొకటి బలంగా నొక్కుకుంటున్నాయి. మధ్యనున్న మెత్తని పెదాలు ఒత్తుకుపోతున్నాయి. ముక్కు పుటాలు కంపిస్తున్నాయి. నొసటిలో ముడతలు పడ్డాయి. వెంట్రుకలు జీరాడుతున్నాయి.

రమేష్ కుడిచెయ్యి కత్తి పిడిమీద బలంగా నొక్కిపట్టివుంది. ఎడంచెయ్యి వెంట్రుకల్లో దూరబడి పిడికిలి ముడుచుకొంది. జుట్టు చిక్కు చిక్కుగా లేగింది.

'ఇవాళ రాత్రి చాడీశ్వరి గుండెల్లో ఇది దూసుకు పోవలసిందే'

కత్తివైపు చూశాడు రమేష్. అతను స్థిరనిశ్చయం గలవాడు.

'పాపిష్ఠిపీనుగ! గుండెల్లోంచి దూరబడి వెన్నెముకను పగలదీసుకొని వీపుమీదగా రావాలి'

అతనిముఖం మినుకు మినుకు మనేదీపం కాంతిలో అస్పష్టంగా గోచరిస్తోంది. వెలుగునీడలలా వ్యాపిస్తున్నాయి. అతనిముఖంమీద చీకటి—కత్తిమీదవెలుగు—చీకటీ—వెలుగూ—.

'దానిరక్తంలో కత్తి స్నానంచేస్తుంది'

బలంగా వత్తిపట్టిన కత్తి చెక్కలోకి అరంగుళం దిగింది. తల క్రిందకువ్రాలింది. కత్తి పిడిమీద పిడికిలి, పిడికిలిమీద నొసలు.

'దానిముఖం చెక్కాలి'

పక్కనకత్తిపెట్టుకున్నాడు. మరోక్షణంలో నెమ్మదిపడ్డాడు. కార్యక్రమమాలోచించుకున్నాడు. దీపం వెలుగుతోంది. వెలుగు ముఖంమీద పడుతోంది ఆలోచిస్తున్నాడు.

ఇవాళఉదయమే తను కలకత్తా పోతున్నట్లు చాడీశ్వరితో చెప్పాడు. అందుకుతగ్గట్టే కలకత్తా ట్రెయిన్లో బెర్తు రిజర్వు చేయించుకున్నాడు. మరొకణ్ణి తనటికెట్టుమీద కలకత్తా పంపుతున్నాడు. తను వ్రాసి వాడికిచ్చిన వుత్తరం కలకత్తాలో వాడు పోష్టు చేస్తాడు. చాడీశ్వరి హత్యతో తనకే ప్రమేయమూ లేనట్టు గట్టిగాసాక్ష్యం. అది తనతో నువ్వు కలకత్తా వెళ్ళవద్దు అంది. దానిమీదట తను తిరస్కరించాడు. అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. బయలుదేరినట్లుకూడా కబురుచేశాడు. సాయం సమయం దాటింది. వూళ్ళో వున్నట్లు ఎవరికీ తెలియకూడదు. వూరికి కొంచెం ప్రక్కగావున్న హాల్లో పిక్చరుకెళ్ళి, బాక్సులోంచి మధ్యలోనే బయటకువచ్చాడు. తనువూళ్ళో తన విషయం తెలిసిన చాడీశ్వరి తప్పకుండా వాణ్ణి మేడలోకి పిలపించుకుంటుంది. దొరికిపోతుంది ద్రోహి, నమ్మకహరాం. తప్పకుండా దొరికిపోతుంది. రమేష్ పళ్ళు పటపట లాడించాడు. చప్పున పైకిలేచాడు. చకచకా వాలుగడుగులు తలుపుదాకా వేశాడు. తలుపుదగ్గర కొంచెంసేపాగి, తిరిగివచ్చి కూర్చున్నాడు.

'వాళ్ళిద్దరూ ఇంటివద్ద దొరికిపోతారు. వీలుంచే వాడు కూడా సఫా'

"చేతిలోని కత్తి ఒక్కసారిగా గట్టిగా వత్తాడు"

ఏకధారగా వర్షం చినుకులు నెత్తిమీద పడుతున్న గమనించని రమేష్ బట్టలు బాగా తడిసి

చలిపుడుతున్నప్పుడు గ్రహించాడు, తను బాగా తడిసి పోయినట్టు.

క్రిందభూమి బాగా తడిసిపోయింది. ఆ తాటాకు చిల్లుల్లోంచి వాననీరు టుపుక్కున ఒక్కొక్క బొట్టుపడుతోంది. ఒక్కొక్కచోట ఏకధారగా వర్షం. తడికగోడలోంచి జల్లు గదిలోకి వస్తోంది. తడిక తలుపు గాలికి ఎడాపెడా కొట్టుకొంటోంది వర్షం గదిలోకి వస్తోంది.

ఝుమ్మున ఈదురుగాలి తోలింది. రోడ్డుమీద ఎలెక్ట్రిక్ దీపంకాంతిలో వర్షం చినుకులు మెరుస్తూ కురుస్తున్నాయి. పట్టణం నిశీధ నిశ్శబ్దంలో నిద్ర పోతోంది. పోలీసుల విజిల్సు రెండో మూడో విని పించాయి. కారుచీకటి ఆకాశాన్ని క్రమ్మివేసింది.

ఈదురుగాలి తోలింది. ఒళ్ళు పులకరించింది. చలి పుట్టింది. పైగా బట్టలన్నీ తడిసిపోయాయి పాడుచలి! చంపుకు తింటోంది. అసలు వంటరిజీవితం కూడదు చాడీశ్వరి—చాడీశ్వరి పాపిష్టి పీనుగ!

ఈదురుగాలి తోలింది. ఎదురుగా ట్రంకుపెట్టె వుంది. దాంట్లో బట్టలున్నాయి. అదిమాత్రం తడిసి వుండవు. వెలుపలవున్న బట్టలు తడిసిపోయాయి. పొడి బట్టలేదు. చలిపుడుతోంది. ట్రంకులోంచి బట్టలు తీసి వేసుకోవచ్చు దుప్పటి కప్పుకోవచ్చు.

వర్షం బాగా కురుస్తోంది. బట్టలు వేసుకున్నా, దుప్పటికప్పుకున్నా తడిసిపోతాయి బటలు పెట్టె లోంచి తీయటం అనవసరం. అలాగే తడిసినచాపమీద కూర్చున్నాడు.

పాడుకొంపలు! అద్దెపుచ్చుకొనేంతవరకేగాని కప్పిద్దామనే ఉద్దేశ్యమే వుండదు వీళ్ళకి ఛీ! ఈమురికి పేటలోని యిళ్ళన్నీ యింతే!

ఈదురుగాలి. చలికినరాలు పోలకర్పుకు పోతున్నాయి. తనచుట్టూ నీరు ముట్టడించింది. చలితీవ్ర పెడుతోంది.

తళుక్కున కత్తి మెరసింది!

అది చావాల్సిందే! తనని ఎన్నివిధాల ఉపయో గించుకోవచ్చో అన్ని విధాలా ఉపయోగించు కొంది. అది తనని నమ్మింది కదా అని తనువూహించ నైనా వూహించని, తనకుజరిగిన ఈ ద్రోహాన్ని నిదర్శన పూర్వకంగా నిన్నకళ్ళారచూశాడు. ఒకవేళ దానిదగ్గర తప్పులేదనుకోవచ్చు. అయితే అనల్లాడు ఎందుకు దాని మేడదగ్గర కొస్తున్నాడు. ఇది సమాధానం దొరకని ప్రశ్న! దాన్ని హతమారిస్తే తప్ప తనకు నిద్రపట్టదు.

టంగుమని మోత!

తత్తరపోయాడు రమేష్! కత్తికోసం వెతికాడు. చుట్టూ చూశాడు. కన్పించలేదు. చేతిని చూసుకున్నాడు చేతిలోవుంది. రెండోగంట మోగలేదు రెండోగంట వినిపిస్తుందేమోనని నిరీక్షించాడు, కాని విన్పించలేదు.

తాలూకాలోంచి కాపలావాడు మోగించిన గంట అది. టైం ఒంటిగంట! తను రెండుగంటలకు పనిపూర్తి చేసుకోవాలి అది తననిర్ణయం ఏర్పాటు! ఇంకొక్క గంట టైము!

వెనక కాలం ఒకసారి తీవ్ర పెడుతుంది ఉత్సాహ మిస్తుంది. మరొక్కసారి నిరుత్సాహ పరుస్తుంది. ఇంక గంటదాకా తనేమీ చేయకూడదు.

ఈదురుగాలి చలికి బటలు దోహదమిచ్చాయి, నరాలు కొరుక్కు తింటోంది పేడుచలి.

ఇలాంటి వర్షాకాలం, ఈదురుగాలి, చలికాలం. తనిప్పటికి ముప్పైకిపైగా దాటాడు. ఇంతబాగా తనే చలికాలంలోను పడలేదు.

చాడీశ్వరితో దాదాపు నాలుగు ఇంలాటి చలికాలాలు. సరిగ్గా ఇలాంటి పూరికొంపల్లోవుండి చలి మరిచిపోయాడు.

జేబు కొట్టిన నేరంతో జైలు శిక్షననుభవించి, ప్రారంభిస్తున్న క్రొత్త యవ్వనంతో బయటకు వచ్చిన తొలి దినాల్లో తను చాడీశ్వరిని కలుసుకున్నాడు. అప్పటికామె ఫలానా వాడిభార్య అనబడే స్థితిలో వుంది. దానితండ్రి ఎవరో అప్పట్లో తనకు తెలియదు. లైసెన్సుకూలీ రాఘవను, కొంచెం వయస్సు పైబడిన వాడు, దాని పెనిమిటి. జైలు గోడల్లోంచి విశాల విశ్వంలోకి వచ్చిన తనకు నచ్చింది, చాడీశ్వరి. అంతే దాన్ని తీసుకొచ్చి మరో పట్టణంలో కాపరం పెట్టాడు తను. ఏ ఇబ్బందీ లేకుండా జేబులు కొట్టే వ్యాపా రంలో దాదాపు నాలుగు సంవత్సరాలు కదిలి పోయాయి.

అయితే కాలగమనం సాఫీగాసాగలేదు. అనుగ్ర వక్రించింది.

ఈదురుగాలి తోలుతోంది. వర్షం పడుతోంది.

తలమీదపడిన వర్షంనీరు చెంపల మీదుగా ముఖం మీదుగా, జారుతోంది. తుడుచుకున్నాడు రమేష్.

పుటుక్కు పుటుక్కున పైనించి వర్షం చినుకులు పడుతున్నాయి. తడికగోడ జల్లు వేగానికి తట్టుకోలేక పోతోంది. ఒక్క వూపుతో వర్షమూ, గాలీ వచ్చి తడిక తలుపు నెట్టాయి. తలుపు తెరుచుకుంది. వర్షం గది లోకి వస్తోంది. రమేష్ లేచి తలుపు దగ్గరకు నెట్టి మళ్ళీ వచ్చి తడి చాపమీద కూర్చున్నాడు.

తను ఇలాంటి మూడు చలికాలాలు చాడీశ్వరికి దూరంగా వర్షానికి తడవకుండా, చలికి బాధపడకుండా, జైలు గోడలమధ్య గడిపాడు.

తను జైలుకు పోయింది కూడా దాని కోసమే. ఆనాడది బజారులో బట్టల షాపులో కనబడ్డ ఆ జరీ చీర కావాలని కోరటమే తప్పు. అదికోరింది బాగానే వుంది. ఆడదానికి అలంకారాలమీద ప్రేమ కదా! తన తెలివి తేట లేమయ్యాయి?

తను దాన్ని దొంగిలించటంలో తెలివి తక్కువ పని చేశాడు. షాపు దొరికిపోయినప్పుడు వూరుకున్నా పోయేది. రోషంతో షాపువాడ్ని చెట్న్ని చేశాడు. తరవాత తన వీపు పగిలిపోయింది. ఐదారునెల్లతో తప్పి పోవాల్సిన జైలు శిక్ష మూడు సంవత్సరాలకు పెరిగింది.

నిజంగా ఆ మూడు సంవత్సరాల్లో ప్రభుత్వం తన కెంతో అపకారం చేసింది. జీవిత గమనాన్ని మార్చింది. పురోగమనం కాదు. తిరోగమనం. చెడ్డమార్గం లోకి నడిచాడు, దొంగల్ని కాపాడే జైలులోంచి బైటకు వచ్చిన రమేష్.

విసురుగా ఈదురుగాలి తోలింది. తలుపు టపటపా కొట్టుకుంది. నరాన్ని కాటేసినట్లు చలి పుడుతోంది. టప్పున దీపం ఆరిపోయింది.

జైలుగోడలు. అరుపులు. చలి. బాధ. పోలీసులు. ఇనప కటకటాల నీడలు. దొంగలు. రౌడీలు. హంతకులు. మూలుగులు. అరుపులు, ఘోషలు. టూటులటకటకా. గుడ్డిదీపాల వెలుగు నీడలు. తాలూకాలోంచి గంటల మోతలు. టవున్లోంచి రేడియో వాగుడు. కలకలాలు. వరుసగా చిత్రంలాగా కదిలిపోయాయి. అన్నీ పూర్వ స్మృతులు.

ఉరుమురిమింది. మెరుపు మెరిసింది. ఎదురుగా వున్నకత్తి తళుక్కుమంది. చీకటిలో, చలిలో, కత్తిమీద చేయి వత్తిపట్టాడు రమేష్. ఎదురుగావున్న చెక్క పెట్టి మీద పెట్టాడు.

హత్యచేయటం నేర్పింది చాడీశ్వరి! దొంగతనం చెయటం మాత్రం నేర్పలేదు. హత్య చెయటానికి పురికొల్పింది. ఉత్సాహపరిచింది. అది నేర్పినవిద్యకు అదే బలికాబోతోంది.

దాని బలవంతంమీద ఆనాడు తను వాణ్ణి ఆనాడు హత్యచేశాడు.

తన అభిమతం ప్రకారం తనంత తాను చాడీశ్వరీని హత్యచేయబోతున్నాడు నేడు.

తను మూడు సంవత్సరాలు జైలు జీవితం గడిపాడు. బయటికి వచ్చిన మూణ్నెల్లకు కూడా తను ఆమెను చూడలేకపోయాడు అప్పుడది స్వంతకారులో బీచ్ కి బయలుదేరింది. ఆరోజు దాన్ని చూచినప్పుడు కూడా పోల్చుకోలేకపోయాడు.

చాలా ప్రయత్నం చేసింతరవాత, ఆ కారు వలన యింటిలో ఒకనాడు దాన్ని కలుసుకున్నాడు. మాట్లాడాడు. మాట్లాడింది. నీలాకాశంలో స్వేచ్ఛగా విహరించే పావురం బంగారు పంజరంలోంచి మాట్లాడినట్లు. ఇప్పుడు ఆమె ఒక ధనవంతుని భార్య.

తర్వాత చాటుమాటుగా నాలుగైదు నెల్లు తను చాడీశ్వరిని కలుసుకుంటుండే వాడు. ఆ కాల వ్యవధిలో ఆమె, భర్త మరణానంతరం భార్య ఆస్తికి వారసులయ్యేట్లు వీలునామా వ్రాయించుకుంది. ఆపైన తనని పురికొల్పింది పెనిమిటిని హత్య చేసేందుకు.

తను ఆ ధనవంతుని హత్యచేశాడు.

తనమీద నేరం లేకుండా పోయేందుకు మరి రెండు హత్యలు చేయవలసి వచ్చింది. ఆపనులు ముగించుకున్నాడు.

ప్రాణంమీద తీపివలన ప్రవాసం పోవలసి వచ్చింది. నిరాశాపూరిత హృదయంతో వెళ్ళిపోయాడు.

ఈదురుగాలితో చలి పుట్టింది.

ఒక ఈదురుగాలి చలికాలం పోయిందాకా తను ప్రవాసంలోనే ఉండవలసి వచ్చింది.

మళ్ళీ చాడీశ్వరి దగ్గరకు చేరుకున్నాడు.

అప్పటికామె ఆ ధనవంతుని పేరిట వైధవ్యం పుచ్చుకుంది. ఆ స్త్రీకి వారసురాలైంది.

చలిగాలి కొంచెం తగ్గింది. వర్షం తిరుగుముఖం పట్టింది. ప్రచండంగా గాలీ లేదు. ప్రళయంగా వానా లేదు.

ఆపైన చుట్టుప్రక్కల వాళ్ళు అనుమానించటం జరుగుతోంది. పల్లెనించి, పట్టణం వచ్చి, వ్యాపారం చేసి, లాభమూ, పేరు ప్రఖ్యాతులూ పొందిన ధనవంతుని దూరంచటం రమేష్. ఇలా తను చౌడేశ్వరిమేడలోనే దాదాపు మూడు వర్షాకాలాల చలిరోజుల్లో గడిపాడు.

ఇద్దరికీ వున్న సంబంధం శంకించటం జరిగింది. ఆ విషయం తనకుకూడా తెలుసు. ఒకనాడు తను దాన్ని అడిగాడు 'ఈ వూరు విడిచేద్దామని.' అది 'వద్దు, ప్రమాదం' అంది. తనాపైన ఏమీ మాట్లాడలేదు.

ఒకనాడు తను వూహించని విధంగా జరిగింది. అది తనకు ఏ కారణమూ చెప్పలేదు. కాని నెలదాకా మేడవైపు రావద్దంది. తను ఏ అవసరమోనని దాని ఆజ్ఞను శిరసావహించాడు. నెల పోయిన తరువాత దాన్ని కలుసుకున్నప్పుడు అది సలక్షణమే ప్రళయమై పోయింది.

తను దానిదగ్గరకు పోవటం, తిరిగి నిరుత్సాహముతో రావటం, నిన్నటిదాకా చేస్తున్నాడు. అనుకున్నప్పుడు, అవసర మున్నప్పుడు అడిగింది పొందలేక పోతున్నాడు. ఒకొక్కసారి అడగడానికే అవకాశం లేకుండా పోతోంది.

నిన్న ఉదయం వాడు ఇంట్లోకి పోవటం తను కళ్లారా చూశాడు. వాడలా నాలుగు సంవత్సరాలుగా వస్తున్న సంగతి నిసర్మన పూర్వకంగా తెలుసుకొని ఈనాడు ప్రత్యక్షంగా చూశాడు. హృదయం పగలగోసినంత బాధపడ్డాడు.

ఉరుమురిమింది! మెరుపు మెరిసింది! కత్తి తళుక్కుమంది!

'ఇవాళ ఇది దానిగుండెల్లో దూసుకుపోవాలి'

కోపంతో ముడుచుకున్న పిడికిలి విప్పి, కత్తి పెట్టి మీద పెట్టాడు రమేష్.

పటిష్ఠమైన తనకాళ్లు వణుకుతున్నాయి. కుడి కన్ను అదురుతోంది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. శరీరంలో ఏదో తొందర తొందరగా వుంది. తన విజ్ఞానాన్ని పూర్తిగా కూడదీసుకొని ఆలోచిస్తున్నాడు. వూపికతో మునిగాళ్లమీద నిలబడ్డాడు.

దీపం ఆరిపోయి వుంది!"

వెలిగించాలి!

జేబు వెతికాడు. రెండో, మూడో పుల్లలున్న అగ్గిపెట్టె తడిసివుంది!

'దీపం వెలిగించకపోతే ఏం?' తనలో తానను కున్నాడు రమేష్.

చీకటి—ఆకాశంలో, భూమిమీద, భూగోళములో, ప్రపంచంలో—అంతా చీకటి. చుట్టూచీకటి. గదిలో చీకటి. హృదయంలో చీకటి. చీకటికన్నా కాటుక కంటినీరు జారుతున్నట్లు ఒక్కొక్కబొట్టు వర్షం పడుతోంది.

టంగుటంగున తాలూకాలోంచి రెండు గంటల మ్రోతలు వినిపించాయి.

వంటికి కరెంటు అంటించినట్లయింది. అసంకల్పిత ప్రతీకార చర్యకు అలవాటుపడ్డ కండరాలు టక్కున రమేష్‌ని పైకి లేపాయి. వంగి పెట్టెమీద కత్తి అందుకున్నాడు. గుడ్డదీసి కత్తికి చుట్టి భద్రంగా జేబులో పెట్టుకున్నాడు.

బయలుదేరబోయాడు!

చలిగాలి తోలింది. బయట వర్షం ఒక్కొక్క బొట్టు పడుతూనే వుంది. తన వంటిమీద బట్టలు తడిసి వున్నాయి. చివరకు కత్తికి చుట్టిన బట్టకూడా తడిసింది. పొడిబట్టలు పెట్టెలో వున్నాయి.

జేబులో కత్తి చేతికి కదిలింది. తనకు వెంటనే హత్యవిషయం గుర్తుకొచ్చింది. బట్టల వ్యవహారం ఆలోచిస్తూ కాలం వ్యర్థం చేయకూడదు. వేసుకుంటే పొడిబట్టలు వేసుకోవటం. లేకపోతే లేదు. ఇక్కడ ఎక్కువ ఆలోచన పనికిరాదు హత్య జరుగవలసిన కాలమూ — దాని ఏర్పాట్లూ క్రమంగానే వున్నాయి. తానిక్కడ బట్టలు మార్చుకుంటూ కూర్చుంటే కాలం—ముహూర్తం—దాటిపోతుంది. ఆపైన పని జరగదు.

వెంటనే బయలుదేరాలి!

చలిగాలి!

రమేష్ ఎందుకో వెనుకంజ వేశాడు. మళ్లా అతన్ని ఏదో ఆలోచన చుట్టుముట్టింది. ఈ హత్య

సంపూర్ణంగా విజయవంతమౌతుందని తనకు నమ్మకం లేదు. ఉన్న పరిస్థితీ, ఆలోచించుకున్న విధానమూ, స్థూల దృష్టికి బాగానే వున్నాయి. కాని నిశితంగా పరిశీలిస్తే ఏదో లోపము వున్నట్లు తనకు క్షణక్షణమూ శంక కలుగుతూనే వుంది.

ఒక వేళ ఈ హత్యతో తను దొరికిపోవటం జరిగితే మళ్లీ స్వెట్టరు వేసుకోవటం జరగదు. ఆ మఫ్లర్ ని మళ్ళీ చూడలేడు. ఇవాళే ఇస్త్రీనుంచి వచ్చిన ఆ ఖరీదైన పాంటూ, షర్టూ తను మూడ్డం తటస్థించదు. వాటిని వేసుకోవలసిందే!

అతని ఆలోచన కార్యరూపం ధరించింది. పొడి గుడ్డ కత్తికి చుట్టాడు. అతనికి వెంటనే గుర్తుకొచ్చింది. ఎంత చెడ్డా తను రాజేశ్వరి యింటికి వెళుతున్నట్లు. నిద్రలో వున్నప్పుడు దాన్ని హత్యచేయటం కుదరక మేలుకునే వున్నప్పుడు చేయవలసివస్తే అది తనని చూచి ఏవగించుకునేట్టు గానీ, అనుమానించేట్టు గానీ వుండకూడదు.

ఈ విషయం గుర్తుకు రాగానే చొక్కా విప్పితీసి, అద్దాన్ని అందుకొని అలా వదిలేసి, దువ్వెన చేతికి తీసి, మామూలు క్రాపుతో పాపిటతీస్తూ తల దువ్వుకున్నాడు.

జేబులో కత్తి చేతికి తగిలింది. అతనికి జరగవలసిన విధానమంతా అలా చిత్రంలాగా మనః ఫలకంలో మెదిలింది. వెంటనే బయలుదేరాడు. కాలికి ముక్కాలిపీట తగిలింది. గదితలుపు వేశాడు. రోడ్డుమీదకు వచ్చాడు.

ఎక్కడో కుక్క మొరిగింది. దూరంగా తీతువు కూసింది. పొలిమేరల్లో నక్క అరచింది. వీధి గురక పెట్టి నిద్రపోతోంది.

రమేష్ నడుస్తున్నాడు!

పాడు చలి! మెడమీదవున్న మఫ్లర్ చెవుల మీదగా తలకు చుట్టాడు. రెండు జేబుల్లో చేతులు పెట్టుకున్నాడు. కత్తి చేతికి తగిలింది.

నడుస్తున్నాడు!

రెండో ఆట సినిమా అన్ని హాలుల్లో వదిలిపెట్టారు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. నిశాకన్య జడలాంటి తారురోడ్డుమీద, కొప్పులోని పువ్వుల్లాంటి వీధిదీపాల కాంతి పడి మెరుస్తోంది. ఇక్కడే కొంచెం వెలుగు.

నడుస్తున్నాడు!

రాజేశ్వరి ఆ కిటికీ దగ్గరగా నిద్రపోతుంది. ప్రక్కనున్న గొందిలోంచి, కిటికీ ఎక్కి, చెక్కలు నెట్టి, లోపలికి దూరబడి, నిద్రపోతున్న రాజేశ్వరిని పడకమీదే కత్తికి బలి యివ్వాలి.

ఆ ఆలోచనతో జేబులోని కత్తి గట్టిగా నొక్కిపట్టాడు. పళ్ళు పటపటలాడించాడు. గట్టిగా భూమిని వత్తిపట్టి నడుస్తున్నాడు.

నడుస్తున్నాడు.

రోడ్డు! రోడ్డుమీంచి దాటితే మలుపు. మలుపు తిరిగితే సందు. సందులోంచి నాలుగుబారల దూరంలో మేడ. మేడప్రక్కగా గొంది. గొందిలోంచి కిటికీ మీదకు మార్గం. కిటికీలోంచి గదిలోకి. గదిలో......

జేబులో కత్తికంటె ముఖంలోని పెదాల్ని గట్టిగా నొక్కిపట్టాడు రమేష్. బలంగా పెద్ద పెద్ద అంగలేసుకుంటూ పోతున్నాడు.

నడుస్తున్నాడు!

మలుపుతిరిగాడు. సందు దాటాడు. గొందిలోకి పోయాడు. కిటికీ ఎక్కాడు. కూర్చున్నాడు. ఇక లోపలికి దూకబోతున్నాడు. పడకవైపు చూశాడు. ఆశ్చర్యం! పడకమీద ఆమె లేదు. ఖాళీగావుంది. పరిశీలనగా చూశాడు. మసకవెలుగు. పడక బాగా నలిగి వుంది. తలుపుదగ్గర శబ్దమైంది. అటువైపు చూశాడు, కిటికీలో చెక్కప్రక్కగా నక్కి కూర్చున్న రమేష్. రాజేశ్వరి నిద్రకళ్ళతో తలుపు గడియ వేసింది. పడకవైపు నడుస్తోంది. ఆమె పడక పైన మేను వాల్చిందాకా రమేష్ చూశాడు. ఆ పైన వెనుదిరిగాడు. కిటికీలోంచి మెల్లగా దిగి, గొందిని విడిచి, సందుదాటి, మలుపుతిరిగి మేడనుంచి దూరంగా వచ్చి రోడ్డువైపు పరిశీలనగా చూశాడు రమేష్.

ఫర్లాంగుదూరంలో-రోడ్డు మలుపుతిరిగి మెయిన్ రోడ్డులో కలిసేచోట-మునిసిపాలిటీ ఎలెక్ట్రిక్ లైటు నీడలో, ఒక పురుషుడు కదిలిపోతున్న నీడను చూశాడు రమేష్. రమేష్ అప్రయత్నంగా పెదాలు కదిపాడు. 'వాడ్ని పంపించి వేసింది. ఆ వల్లకోటువాడు'

తను రోజూ రాత్రి రెండూ మూడూ గంటలప్పుడు వచ్చి, తిరస్కరింపబడి తిరిగిపోతున్నాడు. కొన్ని పూట్లు తలుపుతీయకుండానే పొమ్మనేది. కొన్ని

పాట్లు కసురుకొనేది. తిట్టేది. చివాట్లు పెట్టేది. ఏడుస్తూ చెప్పేది. లాలనగా బ్రతిమాలేది. డబ్బు ఇచ్చేది. మరి కొన్నిసార్లు తనకువచ్చే వాలుకుమాటలు చెప్పి, మధ్య పెట్టి వెళ్ళిపొమ్మనేది. మొత్తంమీద తనని వెళ్లగొట్టేది. ఎక్కువసేపు మాట్లాడేదికూడా కాదు.

ఇవాళ అలా కుదరదు. తను నాలుగు రోజుల నాడే ప్లాను వేశాడు. ఇవాళ వంటమనిషిని పంపేస్తుంది. దాని భర్తకు దూరంచుట్టమైన తను కలకత్తా వెళిపోయి నట్లు కావలసినంత సాక్ష్యం. ఆ వచ్చినవాడుకూడా వెళ్లిపోయాడు.

ఇప్పుడు యింట్లో అది ఒక్కతే!

జేబులో కత్తి గుర్తొచ్చింది. అది పరలోక యాత్ర చేస్తుంది.

అది మేలుకొనేవుంది. కిటికీలోంచి దూకి కార్యభంగం పొందేకంటే రోజూ వచ్చేవాడినే కనుక మామూలుగానే వాకిట్లోంచి పోయి, చేయదల్చుకున్న పని చేయటం శ్రేయస్కరం.

పోయి తలుపుతట్టాడు. సమాధానం రాలేదు.

మళ్లా తట్టాడు. జవాబు రాలేదు. కొంచెం సేపాగాడు. అది లేచినట్లుగానీ, నడిచినట్లుగానీ, తలుపుతీసే పద్ధతి వున్నట్లుగానీ తనకేమీ తెలియటం లేదు.

మళ్ళీ తలుపు తట్టాడు. బదులు లేదు.

పెద్దగా తలుపుమీదకొట్టి 'చాడీ' అని కేకేశాడు. ఆమె పలకలేదు. తలుపుతీయ లేదు.

రమేష్ అక్కడ నిలవదలుచుకోలేదు. వెనుదిరిగి పోయి, చరచరా మునుపటి కిటికీలో కూర్చుని చాడీశ్వరి పడకవైపు చూశాడు.

ఆమె మంచంమీద విలాసంగా పడుకుంది. నుదుటిమీద ముంగురులు కదలాడుతున్నాయి. మసక వెలుగులో చెక్కిలి ముద్దొచ్చేట్టుంది. శ్వాస సమంగా వస్తోంది.

చలిగాలికో, ఆమె విలాసవైఖరికో అతని వీపు పులకరించింది.

మెల్లగా కిటికీదగ్గరగా జరిగాడు.

ఆకాశంలో లేని చంద్రబింబం చాడీశ్వరి వదనంలో మెరుస్తోంది.

మెల్లగా, పిల్లిలాగా, అడుగుల్లో అడుగులు వేసు కొంటూ రెండో గదిలోకివెళ్లి లైటు వేశాడు. సన్నని దీపం వంటింట్లో వుంది.

చాడీశ్వరి పడకగది ప్రక్కనున్న గదిలోని వెలుగును పంచుకొంది. ఆమె లేవలేదు. ఆమె ముఖంమీద వెలుగుకిరణాల శాతం పెరిగింది. శరీరంమీదకూడా వెలుగు పడుతోంది

కోక! ఆశ్చర్యపోయాడు రమేష్. తను దాన్ని కలుసుకున్న మొదటిరోజుల్లో కట్టుకోమని కొని యిచ్చిన పట్టుకోక! ఇవాళ కట్టుకుంది. దానికున్న కోకల్లో యిది ప్రాణతుల్యమైంది. ఇవాళ వాడికోసం కట్టుకుంది

తాళి! నిలువునా చలించిపోయాడు రమేష్. తను తన చేతులతో దాని మెడలోకట్టిన తాళిలేపు కొచ్చిన రోజుల్లో, ఆరు సంవత్సరాలుగా అది దాని మెడలో తను చూడలేదు. దీని దొంగిలించిన నేరంతో కలుక్కుపోతూ చూశాడు. ఇప్పుడు మళ్ళా మాంగలి గాడు. ఏదెవడో దౌర్భాగ్యుడు లాగున్నాడు. తాళి కూడా కొనలేని బాపతు.

గాజులు! చేతులికి గాజులున్నాయి. రాక్షసుడికి లాగా కోపం ముంచుకొచ్చింది. పిచ్చికోపం.

చాడీశ్వరికదిలింది కొంచెం పక్కగా వొత్తిగిలి పడుకుంది. రమేష్ వెనక్కు తగ్గాడు.

జడ! పూలు!! జడవేసుకుంది. జడలో పూలమాల తురుముకొంది.

ఇవాళ పునిస్త్రీ వేషం. వాడితో లేచి పోడానికా? లేక ఈ వేషంతో ప్రతిరోజూ వాడికి దర్శనమా? పళ్ళు పటపట లాడించాడు రమేష్.

జేబులో కత్తి చేతికి తగిలింది.

కత్తి పైకి తీశాడు. తళుక్కుమని మెరిసింది.

పొడవడానికి వుంకించాడు.

వెన్నుముక మీద ఎవరో బలంగా చరిచినట్లైంది. త్రుళ్ళిపడి వెనక్కు తగ్గాడు.

చాడీశ్వరిని ఇప్పుడు పొడవవచ్చు. చనిపోతుంది. ఆ విషయంలో ఆటంకమేమీ లేదు. కాని తను దాన్ని పొడిచిన తరవాత కూడా ఆ వస్తున్న వాడెవడో తనకు తెలియదు. వాణ్ణి తెలుసుకోక పోతే లాభం లేదు. తెలుసుకోవాలి; వీణ్ణి లేపాలి.

తను కనుక్కో దలుచుకున్న విషయంతో నిజంగా తనకు ప్రమేయం లేదు. వాడెవడైనా తను చేయగలిగింది కూడా ఏమీ లేదు. తనకు అవసరంలేని ఆ విషయాన్ని తెలుసుకోక పోయినా ఫరవాలేదు. వాడికీ దీనికీ సంబంధం వుండటం ఖాయం. దీని చెడు ప్రవర్తనకు ఇదే బలి కాబోతుంది. వాడితో తన కేమిటి? దీన్ని పూర్తిచేయాలి.

కత్తి పైకెత్తాడు!

చాడీశ్వరి కదిలింది!

ఇది చేసుకున్న ఏ పుణ్యమో దీని జీవిత ప్రమాణం కొన్ని సెకండ్లు పెంచుతోంది, హాయిగా నిద్ర పోనిచ్చేందుకు. ఇది ఏమైతేనేం కొంచెం కదిలింది. దీన్ని లేపి, వాడెవడో? ఎందుకు వస్తున్నాడో? తెల్సుకోవాలి. దాని సమాధానాలు తను నమ్మడు.

తను దాన్ని లేపేది, అది చెప్పేది వినేందుకు. అది చెప్పింది తను విన్నా, నమ్మడు. చంపటం ఖాయం. మరి లేపట మెందుకు?

దీన్ని లేపి, తన కింత ద్రోహం చేసినందుకు, శక్తిలేని దానిగా చేసి, మాట్లాడ నివ్వకుండా, కదల నివ్వకుండా, అరవ నివ్వకుండా చేసి, చూస్తూ వుండగానే గుండెల్లో కత్తి గుచ్చాలి!

తనలో ఎందుకు రెండు రకాల భావాలు కలుగుతున్నాయో అర్థం కావటం లేదు. తను ద్వంద్వాతీతుడు. దీన్ని చంపటం ఖాయం. లేపటం అవసరం.

కత్తికి గుడ్డచుట్టి జేబులో పెట్టుకున్నాడు. లైటు వేశాడు.

ఆమె వీపుమీద చేయి వేసి చిన్నగా 'చాడీ' అని పిలిచాడు.

ఆమె పక్కకు వొత్తిగిలింది. దుప్పటి తీసి పూర్తిగా కప్పుకుంది.

'చాడీ!' పిలిచాడు రమేష్. ఆమె మెల్లగా కళ్ళు విప్పి, అతన్ని చూచి మళ్ళీ ముసుగు తన్నింది.

'చాడీ!' మళ్ళీ పిలిచాడు.

చాడీశ్వరి కళ్లు తెరచి, రమేష్‌ని గూచి 'మీరా' అని కళ్లుమూసి, చూస్తూ, తెరుస్తూ 'నిలుచున్నారేం కూర్చోండి!' వెనక్కు జరిగి, వెంటనే దుప్పటి తొలగించి, వాకిలి వైపు చూచింది. వేసిన గడియ వేసినట్లే వుంది. 'ఎలా వచ్చారూ?' తియ్యగా ప్రశ్నించింది నవ్వు ముఖంతో.

రమేష్ కిటికీ వైపు చూశాడు. ఆమె కూడా అటు చూచింది. కిటికీ తీసివుంది.

'ఏం అలా వున్నారూ?' ముఖంలోకి చూచి 'ఏం ఇలా వచ్చారూ?' కిటికీ లోకి చూచింది. వెంటనే తనే మాట్లాడింది. 'వాకోసమా?' నవ్వింది. రమేష్ మారు పలక లేదు.

ఆమె మళ్ళీ ప్రశ్నించింది, 'మధ్యాహ్నం కలకత్తా వెళ్తానన్నావు. నేనువద్దు అన్నా. వినలేదే అనుకున్నా. విన్నావన్న మాట?!' పకపకా నవ్వింది.

'నోర్ముయ్' పెద్ద పులిలాగా అరిచాడు రమేష్. వెంటనే ప్రశ్నించాడు. 'ఎవడు వాడు?' ఆమెవైపు చూశాడు. 'జవాబు చెప్పు'

'ఎవడు వాడు?' చిలిపిగా నవ్వుతూ మృదువుగా రమేష్ కళ్ళల్లోకి చూచింది చాడేశ్వరి.

'నల్లకోటువాడు. రోజూ యింటికివచ్చి వెళ్ళేవాడు. ఇప్పుడింట్లోంచి పోయినవాడు. ఎవడు వాడు? ఏకధాటిగా అడిగాడు రమేష్.

సున్నితంగా అతని భుజాలమీద చేతులు వేసింది. సౌమ్యంగా, మృదువుగా, లాలనగా చెక్కిళ్ళమీద మునివేళ్ళతో తాకింది.

రమేష్ ఒళ్ళు జలదరించింది. గగుర్పొడిచింది. పులకరించింది. వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

రివ్వున చలిగాలి రివట వచ్చింది.

ఒళ్ళు మునగదీసుకుపోయింది. ఆమె రెండు భుజాలూ బలంగా పట్టుకున్నాడు రమేష్. పట్టలేని తమకంతో ఆమె పెదాలు ముద్దుపెట్టుకున్నాడు. వేడి నిశ్వాస.

చాడేశ్వరిని దగ్గరకు లాక్కున్నాడు. మెడ చుట్టూ చేతులు పెనవేశాడు. షాక్! షాక్ కొట్టినట్లు వదిలిపెట్టాడు. దూరంగా జరిగాడు. ప్రశ్నించాడు 'ఎవడు వాడు?'

'ఇంటి ప్లీడరు.' ఆమె జవాబు చెప్పింది. అతని దగ్గరగా జరిగింది. అతను దూరంగాపోలేదు.

'అయితే ఎందుకొస్తున్నాడు?' మెత్తబడ్డాడు. మెల్లగానే అడిగాడు.

'ఆస్తి హక్కులు అన్నీ నాకివాళ వచ్చాయి—వచ్చినట్లే- ఇన్నిళ్ళనుంచీ ఆ ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఇవాళతో పూర్తయింది.' ఆమె గంభీరంగా పలికింది, తలగడక్రిందవున్న ఏవో కాగితాల కట్ట తీసిచూపింది.

'అయితే ఇవన్నీ ఏమిటి?' రమేష్ ప్రశ్నించాడు, వాటివైపు చూస్తూ.

'ఆస్తికి సంబంధించిన దస్తావేజులు మొదలైనవి' కాగితాలు తలగడక్రింద భద్రంగా పెట్టింది.

ప్రక్కగదిలో ఏదో శబ్దమైంది

'ఏమిటది' నిర్లక్ష్యంగా అడిగాడు రమేష్.

'ఏమో' అని పెద్దగా జవాబుచెప్పి, వంటగదివైపు చూచి, 'వెధవ పిల్లులు' అని లేచిపోయింది. మళ్ళీ తిరిగి వచ్చేసింది.

ఆపైన కొంచెంసేపు గది నిశ్శబ్దంగావుంది.

రమేష్ మాటలే నిశ్శబ్దాన్ని చీల్చివేశాయి. అతను ప్రశ్నిస్తూనే నవ్వుతున్నాడు! . ఈ ప్రశ్నకు మాత్రం తను సమాధానం తెలుసుకుతీరాలి. 'ఈ వేషమేమిటి?'

ఆమె టకీమని జవాబుచెప్పింది మృదువుగా. 'నీకోసం, నీ ఆనందంకోసం' అతని మెడకు చేతులు చుట్టింది. 'ఇవాళనుంచి మనం అడ్డులేని...'

'పతనం' పూర్తిచేశాడు రమేష్ చాడేశ్వరి చెక్కిలి స్పృశిస్తూ-

తలుపు తట్టినధ్వని.

రమేష్ తత్తరపోలేదు.

తలుపుతీసింది చాడేశ్వరి.

పడకమీంచి లేచి కత్తిజేబులో చెయిపెట్టుకు నిలబడ్డాడు రమేష్.

'ఇంటివద్ద లేడు' బయట కంఠం

రమేష్ వింటున్నాడు. ఎవరికోసం పంపిందో, మళ్ళా కోపంవస్తోంది.

'వచ్చాడు లే!' చాడేశ్వరి సమాధానం చెప్పింది.

రమేష్ కొంచెం తగ్గాడు.

'రమేష్ వచ్చాడా?' బయట స్త్రీ కంఠం.

'వచ్చాడులే నువ్వుపో' తలుపు గడియవేసి వచ్చింది, చాడేశ్వరి.

'ఎవరది' రమేష్ ప్రశ్నించాడు పడకమీద కూర్చుంటూ

'వంటది, నిన్ను పిలుచుకురాను పోయింది. ఇంటివద్ద లేవని వచ్చిచెబుతోంది' పడకమీద కూర్చుంది.

'నేను కలకత్తా వెళ్ళలేదని నీకెలా తెలుసు?' అనుమానంగా అడిగాడు.

'కలకత్తా రిజర్వ్‌చేసిన నీ టిక్కెట్టుమీద వంటదాని పింతల్లికొడుకు వెళ్ళుతున్నట్లు తెలిపింది. వాడీపాటికి కలకత్తా చేరివుంటాడు.' ముఖంలోకి చూస్తూ 'అవునుకదూ?'

'అవును చేరివుంటాడు' ఆమెను చూస్తూ 'నేనింటివద్దే వున్నట్లు నీకెలా తెలిసింది' ముఖం దించుకున్నాడు.

'నువ్వు మొదటిసారికి వచ్చి, రూం కెళ్ళినట్లు వంటమనిషి చెప్పింది. అది రెండోఆటకూడా చూచి నా దగ్గర కొచ్చింది. నీ విషయం చెప్పింది. నిన్ను పిల్చుకురమ్మని పంపాను. ఇంతలో నువ్వు వచ్చావు' ఆమె చెప్పటం ముగించింది.

అయితే నే చెప్పేదేం చేస్తుంది నీకు తెలుసునన్నమాటా?! అనుమానంగా అడిగాడు. అయితే అది ప్రశ్న.

'ఆపైన ఇంకేమీ తెలియదు.' ప్రశ్నకోరని జవాబు.

రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

రమేష్ చాడీశ్వరిని హత్య చేయదలచుకున్న కారణం ఆమెముందు పెడుతూ సామాన్యంగా మొదలెట్టి ప్రశ్నించాడు. 'చాడీ! ఇన్నాళ్ళుగా నన్నెందుకు నీరసిస్తున్నావ్? ఎందుకు చాడీ'

ఆమె హృదయంలోంచి మాట్లాడింది. మెత్తగా, మృదువుగా, తియ్యగా, 'ఆస్తి మనపేరిట వచ్చేందుకదంతా తతంగం రమ్మీ!' అతని తొడమీద తలపెట్టుకుంది.

'చాడీ!' చెక్కిలి రాస్తూ 'నిజం చెబుతున్నాను' ముఖంలోకి చూచి 'నిన్నివాళ హత్య చేద్దామనుకున్నాను. అందుకే వచ్చాను.'

'హత్యా!' చాడీశ్వరి అంది. తత్తరపోయిందనుకున్నాడు. రమేష్. 'అవును' సమాధానం చెప్పాడు. 'కాని హృదయాన్ని మార్చిన మనుషనన్ను మరో లోకంలోకి నెట్టేసింది!' ముంగురులు సవరిస్తూ 'అంతా మరిచిపోయాను.'

'నన్ను అపార్థం చేస్తావా?'

'ఇంకానా?' ఆమె పెదాలని మృదువుగా స్పృశించాడు.

'ఉండుండు! ఆగమంటే?' ఆమె లేచింది. రమేష్‌కు ఎదురుగా గోడమీద శృంగార రస స్వరూపిగా చిత్రించిన కాళికాదేవి పటం అలంకరింపబడి కనిపించింది. ఆమె వంటగదివైపు పోయింది.

ఒక్క నిముషంలో వచ్చింది.

బయట వర్షం పడటంలేదు. కిటికీలోంచి చలిగాలి దూకింది. కురిసిన వర్షం నీటితో మురుగుకాలువ వొడ్డులు పొంగుకొంటూ పరుగెత్తుతోంది. వెంటనే జేబులోంచి కత్తితీసి మురుగు కాలువలో విసిరాడు.

'బాబో!' అంది చాడీశ్వరి.

'ఇక భయంలేదు చాడీ!' లైటు ఆఫ్ చేసి దగరగా వచ్చి రెండు భుజాలూ గటిగా పట్టుకొని పడకమీద కూర్చోబెటి, ప్రక్కనే కూర్చున్నాడు.

ప్రక్కగదిలో ఏదో అలికిడయింది. రమేష్ గమనించలేదు.

ఆమె అతని ప్రక్కగా కూర్చుని ముద్దు పెట్టుకోటగాంది.

ప్రక్కగదిలోంచి అలికిడి, మనిషి నడుస్తున్నట్లుంది. వాళ్ళున్న గదిలోకి వచ్చినట్లయింది.

రమేష్ ఏదో అలికిడి అనుకున్నాడు. తలెత్తి ప్రక్కకు చూద్దామనుకున్నాడు. చాడీశ్వరి ముద్దు పెట్టుకొంటూనే వుంది. 'చూడకపోతే ఏం' అనుకున్నాడు రమేష్.

ఆమె ఒక్కసారి పెద్దగా దగ్గింది.

ఎవరో వ్యక్తి నడుస్తున్న శబ్దం సుకరంగా వినవస్తోంది.

రమేష్ రెండుభుజాలమీద చేతులు వేసి బలంగా ముద్దు పెట్టుకొంటోంది చాడీశ్వరి.

లేవబోయాడు. ఆమె అతని భుజాల్ని వత్తి పట్టింది. అతనింకా ప్రయత్నం చేస్తూనే వున్నాడు.

వంటగదినుంచి, హాలుదాటి, పడకగదిలోకి, మనిషినడిచి వస్తున్న సవ్వడి చక్కగా వినిపిస్తోంది. రమేష్ లేవటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు.

రమేష్ రెండుచేతులూ చాడీశ్వరి మెడకు చుట్టాడు. ఆమె సర్రున పైకి లేచింది. విదిలించి వేసింది చాడీశ్వరి.

కిటికీతలుపు చాడీశ్వరి మూసింది. కిటికీవైపు చూశాడు.

తలుపు తెరుచుకుంది. తత్తరపోయాడు. తలుపువైపు చూశాడు. వాడు—నల్లకోటు వాడు. వాడిచేతిలో కత్తివుంది. గుండెలకు గురి చూస్తున్నాడు.

కిటికీవైపు చూశాడు. మూసివుంది. చాడీశ్వరి వికటంగా నవ్వుతోంది. తలుపువైపు చూశాడు. తీసివుంది. తళతళల కత్తివాడు ముందుకొస్తున్నాడు.

చాడీశ్వరి వికటంగా నవ్వుతోంది! వాడు మీద కొచ్చాడు!

# వసంత గీతి

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

అతి గహనమ్ములౌ శత శతాబ్ద పథాల నతిక్రమించి యీ
ఋతువు మొయిళ్ళలో బరుగులెత్తెడి పూల రథమ్ము మీద సు
స్మిత సుమనోజ్ఞవై అధివసించిన ఓ ఋతురాజ్ఞి! నీకు స్వా
గత మరుదెమ్ము - రమ్ము - వనకారుల - కుంకుమ పౌళ్ళ దారులన్

శ్రమపడి నట్టిదౌక్క- తరుజాలమె కాదు—చరాచర ప్రపం
చము శిశిరమ్మునందు నగచాటులు పడ్డది రమ్మహో వసం
తమ ! సుమనో మనోజ్ఞ హరిదంతమ ! వన్య ముఖాలపైన ను
చ్చెమటలు వోని యీ యువము చెమ్మలనద్ది సమాశ్వసింపుమా !

దివి కెగిరిపోవు ప్రతి రజో లవమునకును
అలవరింపుమ యీ భువనాభిలాష !
కన్నె ప్రాయంపు చిన్ని మొగ్గలకు నెల్ల
గఱపుమా ! నవజీవనాకలితభాష !!

నవ కిరణ తంత్రుల రహించు భువన వీణ
నాలపింపుము నీవు హిందోల గీతి !
తలలు పంకించు పూలపై నలికులమ్ము
శ్రుతి మధుర మంద మంద ఝుంకృతులు సేయ!

# శ్రీ లలితాదేవి పునర్జన్మ జాతకము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

శ్రీమతి లలితాబాయి అజ్గాంకరుగారినిగురించి ఒక ఆశ్చర్యకరమగు కథ కలదు. ఇప్పు డామె కీర్తిశేషురాలు. బొంబాయి నగరములో సుప్రసిద్ధ ఘన వైద్యుడు శ్రీ యస్. శ్రీధర అజ్గాంకరుగారి సతీమణి ఆమె. పాశ్చాత్య దేశములలో డి. ఓ; డి. యల్. ఓ; యల్. యమ్; మున్నగు బిరుదముల నార్జించిన ప్రముఖ మధుమేహ నివారణ దక్షు డతడు. శ్రీమతి లలితాబాయి కాపురమునకు వెళ్లిన నాటినుండి క్రమక్రమముగా భర్త ఇంటిసంపత్తు, సుఖము, సౌభాగ్యము దినదినాభివృద్ధి నొందినవి. భర్తకు ప్రాణముగా, ఇంటికి లక్ష్మిగా, సత్సంతాన సౌభాగ్యములతో నొప్పుచుండిన ఆ సాధ్వీమతల్లి దైవభక్తికి, ఆచారశీలతకు, వ్రతనిష్ఠకు పేరు గాంచి యుండెను. ఏటేట, జ్యేష్ఠ శుక్ల పూర్ణిమనాడు భర్త సౌభాగ్యము వాంచించి "వట పూర్ణిమ" అను వ్రతమును శ్రద్ధతో ఆమె అనుష్ఠించుచుండెడిది. ఆనా డంతయు శుద్ధోపవాసముతో ఇష్టదేవతా పూజలతో గడపి, మరు దినమున వ్రతమును ముగించిపారణచేయుట ఆసుమంగలి వాడుక. ఇరువది అయిదు సంవత్సరము లిట్లు నిరంతరాయముగా జరిగినది. భగవంతుని కృపతో, భర్త అనుగ్రహముతో, తన ఇంటిలో ఆమె కే కొరంతయు నుండ లేదు.

కాని, చాలకాలముగా ఆమెకు మనఃక్లేశము కలిగించు పరిస్థితి యొక్కటి యుండినది. ఆమె జ్యేష్ఠ భ్రాత శ్రీయుత ఆర్. జి. సామంత్ బొంబాయిలో ప్రముఖ న్యాయవాదిసత్తముడు. ఏమి విధి వైపరీత్యమో, అతనికి సంతానము కలుగలేదు. అతని భార్యకు నలుబది వర్షంబులు వచ్చినా, మాలు నిలిచి నది కాదు. ఎన్నియో చికిత్స లయినవి. ఘనవైద్యు లెందరో, ఎన్నిమారులో పరీక్షించినారు. ఆమె గర్భకోశము శైశవావస్థ (Infantile Uterus) లోనే ఉన్నందున, ఆమెకు గర్భధారణము అసాధ్యమని తద్జ్ఞులు నిర్ణయించినారు. ఆ దంపతులు సంతాన విషయమున నిరాశ చేసుకొని తీరరాని మనఃక్లేశము ననుభవించుచున్నారనుటే ఈ సాధ్వికి గొప్పదుఃఖము. వదినెకు సంతానము కలుగవలెనని ఆమె ఎన్నియో వ్రతములు, పూజలు, సలిపెనట. అదే ఆమె తపస్సు! కాని, దైవము తోడుపడనిది, ఏ తపస్సు ఫలించగలదు?

భ్రాతృజాయను గర్భ ధారణ క్షమత్వము కోలుపోవు వయస్సు సమీపించుకొలది, లలితాబాయికి మనోయాతన దుర్భరముగుచు వచ్చినది. 6-6-1952 నాడు వాడుక చొప్పున ఆతపస్విని తన 'వటపూర్ణిమా' వ్రతము ననుష్ఠించినది. ఆమెకు పుట్టకురుపు (cancer) బాధ యుండినదట! ఐనా, ఆనెల వ్రతదీక్ష మానినది కాదు. ఆమె తపోబల మనన్యసామాన్యము. ఉపవాసముతో వ్రతము సలిపి, నాటి రాత్రి 1-40 A.m. (I. S. T.) కాలములో, ఆసుమంగలి దేహయాత్ర చాలించుకొని, తన బహిః ప్రాణములు భర్తను, సంతానమును, బంధుకోటినిసహా దరికానని దుఃఖ సాగరమున ముంచివైచినది. ఈజన్మమున తన ఏకైక మనోరథము నెరవేర్చుకొను భాగ్యమా పుణ్యశీలకు లభించినది కాదు. దైవగతి దుర్నివారము!

ఔర్ధ్వదైహిక విధులు సక్రమముగా జరిగినవి. ఆమరునాటి రాత్రి సుమారు 1 A. m. వేళలో శ్రీ సామంత్ ఇంటిలో మేలుకొని ఒంటరిగా కూర్చుండి యుండినాడు. కీర్తిశేషురాలగు తన సహోదరి అస్థులు తీసుకొని 'నాసికా' క్షేత్రమునకు పోయి గోదావరీ పుణ్యజలముల నర్పించు సంకల్పముతో, తన మోటారుకారు సారథిని రమ్మని చెప్పియుండి, అతని రాకకై శ్రీ సామంత్ కాచి యుండెనట! అప్పు డాకస్మికముగ అభూతపూర్వమగు దృశ్య మొకటి అగుపడగా, అతడు భ్రాంతుడైనాడు. కీర్తిశేషురాలైన లలితాబాయి ప్రత్యక్షముగా అతని ఎదుట నిలిచి యుండెనట! కన్నులను నమ్మజాలక స్వప్నము కాబోలు ననుకొని, తాను మెలకువతో నుండెనని స్థిర

పరదుకొనుటకై రెండుమార్లు దేహమును గిల్లుకొన్న తరువాత, అది స్వప్నము కాదని నిర్ధరించుకొనుటకు సామంత్ కు కొంతకాలము పట్టినది. కాని, చేతులార అగ్నిదేవుని కర్పించి భస్మము కావించిన సోదరి భౌతిక దేహమును మరల సాక్షాత్తుగా చూడగలుగుట ఎట్లో, అతనికి అర్థము కాలేదు. పిశాచ చేష్టయా? అట్టి తపస్సంపన్నురాలికి పిశాచ జన్మము వచ్చుట అసంభవ మని అంతరాత్మ బోధించినది. తపశ్శక్తిచే స్వప్నరూపమున ఆమెయే వచ్చియుండరాదా? ఎదుట నిలబడియున్న సోదరి చేయి పట్టుకొని మంచముపై కూర్చుండ బెట్టినా డతడు. కుశల ప్రశ్న చేసి, అతడు పారణ కాలేదనియు, కొంత కాఫీ కషాయము కాచి తెచ్చి ఇచ్చినచో, వ్రతపారణ అయినట్లు భావింతుననియు, ఆ వ్యక్తి కోరినదట! ఇంటిలో అతడొక్కడే ఉండుట. ఆకాలములో పాలు సంపాదించుట ఎట్లని, సామంత్ వ్యాకులపడుచుండగా, లోపల పాత్రలో పాలున్నవి చూడుమని ఆమెయే తెలిపినది. లోపలికి పోయి పాత్రలో పాలు చూచి సంతోషించి, తోడనే కాఫీ కాచి అతడు పాత్రలో కషాయము తెచ్చి ఆమె కిచ్చినాడు. ఆ కషాయమును తాను త్రాగుటకుమారుగా ఆ పాత్రను అతనికే ఇచ్చి, "నీవు త్రాగుము. అదే నాకు తృప్తి." అని చెప్పి, "శుభమగుగాక!" అని దీవించి ఆ వ్యక్తి ఉన్నదున్నట్లే అంతర్ధాన మయ్యెనట! మనో భావములలో ఆనందము, ఆశ్చర్యము, విషాదము, ముప్పిరిగొని, కొంతకాలము సామంత్ ను కకవికలు చేసినవి. నాల్గుగంటల వేళకు సారథిరాగా, ఆ కాఫీకషాయమును సామంత్ అతనికి త్రాగనిచ్చినాడు. తెలవారి డాక్టరు ఆజ్గోంకరు మున్నగువారీకథను విని ఆశ్చర్యమగ్నులైనారు.

ఇది పంధికవా, అనిపించునట్టి అత్యద్భుతమగు కథ ఇది. అభూత పూర్వము కాని, ఇది భ్రమ కాని, భావస్వప్నము కాని, కాదనుటకు ఆమెను కన్నులార చూచి, చెవులార ఆమె మాటలు విని, చేతులార ఆమెను చేయిపట్టి కూర్చుండబెట్టిన ఆమె అన్నగారి సాక్ష్యమున్నది. కాఫీ కషాయపుకథయున్నది. ఇది విశ్వసించకపోవుటకు మనకు ప్రబల కారణము లేదు. కాని, గతించినవ్యక్తి స్వస్వరూపముతో మరల అగుపడుటకు హేతువేమో, మాటలాడుట ఎందుకో, అంతర్ధానమగుట ఎట్లో, మన ఊహకు అందని విషయములు. మన సత్యశాస్త్రవేత్తలగు పరిశోధకులు కాని ఆధ్యాత్మ విద్యాపారంగతులగు యోగులు కాని, దీనిని దర్శించుటకు అర్హులు.

అది అట్లుండె. ఈ తపస్విని జాతక మెట్టిదో చూతము. కొల్హాపురములో (16°-42' ఉ. అక్షాంశ, 4.59'-24'' పూర్వ రేఖాంశకాలము) 8-9-1911 వ తేదిని బొంబాయి కాలమానమున 6-19 Am వేళలో ఈమె జనించినదట! భారత కాలమానములో ఇది 6-58 Am (I S T) అగును. ఈ కాలమునకు గుణించినచో, కన్యా రాశిలో 23¼° భాగ లగ్న మగుచున్నది. కాని, ఈ లగ్నము మరణకాలమునకు పరిపక్వ ఫలిత కేంద్ర యోగములు కాని, దైవిక కేంద్ర యోగములు కాని, చూపదు. అనుటచే, లగ్నశోధన పద్ధతు లుపయోగించగా, లగ్నము కన్యారాశిలో 20°-21' గా నిర్ణయింపగలదు. శుద్ధ స్పష్ట కాలము 6-46'-44'' Am (I S T) అగుచున్నది. ఈ కాలమునకు సాధించిన స్పష్టకుండలి ఇది:—

| | | | |
|---|---|---|---|
| జీవిత 27.28<br>పుణ్య 13-3<br>చ 6-58 | VIII<br>20-30 | రా 8-12<br>ఆశ 15.10<br>తపః 15-37<br>శ 20- 12<br>IX 20-39 | కు 1-5<br>X 20-48<br>యు 28-50 |
| ర25-43(వ)<br>V 20-39 | శ్రీ. శ్రీ.<br>శ్రీమతి లలితాబాయి<br>జాతకము<br>—<br>(సాయనము) | | మాహేంద్ర<br>2-18<br>ధృతి 8-55<br>ధరి 6-38<br>ఇ 23-8 |
| సంకల్ప<br>17-55 | కే 8-12<br>అవపాన<br>8-53<br>శు 10-42<br>III 20-39 | | ర 14-26-27<br>బు 17-22(వ)<br>I 20-21<br>పునర్వసు 24-23<br>శు 25-23 (వ) |

ఎంతో గొప్ప పూర్వపుణ్యముగల వ్యక్తి జాతక మిది. లగ్నమున కొకవైపున ఉచ్చబలముకలిగిన లగ్నాధిపతి బుధుడు, మరియొకవైపున భాగ్యాధిపతియై (నీచభంగము కలిగి) యోగకారకుడగు శుక్రుడు— పెరయుచు జన్మమునకు ఉన్నత స్థాయిని కల్పించి

వారు. ఇంద్రావరుణ, శనులనుండి వీరిపై శుభదృష్టి కలదు. భర్తృ భావములో లాభాధిపతి చంద్రుని సహవాసముతో పుణ్యసహాయ మున్నది. ఉపచయ (III) స్థానమందున్న సప్తమ భావాధిపతి గురువునుండి ఈ సహాయమునకు శుభదృష్టి రమ్యముగానున్నది. మృదు మధుర స్వభావము, ధార్మికచిత్తవృత్తి, నిర్మలశీలము, చక్కని తెలివితేటలు, ధారాళబుద్ధి, దయార్ద్ర హృదయము, అచంచల పాతివ్రత్యము, కల ఈ సువాసిని రాకచే భర్త గృహమున భాగ్యము పండుటేమి యరుదు?

ఈ జాతకములో మేరువుపూస నవమభావము (తపస్థానము) ఇది గొప్ప ప్రభావముకలది. ఆశా సహాయముతో చేరి తపస్సహాయము ఆ భావమందే కలదు. పంచమ (మంత్రి) భావాధిపతి శని ఆ భావ బిందువందే నిలిచి నాటికి నూరుపాళ్లు దీక్షాశక్తి నిచ్చినాడు. లగ్న భాగ్యాధిపతులగు బుధశుక్రుల అనుకూల (కోణ) దృష్టిసాహాయ్య మూ శనికి కలదు. ఉపజ్ఞా ప్రభావము వరుణునినుండి, భక్తిపరవశత ఇంద్రుని నుండి, మిత్రదృష్టివలన ఈ శని సంపాదించుకున్నాడు. అనన్యసామాన్యమగు ప్రతినిష్ఠతోటి తపోదీక్ష ఆ సువాసినికి అబ్బుటేమి ఆశ్చర్యము? భాగ్యభావములో పంచమాధిపతి శని ఇట్టి శుభ వీక్షణములో నుండగా, అభ్యుదయ సూచకమగు సంతానమేల కలుగదు? భర్తృసహాయము సప్తమాధిపతి గురువుయొక్కయు భర్తృ భావమునందున్న లాభాధిపతి చంద్రునియొక్కయు, శుభకటాక్షవీక్షణముల నందుకొని కళకళలాడుచున్నది. ఆదర్శప్రాయమగు అనుకూల దాంపత్యమామెసొమ్ము.

శ్రీ లలితాబాయి జీవితములో ఈ యోగములకు ఎంతో అచ్చుమెచ్చుగా సమన్వయము కుదురుచున్నదని చదువరులు గుర్తించియుందురు. కాని, మర జన్మాంతరము భౌతికముగా స్వప్నరూపములో మరల అగుపడుశక్తి ఏ గ్రహయోగపు ఫలమో, ఊహింప తావున్నది. మృతి సహాయములో మాహాత్మ్యసహాయము చేరియున్నదిగదా? మర జన్మాంతరము ఆమె దైవికశక్తి మాహాత్మ్యము వ్యక్తము కాగలదని అర్థము కాబోలు? అన్న ఎదుట ప్రత్యక్షమైన నాటికి ఆమె జాతకమునకు దైవికలగ్నము (మిథునరాశి 29 వ భాగ) జన్మ యమునిపై నుండినది. లయమునకు (annihilation), పునస్సృష్టికిని (regeneration), అంకితవేసిన చేయి యమునిదని పాశ్చాత్యపరిశోధకులు వ్రాసిరి. దైవికలగ్నమందలి యముని ప్రభావమా ఇది? అవునను టకు ఈ స్వల్పసామగ్రి చాలదు. కాని, కాదనుట కష్టము.

అదియట్లుండె. కీ. శే. లలితాబాయి మాహాత్మ్యము ఇంతటితో ముగియలేదు. తరువాతి కథ సయితము విచిత్రమైనదే. జ్యోతిశ్శాస్త్రముపై విశ్వాసము కలవారు ముఖ్యముగా గమనింపదగిన కథ అదే.

శ్రీ సామంత్ గారి భార్యకు గర్భధారణము అసాధ్యమని పలువురు ప్రసూతి తంత్ర వేత్తలగు వైద్య శాస్త్రజ్ఞులు నిర్ధరించియుండిరి కదా? ఆమెకు నలువది సంవత్సరములు వయస్సు. ఇక సంతానము కలుగునను ఆశ ఏది ? ఆ దంపతులు విచారముతో విరాళి చేసుకొనియుండినారు. కాని, గతించిన కొన్ని దినములకు శ్రీ లలితాబాయి అన్నకు స్వప్నములో పొడకట్టి, అనికి సంతానము కలుగవలెనని చాలకాలముగా తాను దైవమును ప్రార్థించుచుండెననియు, వదినెకు తప్పక సంతానము కలుగ గలదనియు, నొక్కి చెప్పినదట! శారీరశాస్త్రవేత్తల సిద్ధాంతమునకు, అనుభవమునకు సహా, ప్రత్యక్ష విరోధముగ నున్న ఈ 'స్వప్నవార్త' ను ఎవరు విశ్వసించగలరు? కొంత కాలమునకు లలితాబాయి అన్న స్వప్నములో మరల సాక్షాత్కరించి, "అన్నా! నీవు నామాట నమ్మలేదు. ఇప్పుడు వదినెకు నెలలు తప్పినవి. ఇప్పుడైనా, పరీక్ష చేయించుము." అని చెప్పినది. నెలలు తప్పిన మాట ఏమో, వాస్తవమే. కాని వయస్సును బట్టి అది ఋతువిరామమును సూచించినదని సామంత్ భార్య నమ్మినది. పరీక్షలకు పోయిపోయి ఆమెకు చాలియుండెను. మరల పరీక్ష అన్నచో, ఆమెకు తలనొప్పి 'నాకర్మ ఇంతే' అని మనస్సు రాయిచేసుకొని యుండినదామె. అయినా భర్తకు లలితాబాయి మర జన్మాంతరము సాక్షాత్కరించుట, అప్పుడప్పుడు స్వప్నములలో వచ్చి అతనికి వద్దు చెప్పుట తనకు నెలలు తప్పుట, ఈ వింతల తత్త్వమేమో కనుగొందమనుకొని, ఎట్టకేలకు, ఆమె సమ్మతించినది. ఆశ చెడ్డదికదా? లోగడ ఎన్నిసార్లో, ఆమెను పరీక్షించి తెల్లపదము పాడిన శ్రీ డాక్టర్ కరండే (యం. డి) మరల ఇప్పుడామెను పరీక్షించినాడు. మునుపటివలె నైరాశ్యస్థితిలో

వారు. ఇంద్రావరుణ, శనులనుండి వీరిపై శుభదృష్టి కలదు. భర్తృ భావములో లాభాధిపతి చంద్రుని సహ వాసముతో పుణ్యసహము మున్నది. ఉపచయ (III) స్థానమందున్న సప్తమ భావాధిపతి గురువునుండి ఈ సహమమునకు శుభదృష్టి రమ్యముగానున్నది. మృదు మధుర స్వభావము, ధార్మికచిత్తవృత్తి, నిర్మలశీలము, చక్కని తెలివితేటలు, ధారాళబుద్ధి, దయార్ద్ర హృదయము, అచంచల పాతివ్రత్యము, కల ఈ సువాసిని రాకచే భర్త గృహమున భాగ్యము పండుటేమి యరుదు?

ఈ జాతకములో పేరువుపూస నవమభావము (తపస్థానము) ఇది గొప్ప ప్రభావముకలది. అలా సహమముతో చేరి తపస్సహమము ఆ భావమందే కలదు. పంచమ (మంత్రి) భావాధిపతి శని ఆ భావ బిందువందే నిలిచి నూటికి నూరుపాళ్లు దీక్షాశక్తి నిచ్చి నాడు. లగ్న భాగ్యాధిపతులగు బుధశుక్రుల అనుకూల (కోణ) దృష్టిసాహాయ్యమూ శనికి కలదు. ఉపజ్ఞా ప్రభావము వరుణునినుండి, భక్తిపరవశతి ఇంద్రుని నుండి, మిత్రదృష్టివలన ఈ శని సంపాదించుకున్నాడు. అనన్యసామాన్యమగు వ్రతనిష్ఠతోటి తపోదీక్ష ఆ సువాసినికి అబ్బుటేమి ఆశ్చర్యము? భాగ్యభావములో పంచమాధిపతి శని ఇట్టి శుభ దీక్షణములో నుండగా, అభ్యుదయ సూచకమగు సంతానమేల కలుగదు? భర్తృసహమము సప్తమాధిపతి గురువుయొక్కయు భర్తృ భావమునందున్న లాభాధిపతి చంద్రునియొక్కయు, శుభకటాక్షవీక్షణముల నందుకొని కళకళలాడుచున్నది. ఆదర్శప్రాయమగు అనుకూల దాంపత్య మామెసొమ్ము.

శ్రీ లలితాబాయి జీవితములో ఈ యోగము లకు ఎంతో అద్భుతమెచ్చుగా సమన్వయము కుదురు చున్నదని చదువరులు గుర్తించియుందురు. కాని, మర ణానంతరము భౌతికముగా స్వస్వరూపములో మరల అగుపడుశక్తి ఏగ్రహయోగపు ఫలమో, ఊహింప రాకున్నది. మృతి సహమముతో మాహాత్మ్యసహమము చేరుకొన్నదిగదా? మరణానంతరము ఆమె వైయక్తిక మాహాత్మ్యము వ్యక్తము కాగలదని అర్థము కాబోలు? అన్న ఎదుట ప్రత్యక్షమైన నాటికి ఆమె జాతకమునకు దైవికలగ్నము (మిథునరాశి 29 వ భాగ) జన్మయము నిపై నుండినది. లయమునకు (annihilation), పునస్సృష్టికిసహా (regeneration), అందివేసిన చేయి యమునిదని పాశ్చాత్యపరిశోధకులు వ్రాసిరి. దైవికలగ్నమందలి యముని ప్రభావమా ఇది? అవునను టకు ఈ స్వల్పసామగ్రి చాలదు. కాని, కాదనుట కష్టము.

అదియట్లుండె. కీ. శే. లలితాబాయి మాహా త్మ్యము ఇంతటితో ముగియలేదు. తరువాతి కథ పయి తము విచిత్రమైనదే. జ్యోతిశ్శాస్త్రముపై విశ్వాసము కలవారు ముఖ్యముగా గమనింపదగిన కథ అదే.

శ్రీ సామంత్ గారి భార్యకు గర్భధారణము అసాధ్యమని పలువురు ప్రసూతి తంత్ర వేత్తలగు వైద్య శాస్త్రజ్ఞులు నిర్ధరించియుండిరి కదా! ఆమెకు నలు వది సంవత్సరములు వయస్సు. ఇక సంతానము కలుగు నను ఆశ ఏది? ఆ దంపతులీ విషయమున నిరాశ చేసు కొనియుండినారు. కాని, గతించిన కొన్ని దినములకు శ్రీ లలితాబాయి అన్నకు స్వప్నములో సాక్షాత్కరించి, అ నికి సంతానము కలుగవలెనని చాలకాలముగా తాను దైవమును ప్రార్థించుచుండెననియు, పదినెల తప్పక సంతానము కలుగ గలదనియు, నొక్కి చెప్పినదట! శారీరశాస్త్రవేత్తల సిద్ధాంతమునకు, అనుభవమునకు సహా, ప్రత్యక్ష విరోధముగ నున్న ఈ 'స్వప్నవార్త' ను ఎవరు విశ్వసించగలరు? కొంత కాలమునకు లలితా బాయి అన్న స్వప్నములో మరల సాక్షాత్కరించి, "అన్నా! నీవు నామాట నమ్మలేదు. ఇప్పుడు వదినెకు నెలలు తప్పినవి. ఇప్పుడైనా, పరీక్ష చేయించుము." అని చెప్పినది. నెలలు తప్పిన మాట ఏమో, వాస్తవమే. కాని వయస్సును బట్టి అది ఋతు విరామమునే సూచించినదని సామంత్ భార్య నమ్మినది. పరీక్షలకు పోయిపోయి ఆమెకు చాలై యుండెను. మరల పరీక్ష అన్నచో, ఆమెకు తలనొప్పి 'నాకర్మ ఇంతే' అని మనస్సు రాయిచేసుకొని యుండినదామె. అయినా భర్తకు లలితాబాయి మర ణానంతరము సాక్షాత్కరించుట, అప్పుడప్పుడు స్వప్న ములలో వచ్చి అతనికి సద్బుద్ధి చెప్పుట తనకు నెలలు తప్పుట, ఈ వింతల తత్త్వమేమో కనుగొందమనుకొని, ఎట్టకేలకు, ఆమె సమ్మతించినది. ఆశ చెడ్డదికదా? లోగడ ఎన్నిసార్లో, ఆమెను పరీక్షించి తెల్లపదము పాడిన శ్రీ డాక్టర్ కరందె (యం. డి) మరల ఇప్పు డామెను పరీక్షించినారు. మునుపటివలె శైశవస్థితిలో

లేక సామంత్ భార్య గర్భకోశము వయస్సునకు తగిన వికాసముతో నుండుటే కాక, చూలు సహా నిలిచి యున్నదని కనుగొని ఆ డాక్టరు ఆశ్చర్య చకితుడై నాడు. డాక్టరు రానేగారితో (ప్రత్యేకపరీక్ష Frog Test) చేయించగా, వాస్తవముగా గర్భమే అని తేలినది. లలితాబాయి మాహాత్మ్య మది యనుకొని సంతసించినారు సామంత్ దంపతులు. తరువాత మరల సామంత్ స్వప్నములో లలితాబాయి అగుపడి, అతని కూతురుగా తానే జన్మమెత్తి గలదని చెప్పినది. క్రమముగా నవమాసములు మోసిన తరువాత, గర్భద్వారపు సంకోచ స్థితి వలన సహజపద్ధతిలో ప్రసవము అసాధ్యమని వైద్యులు నిర్ధరించి, సామంత్ భార్యకు శస్త్రచికిత్స (Ceasarian Section) చేసినారు. రత్నమువంటి స్త్రీ శిశువు జనించినది. లలితాబాయి వరప్రసాదములచే ఆమె జ్ఞాపకార్థమై ఆ శిశువునకు "లలిత" అనియే నామకరణ మహోత్సవము జరిగెను. దైవానుగ్రహమున ఆ శిశువు అల్లారు ముద్దుగా పెరుగుచున్నది. తల్లిదండ్రుల భాగ్యఫలము ! (*)

జ్యోతిష విద్యార్థుల పరిశోధనమునకు అపూర్వము సామగ్రినిచ్చుచున్న కథ ఇది: సంతానము లేక కుందుచుండిన ప్రజావతికి కూతురుగా శ్రీ. శే. లలితాబాయి తానే పునర్జన్మమును స్వీకరించిన దనుట సత్యమయ్యె నేని, ఆమె జాతకము, కుమారి లలిత జాతకము సహా, ఆ విషయమున విశ్వసనీయమగు సాక్ష్యము నియ్యవలయును కదా? శ్రీ శాంతిదేవి పూర్వజన్మ పునర్జన్మ జాతకములను చిత్తగించిన పాఠక మహాశయులు ప్రశంసలోని జాతకములందలి సామగ్రిని సయితము పరిశీలించుటకు కుతూహలము చూపగలరని నా నమ్మిక. శాంతిదేవి పునర్జన్మ చరిత్రమునకు ప్రబలము ప్రత్యక్ష సాక్ష్యమున్నది. అట్టి సాక్ష్యము లలితాబాయి పునర్జన్మ విషయములో చూపట్టదనుట సత్యము. కాని, మరణానంతరము ఆమె స్వప్నరూపములో ప్రత్యక్షమై మాటలాడుట, స్వప్నములలో పలుమారు ఆమె తన ఉద్దేశమును సామంత్ గారికి తెలుపుట, గర్భధారణ మసంభవమని పలువురు వైద్యరాజులు సిద్ధాంతీకరించిన ప్రజావతికి తలవని తలంపుగా చూలు నిలుచుట, స్వప్నములో చెప్పినట్లే స్త్రీ శిశువు జనించుట, అనునవి ఈ కథలో సందర్భోచితము (Circomstancial evidence) ప్రబల సాక్ష్యములు. జాతకసామగ్రివలన ఈ సాక్ష్యమునకు దృఢమైన చేయూత లభించె నేని, లలితాబాయి పునర్జన్మను సత్యమని నిరూపించుటకు వీలగును కదా ? మాత్రము గాక !

జాతకము గొప్ప ప్రభావము కలదని కనుగొంటిమి. ధర్మత్రికోణ మనబడు లగ్న, పంచమ, నవమ భావముల నాశ్రయించియున్న గ్రహశక్తి లలితాబాయికి తపోదీక్ష, స్వార్థ త్యాగబుద్ధి, సంకల్ప దార్ఢ్యము, ఒసంగినవి. పదునారు సంవత్సరముల వయస్సునుండి తప్పక 'వటపూర్ణిమా' వ్రతమును ఆమె ఆచరించు చుండినదికదా ? ఇంతే కాదు. ఆమె జీవితమందలి ఏ మాహాత్మ్య విశేషములైనా, ఈ భావత్రయమే చూపవలసి యుండును. సాధారణముగా, పంచమమునుండి సంతానమునుగూర్చి, నవమమునుండి ప్రాపంచిక సౌభాగ్యమునుగూర్చి, ఫలముల నూహించుచు కాలక్షేపము చేయుట మనవాడుక. కాని, నెమ్మదిగా చూచినచో, ఆ భావములనుండి ఎన్నియో విశేషాంశములను కనుగొనగలము. అందులో అసాధారణ ప్రభావము గల జాతకముల విషయములో అట్టి పరిశీలన మవసరము.

"ఆత్మా రవి, శ్శీతకరస్తు చేతః
సత్వం ధరాజ, శ్శశిజోథ వాణీ,
జ్ఞానం సుఖం దేవగురు, ర్మదశ్చ,
శుక్ర, శ్శనిః కాలనరస్య దుఃఖం."

(కల్యాణ వర్మ)

ఆత్మను రవి, మనస్సును చంద్రుడు, సత్వమును కుజుడు, వాక్కును బుధుడు, జ్ఞానసుఖములను గురువు, కామమును శుక్రుడు, దుఃఖమును శనియు, తెలుపుదురని సంప్రదాయము. సకల సౌభాగ్యములలో నొప్పియున్న లలితాబాయికి వ్యసనకారణము ఉన్నచో,

(*) బెంగుళూరు నగరములో శ్రీయుత బి. వి. రామన్ గారిచే ఆంగ్లభాషలో ప్రకటించబడుచున్న 'అస్ట్రాలాజికల్ మ్యాగజైన్' అనబడు జ్యోతిష మాసపత్రికయొక్క 1957 జనవరినెల సంచిక 63 వ పుటలో, పూనానగరవాసి ప్రసిద్ధ మనస్తత్వశాస్త్ర పరిశోధకుడగు శ్రీయుత డాక్టరు వి. యం. భట్ (B. A; M. B. B. S.) గారు వ్రాసిన వ్యాసము నుండి పై అంశములు కృతజ్ఞతతో స్వీకరించబడినవి.

దానిని వృషభశనియే సూచించవలసి యున్నది. ఇతడు పంచమషష్ఠాధిపతి. సంతాన విషయకముగా ఆమెకు కొదవయుండుటకు కారణము లేదు. ఇక, పుట్టకుండువలని బాధ ఉండినది. దానితోనే ఆమె కాలధర్మము నందుట. కాని, అంతటి దైవభక్తి, వ్రత నిష్ఠకల సాధ్వి కాలధర్మమును గూర్చి వ్యసనపడుననుట అవిశ్వసనీయము. శని నవమభావములో నున్నాడు. ఆమెకు వ్యసనకారణము ఆభావమునకు సంబంధించిన విషయములలో చూపట్టు చేసెనో ?

జాతకములో జ్యేష్ఠభ్రాతను తెలుపునది ఏకాదశ భావము. దానికి సప్తమ స్థానమయిన పంచమ భావము భ్రాతృజాయను సూచించగలదు. ఆ భావమునకు అధిపతి శని వృషభరాశి 20 వ భాగలో నవమభావములో నున్నాడు. భ్రాతృజాయాస్థానమునుండి పంచమ మగు నవమభావమునదె సంతానమును తెలుపవలసియున్నది. ఆ భావములో శనియున్న 20° వ భాగ జననేంద్రియము నకు సంబంధించినది. శైత్యస్వభావముగల(Cold-ringed planet) శని అందుండి, భ్రాతృ భార్యకు గర్భకోశా దుల సంకుచిత స్థితివలన గర్భధారణాసమర్థతను సూచించుచున్నాడు. లలితాబాయి మనఃక్లేశమునకు కారణ మిది. ఆశాసహమము అనటనే యున్నది కదా? ప్రజాపతికి సంతానము కలుగవలయు ననియే ఆమె ఆశ. ఆ సహమము నే అంటియున్నది, తపస్సహమము. ఆ కోరిక నెరవేరుటకొరకే ఆమె వ్రతములు పూజలు సలుపుట. ఈ సహమములకు సంకల్ప కారకుడగు రవినుండి నిండుగా త్రికోణ హితదృష్టి యున్నది. ఈ పరిస్థితుల సౌకర్యముగల శని అచంచల తపోదీక్షను సూచించినాడు. అట్టి వ్రతదీక్షా సమయమందే ఆమె దేహయాత్ర చాలించుకొనుట. పాపము ఈ జన్మములో ఆ తపస్వినికి మనోరథమీడేర లేదు.

అవసాన కాలమునకు జీవమానదశాపద్ధతిలో ఎట్టి యోగము లుండెనో, చూతము. అప్పటి చలితగ్రహస్థితి ఈ క్రింది చక్రములో చూడనగును.

[చక్రము-చూ. ప్రక్క కాలము]

జాతకురాలికి 41 వ సంవత్సరముల వయస్సునకు వచ్చినదశ లివి:...

(1) చలిత లగ్నమునకు జన్మ రవి అర్ధకేంద్ర వేధ;

(2) చలిత రవికి ఇంద్రావరుణుల కేంద్రవేధ;

| | | | |
|---|---|---|---|
| | | రా 1-3<br>పుణ్య 2-45<br>జీవిత 15-30<br>శ 18-30 | కు 10-58<br>ఆశ 26-0<br>తపః 26-30<br>యు 28-58 |
| V 28.0 | చలిత<br>—<br>జాతకము<br>1952 - జూన్<br>(సాయనము)<br>— | | ఇ 23-47<br>X 28.0 |
| సంకల్ప 28-0<br>వ 25-28 | | | మృతి10-15 |
| అవసాన<br>10-30 | కే 1-3<br>పునర్జన్మ3-0<br>గు 18-24 | బు 20-16<br>ర 24-17<br>I 28.45 | చ 13-30<br>శు 15-53 |

(3) చలితచంద్రునికి రవి సంయోగము.

ఆయువుపట్ల మూడును ఏక కాలములో వేధపా లయినవి. జీవమానదశలో ఇట్టి వేధ సాధారణముగా మరణమును సూచించగలదు. వీనికి తోడుగా, పరిస్థితుల నెడిగించి ఇచ్చిన ఇతరయోగము లెట్టివో, గమనింతము.

(4) చతుర్థ (పాతాళ) భావాధిపతి గురువు చలించి చలితశనితో సమసప్తక వేధకు వచ్చినాడు. అవసానమునకు శని హేతువనుట. దీర్ఘవ్యాధి (షష్ఠాధిపతి శని) ఒకటి ఉండనేయున్నది కదా?

(5) చలిత పుణ్యసహమము లగ్నాధిపతి బుధునితో పార్శ్వకేంద్రవేధకు వచ్చినది.

ప్రారబ్ధకర్మ ముగిసినదనుట.

(6) అష్టమ (మృత్యు) భావాధిపతి కుజుని చలితస్థానమునుండి పంచమభావమందలి వరుణునికి పార్శ్వకేంద్ర శత్రుదృష్టి.

తలవనితలంపుగా, ఆకస్మికముగా, దేహత్యాగము నిది తెలుపగలదు.

(7) చలితమృత్యుసహమము జన్మగురువునకు నాడు కేంద్రము.

అవసాన సూచక మిది. అవసానకాలములో ఉత్తమభావము లుండెనని ఈ యోగము తెలుపగలదు.

(8) చలితావసానసహమము వరుణుని అర్ధ కేంద్రమును, చలిత కుజుని సమసప్తకమును సహా అందుకొన్నది.

6-వ యోగము వంటిదే ఇది. మరణ హేతువులలో వరుణుని చేయి వాడితనము చేరియుండగలదు.

(9) చలిత బుధుడు (లగ్నాధిపతి) మృత్యు (అష్టమ) భావమునకు నేరుగా ఎదురునిలిచినాడు.

జాతకురాలిని మృత్యుదేవత ఆకర్షించుటయే ఇది. లేక ఆ దేవతనే జాతకురాలు ఆకర్షించెనేమో?

ఈ యోగము లన్నియు నికరమైనవనియు, దూరపు దృష్టులకు (orbs) ఉపయోగించ లేదనియు, పాఠకమహాశయులు గ్రహించగలరు.

మరియొక్క విశేషము. జన్మవరుణునితో సాక్షాత్తుగా సంయోగమునందే చలిత సంకల్ప మిపు డుండుట. ఏమి దీని అర్థము? మహాప్రభావసంపన్నుడగు వరుణుని సంబంధముకలన సంకల్పశక్తి అఖిల మాన్యముగా ఉత్తేజనము నొంది, ఉపజ్ఞాయుతముగా, అసాధారణ కార్యకరణపటిష్ఠముగా, వ్యక్తము కాగల కాలము ఆసన్నమైనదనుట! ఈ సంకల్ప రథమునకు సారథి వరుణుడు పంచమ భావములో నున్నాడు. విషయ సుఖమును, అథవా సంతానమును, గురించి ఈ సంకల్పము పనిచేయుననుట జాతకురాలి జీవిత చరిత్రతో అతుకుపడదు. అవసరము లేదు కూడ. పంచమభావమునకు మంత్ర స్థానమని సహా పేరున్నది. గొప్ప ఆదర్శములతో ఆ పతివ్రత ఏదైనా మంత్ర జపమును సాధించుచుండెడి కాబోలు! ఆమె ఉద్దేశమేమి? మన ప్రశ్నకు సదుత్తరము చలితపంచమ భావమే చెప్పవలసి యుండును.

లయమునకైనా, పునస్సృష్టికైనా, నిస్సీముడు యముడు కర్మ (దశమ) స్థానములో నున్నాడుగదా? తగిన ఉత్తేజనము వచ్చెనేని భౌతికముగా కాని, ఆధ్యాత్మికముగా కాని, "అబ్బా!" అని శిరఃకంపనము చేయించజాలిన ఏ అసాధారణ కార్యమునైనా ఇట్టి యముడు నిర్వహించగలడు. చలిత పంచమభావ మిపుడు ఈ యముని కోణ దృష్టి నందుకొన్నది. ఇదే కాలమందే చలిత లగ్నము సహా, ఇదే యముని త్రికోణదృష్టిని సంపాదించుకొనుట విశేషము. ఇతర దశలు దేహావసానమును చూపగా, యము డిపుడు పునర్జన్మ స్వీకారమునకే పునాదివేయుచున్నా డనుట సూచితమగుచున్నది. నవమభావము పూర్వజన్మమును, పంచమభావము పునర్జన్మమును, సూచించుననుట జ్యోతిశ్శాస్త్ర మర్యాద.

"ధర్మేశ్వరే దైవహి, పూర్వజన్మ
వృత్తిం భవిష్యజ్జననం సుతేశాత్."

అనుట మంత్రేశ్వరుని సూత్రము. 'పంచమభావమందలి వరుణునితో చలిత సంకల్ప సహముసంయోగము, చలిత పంచమ భావమునకు దశమమందలి యముని కటాక్షవీక్షణము, ఇవి అవసానసమయమున పునర్జన్మమునకే గట్టిసంకల్పము. లలితాబాయి చేసియుండె నని చాటుచున్నవి.

ఆధ్యాత్మిక చింతగల తపస్విని జాతకురాలు. యమనియమాదులను సాధించినవ్యక్తి. సాధారణముగా అట్టివారు జన్మరాహిత్యమును వాంఛింతురే కాని, పునర్జన్మ స్వీకారమును కోరరు. మరి, ఈ మెకట్టి కోరిక యుండెననుట అసంగతి మనిపించునుకదా? ఈ సందేహమును జాతకమే తీర్చవలసియున్నది.

భ్రాతృభార్యకు (V) గర్భము నిలుచుట అసంభవమని వైద్యులు తీర్మానించిరికదా? ఆశా, తపస్సహముములు IX వ భావములో నుండుటకు అర్థము కనుగొన్నాము. 1952 వ సంవత్సరమునకు చలిత జీవిత సహముము ఆ సహముద్వయమును చేరుకొని జీవిత లక్ష్యమును దృఢము కావించినది. ఈ సహముద్వయాధిపతి శుక్రుడు కన్యారాశిలో 26 వ భాగలో నున్నాడు కదా? ఆ భాగ స్వార్థత్యాగమునకు, మానవసేవకు పేరుగాంచినది. ఇట్టి శుక్రు డిపుడు చలించి పై సహమత్రయమునకు నిండు త్రికోణశుభదృష్టి నిచ్చుచుండుట చదువరులు గమనించగలరు. ఆశకు బలము, తపస్సునకు శక్తి చేకూరినవి. కాని, కోరిక నెరవేరుటకు గొప్ప పురుషకారశక్తి తోడ్పాటు అవసరము. అనగా, దశమకేంద్రముయొక్క, తదధిపతియొక్క సహకారము కావలయుననుట. జాతక ప్రభావమేమనగా, అక్కర పడినప్పుడే అట్టి సాహాయ్యము లభించినది. చలితబుధుడు (దశమాధిపతి) సమయమునకు సరిగా, తులారాశి $20\frac{1}{3}^\circ$ భాగకువచ్చి దశమ కేంద్రమునకు కోణదృష్టితో చక్కని ప్రోత్సాహ మిచ్చినాడు. అష్టమ (మృత్యు) భావమునకు సమసప్తక స్థానములో నిలిచి, బుధు డీపని చేయుట, మృత్యువుకోరి ప్రయత్నము సలుపుటేకదా ఇది? జాతకురాలు దేహత్యాగము చేసి సాధించునదేమి? ప్రజావతీ (V) స్థానాధిపతి శని జాతకములో అష్టమభావమునకు దశమ

భావమునకు పరివర్తను నిలిచి జాతకురాలి ప్రయత్నము (X), ఆమె మరణము (VIII), ఈ రెండింటి ఫలమును స్వీకరించుటకు సిద్ధముగ నున్నాడుకదా? ఈ శని యుండుట నవమ (ప్రజాపతీ సంతాన) స్థానములో అష్టమ, దశమ భావములఫలము నవమమునులో ఫలించు ననుట. జీవితమును చాలించుకొని భ్రాతృభార్యకు సంతానముగా తానే పునర్జన్మమును స్వీకరించవలె ననుటే ఆ తపస్విని సంకల్పమని ఈ యోగములు సూచించుచున్నవనుకొనుట అసంగతము కానేరదు.

పునర్జన్మసహమమను బిందు వొక్కటి కలదు. (*) ఈ జాతకములో ఆ బిందువు కన్యారాశిలో 24°-23'లో నున్నది. ఇది నవమాధిపతియగు శుక్రునిచే ఆక్రమించి యుండుట విశేషము. నవమ మనగా, ప్రజాపతీ సంతాన స్థానముకదా? 1952 లో ఈ సహమపు చలిత స్థానము వృశ్చిక రాశిలో 3° వ భాగలో నుండినది. అవపాన సహమము నంటియున్న జన్మ కేతువు అచటనే యున్నాడు. పోతే, లగ్నాధిపతి బుధునికి, సంకల్ప సహమమునకు, మృత్యు బిందువు సయుతి మవ్వుటచే యున్నది. భౌతిక దేహావసానమును, పునర్జన్మమును, లలితాదేవి సంకల్పించె ననుట ఎంతో కరబదర సమానముగా ఈ యోగము చూపుచున్నది కదా?

ఈ ఊహలకు, ఈ సమన్వయమునకు, విలువ యున్నచో, 1951 కి సంబంధించిన వర్ష జాతకము దీనిని సమర్థించగలదా? ఏమో మరి?

[చక్రము-మా. ప్రక్క కాలము]

జాతకమందలి ఏ స్థానములకు వార్షిక గ్రహోదుల నుండి ఉత్తేజనము వచ్చునో, ఆ సంబంధములని ఫలములు ఆ వర్షమున వ్యక్తము కాగలవనుట వర్ష జాతక పద్ధతిలోని ప్రధాన సూత్రములలో నొక్కటి. ఈ వర్ష చక్రమున మృతిసహమము ఏ చోటికి పోయినదో, చిత్తగింపుడు. జన్మచక్రములో కేతువు, అవపాన సహమము, చలిత పునర్జన్మ సహమము జట్టుకట్టుకొని యున్న చోటికే, పేరంటమునకు పిలిచియుండినట్లుగా వార్షికమృతి సహమము సిద్ధము కావలయునా? ఈ సంవత్సరములో ఆ ఫలము జరుగవలెనని సూచన ఇది. జన్మకాలమృత్యు (అష్టమ) భావాధిపతి కుజునిమీదనే వర్షలగ్నము. వర్షలగ్నాధిపతి బుధుడు వక్రియగు

ఆ వర్ష జాతక మిదే.

తేదీ 7-9-1951    11-11'-48'' p. m. (I S T)

| | | | |
|---|---|---|---|
| రా 9-33 | గు 13-18 (వ) | | I 4-57 |
| | (సాయన) వర్ష జాతకము — 1951 | | శ 13-1 |
| | | | శు 12-58<br>యు 20-18 |
| చం 0-54 | మృత్యు 8-13 | కే 2-50<br>ఇ 18-0 | బు 1-59 (వ)<br>కు 7.48 (వ)<br>నె 9-33<br>ర 14.16-27<br>V 27-36 |

టచే, అష్టమ భావమును వీక్షించుచున్నాడు. ఈ యోగములకు వ్యాఖ్యానమనవసరమనుకొందును. లగ్నాధిపతియగు బుధుని తేజస్సును కేంద్రదృష్టిచే చంద్రుడు గ్రహించి మృత్యు భావాధిపతియగు శనికి అందిచ్చుచున్నాడు. ఇది సహా మరణసూచకము కాని, దీనిలో ఒక వైశిష్ట్య మున్నది. బుధుని (జాతకురాలి) తేజస్సును (ఆత్మను) గ్రహించి చంద్రుడు (సూక్ష్మ దేహము) శనికి చేరవేయుటే ఇది. జాతకమున పంచమాధిపతి (భ్రాతృభార్య) శని. వర్ష జాతకములో శని పంచమమందే యున్నాడు. లలితాబాయి ఆత్మ ఈ వర్షములో వదినెగర్భమును చేరు ననుటకు ఈ సూచన చాలదా? గ్రహములు ఇంకెట్లు సూచించగలవు?

పోనిండు మృతి దినమునకు దిన జాతక మిది చూడుడు:

[[చక్రము-మా. ప్రక్క పేజీలో]

(*) శ్రీ శాంతిదేవి జాతకములో ఈ సహమము మేషరాశిలో 5°-54'లో నున్నది. ఆధార చక్రములో, పునర్జన్మ జాతకములో, దీనికిగల సంబంధము చదువరులు చూడగలరు. ఇది చలించి పంచమాధిపతి చంద్రుని చేరుకొన్నప్పుడే పునర్జన్మము. వ్యాసములో పొరబాటున ఇది వదలుట. క్షమింతురని మనవి.

తేదీ 6-6-1952 6-43-28 Am (I s t)

| | | | |
|---|---|---|---|
| X 16-28 | | గు 8-59 | శు 11-21<br>బు 13-42<br>ర 15-16-27<br>I 25-24 |
| రా 25-6 | (సాయన)<br>—<br>దిన జాతకము<br>—<br>మృతిదినము<br>— | | ల 12-29 |
| VIII 22-25 | | | యమ 19-25<br>కే 25-6 |
| | కు 1-14 (వ)<br>చ 16-28 | శ 8-12 (వ)<br>ఇ 19-5 (వ)<br>V 19-27 | సంకల్ప<br>0-52 |

ఈ చక్రమందు సయితము శనిమహాశయుడు పంచమభావమందే (భ్రాతృభార్య, పునర్జన్మము) నిలుచుట మన ఊహలకు గొప్పచేయూత కాదా? దిన జాతకములో సంకల్ప సహమును జన్మలగ్నాధిపతి బుధునిపై నిలిచి జన్మకుజుని (మృత్యుభావాధిపతి) కేంద్రచేసను అభిలషించుచుండుట గమనించినచో, పై ఊహ నిరాధార మనజాలము. దినలగ్నాధిపతి ఎవ బుధుడే (జన్మలగ్నాధిపతి). ఆత్మకారకుడగు రవితో చేరి ఈ బుధుడు లగ్నమందే యుండగా, పంచమ (పునర్జన్మ) భావాధిపతి శుక్రుడు వీరి సంయోగము చే అభిలషించుచుండుట చిత్రముకదా? మహామాయావి ఇంద్రుడు పంచమభావబిందువుపైననే నిలిచియున్నాడు. ఇతనికి యముడు అష్టమిత్రుడయినాడు. (అర్ధకోణము). వదినె దేహతత్త్వములో, ఏ ఇంద్రజాల ప్రభావమో కాని, వైద్యులు ఆశ్చర్యపడునట్లుగా, గర్భధారణ క్షణమును మార్చుచచ్చుట ఈ ఇంద్రుని ప్రభావము. ఆనాటినుండియే ఆమె గర్భకోశము పెరుగుచు సక్రమస్థితికి రా నారంభించెనేమో? దినలగ్నము చలితాకాసహమముపై నిలిచి, అవసానకాలమున జాతకురాలి ఆశలెట్టివో, తెలుపుచున్నది. శరీరత్యాగము చేసి, ప్రజావతికి సంతానముగా తానె మరల జనించుకోరికతో ఆ తపస్విని స్వచ్ఛంద మరణమును సంపాదించుకొనుట స్పష్టపడుచుండలేదా? ఇంతశక్తి ఆమెకు కలదా, అని శంకించగలమా? "ఎందరో, మహానుభావులు!"

మృతిదినమునకు దైనిక జాతకమును సాధించి నచో, దైనిక చతుర్థము కన్యా రాశిలో 18° వ భాగకు వచ్చుచున్నది. అనగా జన్మలగ్నాధిపతి పైన (బుధుని పైన) పాతాళ కేంద్రము ఆ వాహనమైనదనుట! దైనిక లగ్నమున్ననో, చలితాకాలిపస్సహమముల (మిథునము 26° వ భాగ) పైననే. ఇక దైనిక మృత్యు (అష్టమ) భావము (మకరరాశి 24° వ భాగ) ఇంద్రుని సమసప్తక వేధకు లోనైనది. అసాధారణమగు అదర్శ సాధనమునకై (ఇంద్రుడు XI లో) భగవద్ధ్యాన యోగముతో మనోలయమును సాధించి ఆసాధ్వీలలామ దేహత్యాగము చేసిన దనుటకిది సాక్ష్యము!

మరియొక్క తార్కాణ. మరణ దినము నాటికి చలిత వార్షిక కేంద్రస్థితి ఇది:—

(1) చలిత వార్షిక చతుర్థము:—కర్కాటకములో 29°.

చలితదశమకేంద్రమందు, జన్మరవినుండి అర్ధకేంద్ర దృష్టిలో గండసంధిలో ఈ కేంద్రమున్నది. ప్రయత్నపూర్వకమయిన దేహత్యాగము అనుట.

(11) చలిత వార్షిక లగ్నము:—8½° వృషభము.

తాత్కాలిక బృహస్పతిపైన నిలిచి ఈ లగ్నము జాతకురాలి పరిశుద్ధ భావమును సూచింపగలదు. మరియు ఈ లగ్నమునకు అష్టమాధిపతియగు గురువుతోడి సంయోగము పరిస్థితికి ఎంతో తగియున్నది.

దేహపరిత్యాగ క్షణమున (1-40 AM) బొంబాయి నగరమున పూర్వ దిశాహారిజములో మేష రాశి 1° వ భాగ ఉదయముగుచుండినది. జన్మకాలములో అష్టమ భావాధిపత్యముగల కుజునికి ఇప్పుడు లగ్నాష్టమాధిపత్యములు రెండును సంక్రమించినవి కదా? ఇట్టి కుజుడా క్షణమున నికరముగా అష్టమ భావ బిందువందే నిలుచుట, కాలాత్మక బ్రహ్మ లీలావిలాసము కాక మరి ఏమి? ప్రశంసా విషయము పునర్జన్మము కదా? అవసాన క్షణమున పంచమ (పునర్జన్మ) భావాధిపతి రవి. ఈ రవి (ఆత్మ) మిథునము 16° లో నున్నప్పుడు దేహత్యాగము! పునర్జన్మకథ సత్యమైనచో, ఈ రవిస్థాన

మునకు గొప్ప విలువనూపట్టినవలయును కదా ? చదువరులు ఓపికపట్టి పరిశీలించెదరు గాక. ఈ కథను కుమారి లలిత జాతకము గ్రహింపరచగలదా? చూతము.

మాతృగర్భమునుండి శస్త్రచికిత్సతో శిశువు వెలికితీయబడిన కాలము 8-24 Am (I S T) అని వింటిమి. గర్భమునుండి వెలువడిన తరువాత శిశువునకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఏక్షణమున ఆరంభమగునో, ఆక్షణమే మన కిచట ముఖ్యము. శస్త్రచికిత్స ఎంత కాలము జరిగెనో, శిశువునకు మొదటి ఊపిరి ఆడిన దెప్పుడో, ఏక్షణమును జన్మకాలముగా గుర్తించిరో, మన మెరుగము. ఆధానకాలపద్ధతి నుపయోగించినచో, జన్మకాలము 8-37'-31'' Am (I S T) అని నిర్ణయింపగలము. అనగా ఉపదిష్ట కాలమునకు 13 నిమిషముల తరువాత అనుట. శస్త్రచికిత్సతో శిశువు గోచరించిన కాలము జన్మకాలముగా గుర్తించియుందురు. తరువాత ఈ కృత్రిమ ప్రసవ కార్యకలాపము పూర్తిగా ముగిసి శిశువు తన ప్రత్యేక జీవితము నారంభించుటకు అంత కాలము పట్టెను కాబోలు."

సాధించిన ఆధానకాలపు చక్రమిది: తేదీ: 23-1-1953 రాత్రి 2.48-58 Am (I S T)

| | | | |
|---|---|---|---|
| కు 19-50<br>శు 18-4<br>X 5-9 | | గు 11-32<br>చ 17-28 | I 16-27 |
| రా 12-53<br>IX 8-55<br>ర 3.5 | (సాయనము)<br>—<br>ఆధానకాల<br>కుండలి<br>— | | వ 15-47 |
| బు 26-4 | | | కే 12-53<br>యు 21-31 |
| | | ప్రసవ 1-55<br>V 8-55<br>ఇ 23-53<br>శ 27-10 | |

జన్మకాలములో పంచమభావమందు నిలిచి ఈ నాటకమునకు సూత్రధారుడుగ వరుణమహాశయుడున్నాడుకదా? సాక్షాత్తుగా అతనిమీదనే ఆధానలగ్నాధిపతియగు బుధుడు కూర్చుండి, పునర్జన్మమునకు నాందీప్రస్తావన చేయుచున్నాడు! ఈ చక్రములో పంచమ (పునర్జన్మ) భావాధిపతి శుక్రుని చూడుడు. మహాతేజస్వియై రవికి 47° భాగలదూరములో, మీన రాశిలో ఉచ్చగతుడై, జన్మసప్తమభావ బిందువుపై నున్నాడు. జన్మలగ్నము అస్తమించి, పునర్జన్మ మారంభించుటకు సూచన.

ఈ దినమునకు దైనికలగ్నము మకరరాశిలో 26°వ భాగకు వచ్చుచున్నదని కనుగొన్నచో చదువరులాశ్చర్యమగ్నులు కాకమానరు. జన్మవరుణునకు, ఆధానలగ్నాధిపతి బుధుడు సహా, ఉన్న స్థానమదే! పునర్జన్మను సత్యమని దైనికలగ్నము దండోరా వేయుచున్నది.

ఈ దినమునకే దినజాతకమును గుణించితిమేని, దినలగ్నము (కన్యారాశిలో 17°-44') జన్మ బుధునిపై నుండగలదు. పంచమభావము (మకరము 18°-5') చలిత గురువు (చతుర్థాధిపతి) నుండియు, చలిత శని (పంచమాధిపతినుండియు, శుభదృష్టిలోనుండి, పునర్జన్మ కథ ఆరంభమైన దినముండగా, మీనరాశిలోనున్న ఆధానకాలపు కుజుడు ఆ పంచమభావ బిందువునకు నికరముగా అర్థకోణ శుభదృష్టిలోనుండి, వైద్యశాలలో శస్త్రచికిత్స అవసరమని ఎంత రమ్యముగా సూచన చేయుచున్నాడో, చిత్తగింపుడు.

మరణకాల క్షణమున పునర్జన్మ (పంచమ) భావాధిపతి రవి మిథునరాశి 16° వ భాగలోనుండెనని కనుగొనియుంటిమి కదా? ఆ విశిష్ట భాగయే ఆధాన లగ్నముగుట వింత కాదా? ఇంతకంటె సాక్ష్యమా?

41 సంవత్సరపు (1951) వర్షజాతకము అవసానమును సూచించెను. 42వ వార్షిక చక్రము (1952) పునర్జన్మమునకు అంకురార్పణము జరుగుట సూచించగలదా? ఆ చక్రమిది.

[చక్రము-చూ. ప్రక్క పేజీలో]

ఇపుడు పంచమాధిపత్యము (పునర్జన్మము, సంతానము) గురువుపాలికి వచ్చినవి. ఈ గురువు, పునర్జన్మ సహమమునకు కోణములో జన్మశనిమీదనే ఆవాహనమైనాడు. జన్మకాలపు ప్రజాపతీ (V) భావాధిపతితో సంయోగమనుట! పునర్జన్మసహము మన్ననో, జన్మపంచమభావబిందువు నే చేరుకొన్నది. ఆధాన సహమమో, వర్షలగ్నమునే ఆక్రమించినది. వర్ష

తేదీ 6-9-52 4 47-20 Am (IST)

| | | | |
|---|---|---|---|
| | చ 23-8 | గు 20-58<br>X 22-32 | |
| రా 20-15 | (సాయన) | | శ 17-33 |
| పునర్వసు<br>20-13 | —<br>వర్ష జాతకము<br>(1952) | | కే 20-15<br>య 21-53<br>I 22-5<br>ఆధా 21-15<br>బు 29-4 |
| V 22-28<br>కు6-15 | | శు 4-28<br>ర 13-53<br>ఇ 20-7 | ల14-16-27 |

లగ్నాధిపతి రవి (ఆత్మ) పునర్వసుసహమములతో, పునర్వసుభావాధిపతి గురువుతో, ఇత్థశాలయోగము చేయుచున్నాడు. ప్రకృత సమస్యాపూర్తికి ఇది చాలదా?

వర్ష లగ్నాధిపతి రవి పునర్వసుసహమము నెప్పుడు చేరుకోగలడో, చూతము.

| | | గ. వి. |
|---|---|---|
| సహమ ముదయించు నాక్షత్ర కాలము (బొంబాయి) | = | 13-59 |
| రవిస్థానము ఉదయమగు నాక్షత్ర కాలము | = | 4-52 |
| భేదము | = | 9-7 |
| వర్షారంభమునాటి నాక్షత్ర కాలభుక్తి | = | 11 2 |
| మొత్తము | | 20-9 |

ఈ నాక్షత్రకాలభుక్తి నికరముగా 29-1-1953 నాటిదే అని పాఠకమహాశయులు 'ఎఫిమెరిస్సు'లో చూడగలరు. ఆధాన దినమదే!

శ్రీ లలితాబాయి జాతకములో ప్రథమ భార్యా స్థానమందలి వరుణునియొక్కయు, తత్సంతాన (IX) స్థానాధిపతి శుక్రునియొక్కయు శుభ త్రికోణదృష్టి వృషభరాశిలో 25° లో నున్నదికదా? వార్షిక పంచమ భావము ఆ 25° భాగకు చేరుకోగల దినము ఫలప్రదముగా నుండవలయును.

| | | గ. వి. |
|---|---|---|
| వృషభము 25° భాగ ఉదయమగు నాక్షత్ర కాలము | = | 21- 4 |
| వర్ష పంచమ భావబిందువు ఉదయించు నాక్షత్ర కాలము | = | 11.57 |
| భేదము ... ... | = | 9- 7 |
| వర్షారంభమునాటి నాక్షత్రకాలభుక్తి | = | 11- 2 |
| మొత్తము ... | = | 20- 9 |

ఈ ప్రయోగముసహా, 28.1.1953 వ తేదీనే చూపగలదు. దైవచిత్రము!

ఈ నిదర్శనములు చాలుననుకొందును. ఈ సాక్ష్యమును నిష్పక్షపాతదృష్టితో గమనించితిమేని, శ్రీ సామంత్ గారి స్వప్నకథయు, అందలి విషయములు సహా, సత్యముగా నుండెక తీరదని చదువరులు తీర్మానించగలరని కోరుదును.

మెట్టిన ఇల్లు "తామరతంపర" గా అభివృద్ధి నందె, పుట్టిన ఇల్లు నిష్సంతతికముగుట లలితాబాయి సహించలేకపోయినది. ఇదె ఆమె వ్యసనము. అన్నకు సంతానము కలుగవలెననియే ఆమె తపస్సు చేసినది. ఈజన్మములో ఆ ఫలము కలుగదని తోచగా, అన్నకు సంతానముగా తానే పునర్జన్మము నెల ఎత్తి రాదను భావము ఆ తపస్వినికి వచ్చినది. అంతటి స్వార్థ త్యాగిని ఆ సాధ్వి. నానాటికి ఈ సంకల్పము దృఢమై స్థాయీ భావమునకు వచ్చి, తదేక ధ్యానముతో ఆమె దేహ త్యాగము చేసెను. ఈ పరిస్థితులలో అట్టి పునర్జన్మమే ఆమెకు ఏలరాదు?

"యం యం వాపి, స్మరన్ భావం.
త్యజత్యంతే కళేబరం;
తంతమేవైతి, కౌంతేయ,
సదా తద్భావ భావితః."
(భగవద్గీత. అధ్యాయము 8)

అను శ్రీ కృష్ణ పరమాత్ముని సూత్రమున కిది అమూల్యమగు దృష్టాంత మగునుకదా?

కాని, లలితా (సామంత్) కుమారి జాతకము మనకు తగిన సాక్ష్యము నియ్యవలదా? ఆ జాతకమిదే-

తేదీ 13-10-1953 8-37-31 A.m. (IST)

| | | | |
|---|---|---|---|
| | | | గు 26-28 |
| | (సాయనము)<br>లలితా కుమారి<br>జాతకము | | IX 18-10<br>ర 23-0<br>కే 28-58 |
| రా 28-58<br>III 18-10 | | | X 18-39<br>యు 24-33 |
| చ 16-27 | బు 11-43<br>I 17-28 | ర 19-29<br>శు 23-28<br>కే 28-52 | కు 17-52<br>శం 23-33 |

కీ. శే. లలితాబాయి వదినెకు కూతురుగా పునర్జన్మ స్వీకారమునకై దీక్ష వహించుట సత్యమయ్యెనేని, ఈ క్రింది యోగములు కలకాలముకంటె వేరు ముహూర్తములు ఆమెకెట్లు లభింపగలదు? పూర్వ జన్మ పునర్జన్మ జాతకములను పోల్చి చూడుడు—

(1) లలితాబాయి జాతకములో పునర్జన్మ భావాధిపతి శనిచారములో ఆమె చలితలగ్న స్థానము నే చేరుచున్నాడు;

(2) పునర్జన్మ భావములో నున్న వరుణుడు చారములో లాభ భావమందలి ఇంద్రుని చేరుచున్నాడు;

(3) జ్యేష్ఠ భ్రాతృ (XI) సంతాన స్థానమునకు (III) అధిపతి కుజుడు జన్మ లగ్నాధిపతియగు బుధునిపై ఆవాహన మగుట అదే;

(4) జన్మ తృతీయంలో మండిన గురువు చారములో చలితలగ్నసహమము పైకి వచ్చుట అప్పుడే;

(5) జన్మ తృతీయ భావమందున్న చలిత గురు స్థానమందే కుమారి లలిత జన్మలగ్నము ఏర్పడుట.

ఈ యోగములకు వ్యాఖ్యానమేల?

ఆధాన చంద్రస్థానము వృషభములో 17°-28' కదా? అదా సహమమునకు పంచమాధిపతికి మధ్య బిందువే అది. కుమారి లలిత జన్మలగ్నము అదటికే వచ్చి యుండరాదా? అనవచ్చును. పరే కాని, ఆ భాగ యమళజన్మము విచ్చి యుండును. కూతురుగా జన్మించవలె ననియే లలితాదేవి సంకల్పము. అన్న స్వప్నములో ఆమాటే చెప్పినదామె. పుత్రుడుగా పుట్టక పుత్రికాత్వమును ఆమె ఏల కోరెనో, చెప్పజాలము. కారణమేమైనా, ఆమె కోరినది స్త్రీ జన్మమగుటచే, ఆధాన చంద్రనక్షత్ర స్థానమే (అది స్త్రీలింగభాగ) జన్మలగ్నము కావలసి వచ్చినది.

నవమ భావము పూర్వజన్మమును సూచించును గదా? కుమారి లలిత జాతకములో నవమాధిపతి చంద్రుడు లలితాదేవి అవసానకాలపు రవికి నేరుగా ఎదుటనుండుట కాకతాళీయము కాదు. మేనత్తను తెలుపునది ద్వాదశభావము. దాని అధిపతి శుక్రుడు లలితాదేవి జాతకమందలి పునర్జన్మ సహమముపై నుండుట దైవచిత్రము. లగ్నాధిపతి కుజుడు మేనత్త జాతకములోని లగ్నాధిపతిపైననే ఉన్నాడు కదా? దీని అర్థము స్పష్టమే. ఇవి అన్నియు ప్రకృతిలో

మున్న కథతో ఎంతో సహృదయరంజకముగా అతుకు చున్నది.

కుమారి జన్మదినమునకు లలితాదేవి జాతకము ననుసరించి దైనిక జాతకమును గుణించినచో, ముఖ్య కేంద్రము లివి:

దైనికదశమము:—28½° కర్కాటకము.

దైనిక లగ్నము:— 24° తుల. దశమకేంద్రము జన్మకాలపు ఇంద్రునిపై నున్న తాత్కాలిక వరుణునితో సంయోగము. ఇక లగ్నమో, చలితరవిమీద నిలిచియున్న ఇంద్రుని సంయోగము! ఇంద్రావరుణుల వాగ్దానము ఫలించుట అని మాదిన.

పూర్వజన్మ జాతకశక్తి అదేహోవసానముతో నే నశించక పునర్జన్మము వచ్చువరకు వ్యాప్తిలో నుండునని తప్తి జాతక, దైనిక జాతకాదులు ఋజువుపరచుచున్నవి. ఇంతే కాదు. లలితాదేవి చలితచంద్రుడు చలితరవికి అర్ధ కేంద్ర వేళలో నుండగా, దేహోవసానము వచ్చెను కదా? ఆచంద్రుడే జన్మరవికి (తదినకు) వింశు కోణవృష్టికి రాగా, ఆధానము జరిగెను. తరువాత,ఆ చంద్రుడు అష్టై చలించి ఆధాన చక్రమందలి ప్రసవ సహమమువందుకొని జన్మ కుజాని త్రికోణ దృష్టిని సంపాదించినప్పుడే ప్రసవమ్మయము! అదియు శస్త్రచికిత్స (కుజాని) మూలముగనే. ఈ నిదర్శనములను త్రోసిపుచ్చగలమా?

మిథునరాశి 16° లో రవి యుండగా లలితాదేవి దేహత్యాగము. ఆ భాగలో లగ్నము వచ్చినప్పుడే ఆధానము. దానికి నికరముగా సమసప్తకములో చంద్రు డున్నప్పుడే కుమారి లలిత జననము! పూర్వజన్మ పునర్జన్మములకు గల అవినాభావ సంబంధమును ఈ యోగములు తెలుపజాలవా?

వ్యాసము పెరిగినది. ఇక్కడికి చాలింతును. అడిగిన తోడనే తలచిన జాతక సామగ్రిని దయతో ఇచ్చి శ్రీ డాక్టరు శ్రీధర అకోంకర్, ఆర్. జి. సామంత్ డాక్టరు వి. యం. భిడే గార్లు శాస్త్రపరిశోధనమునకు ఎంతో ఉపకరించినారు. వారికి కృతజ్ఞుడను.

కుమారి లలితకు దీర్ఘాయురారోగ్య భాగ్యములు పరమేశ్వరుడు అనుగ్రహించు గాక.

"అప్రత్యక్షాణి శాస్త్రాణి;
వివాదా స్తేషు కేవలం,
ప్రత్యక్షం జ్యోతిషం శాస్త్రం,
చంద్రార్కౌ యత్ర సాక్షిణౌ."

# ముగింపు లేదు

శ్రీ వి. కృష్ణరావు

* గతసంచిక తరువాయి *

నేను ఇంటికి వచ్చాను. సత్యానికి మాట ఇచ్చాను. కాని, ఇప్పటికిప్పుడే ఎక్కడికి మార్చను? ఎవ్వరు మాత్రం ఆదరిస్తారు? ఏం చెయ్యను? శాకుంతలంతో ఆలోచించడానికి శాకుంతలంకు ఏవిషయమూ అర్థం కాదు. అంతా కొత్త. ఎందుకో శాకుంతలంను గురించి ఆలోచిస్తే శాకుంతలంకు అన్యాయం జరుగదుకదా? అనిపించింది. శాకుంతలంను అవస్థపెట్టడానికి తీసుకు రాలేదుకదా?

నేను అప్పటికప్పుడు వెంటనే వావిలాల తాతగారింటికి వెళ్లాను. ఆయన అరుగుమీద కూర్చున్నారు. రమ్మన్నారు. నాకు వెంటనే ఒక అనుమానం నన్ను చిందరవందర చేసింది. నేను ఇలా సత్యం పొమ్మన్నాడంటే, తన ఇంట్లో ఉండమంటారు. ఆయనకు లేనిపోని అవస్థ తెచ్చిపెట్టినవాడిని అవుతాను. ఈవిషయం ఆలోచించగానే, నేను ఆయనతో ఈవిషయం చెప్పదలచుకోలేదు.

నేను ఆకబురూ ఈకబురూ చెప్పి వెనుకకు వచ్చేయబోయాను. వెనక్కు మరలిన నన్ను పిలచి...

"ఇదుగో చూడు. సత్యం నిన్ను కలుసుకున్నాడా?"

నేను ఆశ్చర్యపోయాను. సత్యం నన్ను కలుసుకొన్న సంగతి ఈయన కెలా తెలుసు? నేను ఆయనదగ్గర అబద్ధం ఆడటానికి సాహసించలేను.

"అవును. ఇప్పుడే కలుసుకున్నాను."

"ఖాళీ చేయమన్నాడా?"

నేను మరీ ఆశ్చర్యపోయాను. అవును అన్నట్లు తల ఊపాను.

"నాకు తెలుసు. ఇంకా చాలాదూరం పోతుంది వ్యవహారం. ఊరంతా కటకట్టుకుని నీమీద విరుచుకుపడతారు. ధైర్యం, సహనం నీకు ఇప్పుడు అవసరం. అనవసరంగా ఆవేశపడకు."

నేను నింపాదిగా శాంతగా అన్నాను. "నీమీద ఇంతకు రెట్టింపుగా విరుచుకుపడ్డా నేను భాతరు చేయను. కాని శాకుంతలం బాధపడుతుంది. నేను అనుకుంటాను; శాకుంతలకు అన్యాయం జరగడం లేదు కదా?"

వావిలాలతాతగారు అన్నారు. "శాకుంతలం చాలా మంచిపిల్లలాకనపడుతోంది. నిన్ను అర్థం చేసుకోలేనంతటి వెఱ్ఱిగొడ్డని నేను అనుకోను. కర్తవ్యం ఆలోచించు."

"ఆలోచించడానికేముంది. ఇంక పదిగంటలలో ఖాళీ చెయ్యాలి."

"చేయకపోతే...?" ఆయన కంఠం కఠినంగా ఉంది.

నేను నింపాదిగా, నిశ్చయంగా అన్నాను. 'చేసి తీరతాను. సత్యానికి మాటఇచ్చాను."

ఆయన మరి మాట్లాడలేదు. ఆయనకూడా మాట అంటె వెనక్కు తీసుకొనే మనిషి కాదు. కాస్సేపాగి... "నువ్వు భోజనం చేసిరా. మరేం భయంలేదులే."

నేను మెట్లుదిగి ఇంటికి వచ్చాను. మంచంమీద ఒదిగి అరచేతుల్లో తలపెట్టుకుని ఆలోచిస్తోంది శాకుంతలం. "శాకుంతలం" అన్నాను. శాకుంతలం: 'మీరా!' అని ఆశ్చర్యపోయింది.

"ఏం! అలాఉన్నావ్?"

"ఏమీ లేదు. ఊరికే నే!" అని లేచింది. నేను భోజనం చెయ్యడానికి కూర్చున్నాక అంది శాకుంతలం.

"ఏమండీ! మనం బ్రాహ్మణవాడ విడితే?"

నేను విస్తుపోయాను. ఎప్పుడూ ఆశ్చర్యపోనంతగా ఆశ్చర్యపోయాను. శాకుంతలాన్ని చూశాను. శాకుంతలం కళ్లు అశ్రుపూరితాలయ్యాయి.

నేను శాంతగా అన్నాను. "నీకూ తెలిసిందా? శాకుంతలం!" నాకు కూడా ఏడుపువచ్చింది. విస్తరి వదిలి వెళ్ళిపోయాను.

"నీకు తెలియకుండా ఉంచాలనుకున్నాను శకుంతలం. కాని..." శకుంతలంను చూడలేక శూన్యంలోకి చూస్తూ అన్నాను. "నిన్ను బాధపెడుతున్నాను". శకుంతలం పెద్దపెట్టున ఏడ్చింది. ఆ ఏడుపును భరించలేకపోయాను. ఏడుస్తూ అంది...

"మిమ్మల్ని అనడం లేదు. మీరు మంచివారు. నా రాతే...ఎప్పుడూ ఇంతే. ఇది నాకు కొత్తకాదు." తిరిగి కళ్ళనీళ్ళు కుక్కుకుంది. నా హృదయం స్పందించింది. నాహృదయం చిల్లులుపడేలా ఏడ్చింది. నేను గిలగిలలాడాను. నాకు తలపగలుకొట్టుకోవాలనిపించింది, ఆస్థితిలో; ఏం చెయ్యలేక! నాది వెధవబ్రతుకు అనిపించింది. నన్ను చూస్తే హసలి తలుపేసుకొనేమోక, నన్ను నా ఎదురుగుండా నిలచి, ఈసడిస్తున్నారే, వెక్కిరిస్తున్నారే! వాళ్ళకి జడుస్తున్నానంటే ఏదో ఒకమూల నాలో నిస్సత్తువ ఉంది. అది నన్ను పూర్తిగా శక్తిహీనుణ్ణి చేస్తోంది!

"నువ్వు అలా ఏడుస్తే భరించలేను శకుంతలం!"

శకుంతలం ఇంకా ఏడుస్తూనే ఉంది. నా కాళ్ళి పట్టుకుంది. కన్నీళ్ళతో అర్థించింది.

"క్షమించండి. మిమ్మల్ని బాధపెడుతున్నాను. ఇదంతా నా దురదృష్టం. నన్ను ద్రాక్షారామంలో దిగబెట్టండి." నేను ఊగిసలాడిపోయాను. కంపించాను. నాకు కోపం వచ్చింది. నాకళ్ళు ఎఱ్ఱనై ఉంటాయి. నిప్పులు చెలుగుతున్నట్లు వేడిగా ఉన్నాయి కళ్ళు. ఊరిప్రజలమీద తగని కోపం వచ్చింది. ప్రతీకారం కోసం నాలో ఉన్న ప్రతీ చిన్న అణువూ తహతహలాడుతోంది.

"శకుంతలం. నువ్వు, నా శకుంతలం! నీమీద ఈగవాలనివ్వను. ఇదుగో చూడు." విసురుగా, ఆవేశంగా వెళ్ళబోయాను. గోడను ఢీకొని బోర్లాపడ్డాను. "ఏమండీ!" అంటూ గావుకేక పెట్టింది శకుంతలం. శకుంతలం నా కాళ్ళను పెనవేసుకొంది.

"మీరేమీ ఇదవకండి. మీరేమీ ఇదవకండి."

"కాదు. శకుంతలం. నీకు తెలియదు."

"కాదు. నామీద ఒట్టు," అంది శకుంతలం. నాకు సంకెళ్ళను వేసింది.

"అవును. ఎందుకో అనిపిస్తోంది నాకూ. నేను శక్తిని కోల్పోయాను. నేనంటే ఉక్కిరి బిక్కిరి అయ్యే మాక నన్ను ఆడిస్తోంది. వస్తాను. నీ సంకెళ్ళు మరిచిపోను!"

ఆ కటిక చీకటిలో బాధగా వానిలాల తాత గారింటివైపు బయలుదేరాను. నేను ఎంతగానో క్షోభిస్తున్నాను. నాకు నేను హీనంగా బ్రతికినా, అనవసరంగా, నాకు తెలుసున్నంతవరకూ, నేను ఎవరినీ క్షోభ పెట్టలేదు. కఠినమైన మాట అని ఎవరి మనస్సూ నొప్పించలేదు. ఎందుకు నాపై వీళ్ళ అకారణద్వేషం? పగ? నా గోడును నే పడుతోంటే...అది ఇంకొకరి కొంప కూల్చడ మవుతుందా? నేనే తప్పుచేసినట్లు బాధపడ్డాను. నా పరిస్థితి తెలుసుండీ, ఎందుకు ఈ వేదన పెట్టుకోవడం? ప్రతిమానవుడిలాగే, నాకు కోర్కెలు ఉంటాయి. కాని నాలాంటి వాడికి అవి పనికిరావని నేను తెలుసుకున్నాను. నేనుకోరే, ప్రతివిషయమూ వస్తువా, మిక్కిలి వింతగానూ, బరి తెగించినట్టిది గానూ ఉంటుంది మిగతా వారికి! అవసరంగా శకుంతలకు బాధ కల్గిస్తున్నాను. చిన్నప్పటినుంచీ,ఏదో కష్టపడి, చివరికి, ఒక ముసలావిడ ఆసరాతో సుఖంగా కాలక్షేపం చేస్తున్న శకుంతలంను పెద్ద ప్రయోజకుడిలా తీసుకు వచ్చాను. శకుంతలంను ఎలా ఊరడించాలి? ఇంకా శకుంతలం మంచిది. ఎంతో సహనం కలది. లేకపోతే, ఇంకా దుర్భరంగా ఉండేది. కాని క్షణకాలం అదే మంచిదనుకున్నాను. ఈ మానసిక సంక్షోభంకంటె శారీరకవ్యథే నయం. శకుంతలం సహనము, మంచితనము నన్ను క్షణ.క్షణమూ బాధ పెడుతున్నాయి.

నన్నూ, శకుంతలాన్ని కేంద్రంలో పెట్టి ఊళ్లో ఉన్న జనం యావన్మంది పరిధిమీదనుంచోని రాళ్ళు విసురుతున్నట్టనిపించింది. నాకు మళ్లీ తిరిగి ఆవేశం వచ్చింది. ఊళ్ళో జనానికి తగినసమాధానం చెప్పితీరతాను! ఇలా ఈ మాట అనుకుంటూంటే నాశరీరం అంతా వేడితో భుగభుగమంది. నేనంటే ఏమిటో వాళ్లకు తెలియాలి!

వెనక ఒక భీకరకంఠం భయం గొలిపేలా నవ్వుతోంది. ఆకంఠం బద్దలయి నవ్వుతోంది. నవ్వు ఆపి అంది "ఊళ్లో జనానికి నీవు సమాధానం చెప్పబోయి, నీకు నీవు సమాధానం చెప్పుకుంటావు."— చెమట బిందువులు నుదుటి నిండా అలుముకున్నాయి. గొప్ప తగిలి బోర్లా పడబోయాను. దారిలో సత్యం కనపడ్డాడు.

సత్యంతో అన్నాను, చాలా నిశ్చయంగా. "నేను ఇప్పుడు" ఖాళీచేయను. సత్యం కలవరపడ్డాడు. "ఎలా? వారందరితో చెప్పి సమాధాన పరిచావే!" నాకు కోపం వచ్చింది. నేను అన్నాను. "ఏం, సమాధాన పరచక పోతే. ఉరిపోసుకుంటారా?" సత్యానికి తెలుసు నా తడాఖా! నేను నేనుగా ఉంటే భయంలేదు. కాని నాకంటెం తీరు ఏమాత్రం మారినా కిక్కురుమనడు. సత్యం అన్నాడు నింపాదిగా, నమ్రతగా!

"చాలా కష్టం. నువ్వు ఖాళీచేసి తీరాలి! నీకు గదులు ఇచ్చినందుకు నన్ను నలుగురూ నాలుగు మాటలూ అన్నారు. రేడియో వినడానికి రోజూ వచ్చే గురుమూర్తి, వాసుమూర్తి, విష్ణుశాస్త్రి, కృష్ణ సోమయాజులు ఇందుకే రావడంలేదుట! వారణాసి సుబ్రమణ్యం గారు సరేసరి. మనస్నేహం మీద గౌరవముంచి నువ్వు ఖాళీచేస్తా వనుకుంటాను."

"మనస్నేహం మీద నీకు గౌరవముంటే నువ్వు వాళ్ళని ఎందుకు ఖండించలేవు? ప్రజాసేవకుడవు అని చెప్పుకునే నీవు అధర్మాన్ని ఎందుకు అరికట్ట ప్రయత్నించవు?" సత్యం ఫక్కున నవ్వాడు. నాకు తల తిరిగింది వాడి వికారానికి. వాడు విరగబడి నొక్కి నొక్కి అన్నాడు "అధర్మం!...అధర్మం!!" తిరిగి నవ్వాడు 'ఎంత పిచ్చివాడివిరా' అన్నట్లు! మళ్ళీ మొదలు పెట్టాడు.

"నువ్వెంత అమాయకుడివిరా! వాళ్ళది అధర్మమే కావచ్చు. ధర్మం, న్యాయం నీవైపే ఉండవచ్చు. వాళ్ళు నీకు తలపెట్టింది అన్యాయం కావచ్చు. కాని వాళ్ళని నమ్మిన నేను, వాళ్ళసహాయం కావలసిన నేను, వాళ్ళ ఆదరాన్ని ఆశించిన నేను, వాళ్ళది అధర్మమైనా, అన్యాయమైనా, వాళ్ళనీడలో నే ఉండాలి. ఇది తప్పనిసరి. రాజకీయ లౌకికుడు, ఏదో ధర్మం అంటూ, ప్రజాసేవయే తన పరమావధి అంటూ, పతితోద్ధారకుడు, దీనజన బాంధవుడులాంటి పదాలు తగిలించుకోవడం కోసం, ...ఒక్కడికోసం, పదిమంది సహాయాన్ని, బలాన్ని త్యాగంచేసుకోలేడు. ఇంకా చెపుతాను, ఇది పూర్తిగా నామాట. నాకు ఆస్తిపాస్తులు లేవు. రాజకీయం, జులాయివాడి కడపటి ఉద్యోగం అన్న నాకు వర్తిస్తుంది. ఆస్తిపాసులు లేవు. పలుకుబడి లేదు. చదువు లేదు. ఉద్యోగం లేదు, నేను బ్రతకాలి. పిల్లల్ని పోషించాలి. ఎలాపోషించను. కూలి చేయలేను. పరువుగా బ్రతకాలి. ఏం చేయమంటావ్? అంచేత రాజకీయాన్ని ప్రజాసేవకై గాక, ఒక ఉద్యోగంగా, బ్రతుకు తెరువుగా తీసుకున్నాను. ఎవరైనా ఏం చేస్తున్నావంటే ప్రసిడెంట్ అంటాను. పోతే...ఇప్పటి విషయం. నువ్వు వెళ్ళనంటే నే చేసే దేమీ లేదు. చెయ్యలేను. నీ సంగతి నాకు తెలుసు. నీతో రొష్టు పడ్డం నాకిష్టంలేదు. అలాగని నావలన నీవు ఏవిధమైన సహాయం పొందలేవు. నేను పదిమంది చేతుల్లోని ఆట వస్తువుని. పదిమందికీ ఇష్టమైన ఆట ఆడాలి. వాళ్ళని కవ్వించాలి. నవ్వించాలి. ఏ గాలికి ఆ ఊగు ఊగాలి. "అన్ని బొమ్మలకంటె ఈ బొమ్మ మంచిదనిపించుకోవాలి." అదే నా జీవితాశయం. అపుడే నాకు మంచి భవిష్యత్తు ఉంది.

నువ్వు నానుండి ఏవిధమైన సహాయమూ ఆశించకు. నాకు సహాయం చేయలేకపోయినా, నీసహాయాన్ని నేనుకోరతాను. నేనున్న పరిస్థితి అట్టిది. నేను నీకు మంచితనం చూపలేకపోయినా, నీమంచితనం నాకు కావాలి. నా రాజకీయపు ఉద్యోగం అట్టిది. నాకల్లాంటి పట్టింపులు లేవు. పట్టింపులుంటే నాకు కుదరదు. నీకు సహాయం ఏవిధంగానూ చేయలేనని నాకు తెలుసుండే, నిన్ను నాకు సహాయం చేయవలసిందిగా కోరతాను. నువ్వుచేస్తావనికూడా తెలుసు. నువ్వు ఉదారుడివి. చివరన ఒక ముక్క చెపుతాను. అది వింటావని నేను అనుకుంటాను. నువ్వు రేపు ఉదయానికి ఇల్లు ఖాళీచేయకపోతే నాఉద్యోగానికి రాజీనామా ఇస్తాను."

వాడు చెపుతున్నంతసేపూ విన్నాను. వాడు చెప్పినదంతా నిజమనిపించింది. వాడు ఏమీ చేయలేడు. ఏమీ చేయలేని అసమర్థుడు. పిరికిపంద. కాని చిత్రం! వాడు అసమర్థుడనని చెప్పుకోగలిగే సమర్థుడు. పిరికిపందను అని పైకి బాహాటంగా చెప్పగలిగే ధైర్యవంతుడు. ఓటమిని ముందే అంగీకరించి, ఎదురు పందెం వేయక, చివరకు, గెలుపును తనదిగా చేసుకొనే రాజకీయ లౌకికుడు. అవసరమైనచోట ఏ పలుకుకు ఆ పలుకును చెప్పగలిగే చిలకనోటిని కలిగి అందరిదగ్గరా "తలలో నాలిక" అనిపించుకోగలిగే రాజకీయ చతురుడు. సత్యం చిన్నప్పటినుంచీ అంతే. స్వలాభాపేక్షను అడుగడుగునా ప్రదర్శిస్తాడు.

దానికై చెప్పి పొందుతాడు. ఇప్పుడతని లౌకికం, చతురత, నిరాడంబరత, పరాకాష్ఠను అందుకున్నాయి. చివరన వాడి రెండుచేతులూ పుచ్చుకొని అన్నాను.

"నిన్నేమీ అనలేను. నాస్నేహం నీకెప్పుడూ ఉంటుంది. నీకు అడ్డురాను. పదిమందిచేత దొంగ అనిపించుకో! నేను అలానే ఖాళీచేస్తాను" అన్నాను. నేను రెండు అడుగులు ముందుకు వేసి, ఆగి, సత్యాన్ని పిలచి అన్నాను.

"ఒరేసత్యం...నువ్వింకా మంచివాడివిపోతావు. నాసామాను అదీ బయట పారేయి; లేపు. నిన్ను నేనేమీ అనను. నన్ను నానామాటలు కూడా అను."

సత్యం ఖిన్నుడయ్యాడు. చాలా బాధపడ్డాడు. "నీకు బాధపెట్టడం సరదా అయితే ఏడిపించు. నిన్ను ఏమీ చేయలేను, అనలేను కాబట్టే రాజీనామా ఇస్తానంటుంట." నేనుకూడా వాడి మాటలకు కరిగి పోయాను. వాడి వీపు తట్టాను. "నీకు మంచి భవిష్యత్తు ఉన్నదన్నట్టు."

వావిలాల తాతగారింటికి వచ్చాను. ఆయన ఇంకా మెలకువగాఉన్నారు. వీధిఅరుగుమీదమంచం మీద పడుకొన్నారు. నేను వెళ్ళగానే ఆయన లేచి కూర్చున్నారు. నన్నుకూడా ఆయనప్రక్కనే కూర్చో వలసినదిగా బలవంతంచేశారు. కూర్చున్నాను. కూర్చో గానే, ఒక్కమాట ... "నువ్వెందుకు మీ పొలంలో ఉండకూడదు."

"పొలంలోనా!?"

"అవును. ఏం ఆమెరకచేలో పాక ఉందిగా. అది శుభ్రంచేయించి ఎందుకు ఉండకూడదు. అంతా బాగుచేసి ఊరికి దగ్గరగాకూడా ఉండదుకదా! నాఇంట్లో మీరుంటే నాకు అభ్యంతరంలేదు. కాని మీరుండరు. ఉండలేరనీ తెలుసు ... పైగా అక్కడ ఉండడంలో నీవు ఇంతకన్నా ఎక్కువ సుఖపడ్డం ఒకటి ... పైగా ఖాళీగా ఉన్నావు. ఏదైనా పని ఉండాలి, చూడు, మనిషికి. వ్యవసాయం అంటే ఏమిటో ముందు కొంత తెలుసుకుంటే...తర్వాత అది ఉపయోగపడవచ్చు."

నాకు వావిలాలతాతగారు మంచివారే కాకుండా ఎంత తెలివైనవారయినదీ బోధపడింది. సున్నితంగా తిట్టడంలో ఆయన నేర్పరి. ఆయనమాటల్లో ఎంతో భావం ఉంది.

"తాతగారూ ... మీరుణం ఎలా తీర్చుకోను? ఒకనిర్ణయం, ఒక తెన్నూ లేకుండా తిరుగుతున్న నాకు రూపురేఖలు దిద్దుతున్నారు. మీ కేవిధంగా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియకుండా వుంది" అన్నాను.

ఆయన నవ్వుతూ అన్నారు. "ఎంత అమాయకుడివి బాబూ! నేచేసిం దేముంది? పోయి రామన్నను పాక అదీ శుభ్రంచేయమను; కావలసివస్తే మా పాలేరు కూడా సాయపడుతాడు."ఆయనదగ్గర సెలవు తీసుకొని, ఆరాత్రే రైతు రామన్నను కలుసుకొని, విషయాన్ని బోధపరచి, చేయవలసినపనిని చెప్పాను. రైతు రామన్న ఉత్సాహం, సంతోషం, యజమాని సంతృప్తికై చేసేపనిలో తనతృప్తి ప్రదర్శించాడు మౌనంగా!

అమర్నాడే పొలంలోని మామిడి మొక్కల దిబ్బ మధ్యనున్న పాకలో మకాం పెట్టాను. ప్రక్కనే పంట కాలవ సన్నగా వంకరలు తిరిగి ప్రవహిస్తోంది. ఎదురుగా పైరుతో నిగనిగలాడుతూ పచ్చని పల్లపు పైరుచేను వెనకాల...వీపుగా పెరిగిన పచ్చగడ్డిమైదానం కుడిచేతి వైపు చామర్తివారి కొబ్బరితోపు ఎంతో అందంగా ఉంది. అక్కడ నిర్మలంగా, స్వచ్ఛమైన గాలి వీస్తోంది. ఇంకా ప్రజల్లో పడి అదిమలినం కాలేదు. శాకుంతలంను పిల్చాను. శాకుంతలం వంగి పాకలోంచి ఇవతలకు వచ్చింది.

"చూడు శాకుంతలం...మనం ప్రకృతిని చూడాలంటే మనం ప్రకృతికి తలవంచి రావాలన్నట్టు మనం వంగిరావాలి ఇంటిలోనుంచి."

"ఎక్కడున్నా, ఎవరితో మాట్లాడాలన్నా, తలవంచి మాట్లాడ్డమే అలవాటు" ఆమె మాటల్లోని బాధను నేను గ్రహించాను. వెంటనే మాటల సందర్భాన్ని మార్చాను.

పొలంలో మకాం బాగానే ఉన్నట్లనిపించింది. శాకుంతలం కూడా సౌఖ్యంగా ఉన్నట్లు తోచింది నాకు. ఆమె బాధగాని, సౌఖ్యంగాని పైకి ఎప్పుడూ వ్యక్తం చేయదుకదా! శాకుంతలంకు తోచడం కష్టమేమో అనుకున్నాను. ఎప్పుడూ నాతో అనలేదు. ప్రతిరోజూ ఉదయం చద్ది రామన్నకు రామన్నభార్య పట్టుకువచ్చేది. రామన్నభార్య, శాకుంతలంకు కొంత కాలక్షేపం. ఇకపోతే శాకుంత

లంతో మాట్లాడేవాళ్ళే లేరు. వావిలాల తాతగారు అప్పుడప్పుడు వచ్చేవారు. నేను, గడ్డో గాదమో దగ్గర ఉంటే చూసి నవ్వేవారు. ఆనవ్వు ఎంతో ఆదరంగానూ, అర్థవంతంగానూ, ప్రోత్సాహకరంగానూ ఉండేది. ఎందుకో నాకూ అనిపించేది అప్పుడప్పుడు నేను సాదా మానవుణ్ణి కాగలిగాను అని. అలా అనుకుంటూంటే నాకళ్ళు అశ్రుపూరితాలయ్యాయి, ఆశ్చర్యంతో చకితుణ్ణయ్యేవాడిని! శాకుంతలం ఎవరు? నేను ఎవరు? నాకు అర్థంకాక కాస్సేపు తికమకపడి ఆధోరణినుండి బలవంతంగా తప్పించుకొనే వాడిని.

పోతే...ఊరివారికి మేము ఇక్కడున్నా కష్టంగానే ఉండవచ్చు. మేము ఇక్కడ ఉండడం వారికి ఒక ఉత్సాహకరమైన దర్శనీయాంశం తొలిగినట్లవుతుంది. అసలు నాకే బాగు లేదు. వీళ్లు నాగురించి ఏమనుకుంటారో వినాలని ఉంటుంది. ఏమిటీ దౌర్బల్యం వాళ్ళకిదూరంగా ఉండడం కూడా కాస్త కష్టంగానే ఉంది. ఈ దౌర్బల్యం తప్పితే...మిగతా విషయాలు బాగానే ఉన్నాయి.

నేను అనుకున్నాను...ఊరివాళ్లు మేము వాళ్లను విడిచినా, మమ్ముల విడిచిరు. నాకు వాళ్ల మనః స్తత్వం తెలుసు. వెంటనే నేను నవ్వుకున్నాను. ఏమిటిపగ? పోనీ అనుకుంటే అనుకుంటారు కాని వాళ్ళు చేయగలిగిందేముంది గనక? వావిలాల తాతగారు చెప్పింది మాత్రం నిజం. మిత్రుల మంచిని గోరంత ఉంటే కొండంతచేసి చెప్తాం. కిట్టనివాళ్ళ చెడునే ఊహించడం, పెద్దదిచేసి చెప్పుకోవడంలో నేసంతృప్తి. మనలో ఉన్నలోటును భర్తీచేసుకొన్నట్లనిపించడం సహజం. ఊరివాళ్లు ఏమనుకుంటే నేం? వాళ్లి అనుకోవడాన్ని. మనం ఓనాలుగు అనాలి అనిపించడం లేదు కదా? గాలిలో ఒకచేయి విసిరితే చప్పుడవుతుందా? దకుముకిరాయికి నిప్పురవ్వలు విసిరే ప్రభావం ఉంటే మటుకు...ఒక రాతిముక్క సహకరిస్తే తప్ప అది ప్రకాశించదు, ప్రజ్వలించదు. మనం దూరంగా ఉంటే సరి.

శాకుంతలంతో "ద్రాక్షారామ పోయివద్దామా అన్నాను" వద్దంది. బామ్మగారు చీకో, నాకో అంటుందిట! ద్రాక్షారామ ఆమె వద్దనడంలో ఇంకా కొన్ని కారణాలు ఉండవచ్చు అనుకున్నాను. ద్రాక్షారామ విడచిపెట్టి ఎంతోకాలం కాలేదు. శాకుంతలం మీద విమర్శలు. అభాండాలు ఇంకా తాజాగానే ఉండవచ్చు. అదికూడా ఒక కారణం అనవచ్చు. శాకుంతలంను అడగలేదు "నిజం కదూ" అంటూ! బాధపడుతుంది. బాధపడి ఊరుకోదు భోరుమని ఏడుస్తుంది. శాకుంతలం ఎందుకో బాధపడుతుంది లోపల. నన్ను చూస్తే లేనినవ్వు తెచ్చుకొని పేలవంగా నవ్వుతుంది. తెల్ల చీరలమీద చూపే ఆమె మక్కువ రంగు చీరలమీద చూపదు. పూర్వ విషయాలు అనుక్షణమూ ఆమెను నీడలా వెంటాడతాయి అనుకుంటాను. ఆమెను నవ్వించాలని, పూర్వ విషయాలు మరిపించడానికి "చిటకాలు" వాడతాను.

"అవును. నువ్వు ద్రాక్షారామ పోను అనడంలో బలీయమైన కారణం ఉంది." అన్నాను.

"ఏమిటి" అని ఆత్రుతగా అడిగింది. ఆమె ఎందుకంత ఆత్రుతపడిందో నాకు తెలుసు. ఆమె పడిన "భయాన్ని" నేను కనిపెట్టాననే భయం!

"అదికాదు శాకుంతలం. నువ్వు ఒక్కర్తివి ఎలా పోగలవ్? బామ్మగారికి మాట ఇచ్చావుగా?" నవ్వుతూ అన్నాను. ఆమె నవ్వింది!

రామన్న చేస్తున్న దైనందిన వ్యవసాయ వ్యాపారాన్ని చూస్తూ నేర్చుకోవడమే నా దైనందిన వ్యాపారం. పాపం! రామన్న అనుకొని ఉంటాడు "వ్యవసాయం చూడ్డం ఈయనకు సరదా" అని. ప్రతీరోజూ కొన్ని పాఠాలు నేర్పేవాడు. ఇదే తనకు ముందు 'చెడు' అవుతుందని ఎలా ఊహించగలడు! వ్యవసాయ పద్ధతులు ఆరోజూ కారోజూ బాగా తెలియసాగాయి!

పంట కోసాక, నా కివ్వవలసిన మగతా నాకిచ్చాక, నా అభిప్రాయాన్ని రామన్నకు చెప్పాను. రామన్న నిలువునా నీరయిపోయాడు. రామన్న తల మీద తువ్వాలుగుడ్డను చేత్తో పట్టుకొని ఇంటికి నడిచాడు. రామన్న భార్య శాకుంతలంతో, ఏమి మాట్లాడిందో, ఏమో, నాతో "సొంత వ్యవసాయం వద్దంది శాకుంతలం. "మరి నాకు తోచడమెలా?" అన్నా వినిపించుకోలేదు. పరిస్థితి వావిలాయనకు చెప్పాను. ఆయన "పాలు వ్యవసాయం" ఏర్పాటు చేసారు. ఇదీ బాగానే ఉంది.

వ్యవసాయం ఎంతో ఉత్సాహం, ఆనందం ఇచ్చింది నాకు. మొదటిఏడు పంట చాలా ఉత్సాహ

పరిచింది. ఎంత ఉత్సాహ పడ్డానంటే, 'పాలు వ్యవసాయం' కూడా మాని సొంత వ్యవసాయం పెట్టి అంతలాభం నేనే అనుభవిద్దా మనుకున్నాను. రామన్న మంచితనంగాని, రామన్న భార్య సహాయ సహకారాలుగాని నన్ను చలింపజేయలేదు. స్వలాభ అపేక్ష నన్ను నికృష్టంగా తయారు చేసింది. ఇంతలాభం... రామన్న సహకారంవలన వచ్చిందని నేను అనుకోలేదు. నాచేను నాకు పంటనిచ్చింది అనే భావన తప్పుతే! చేనుకొక్క యజమానిని నేను. దానిఫలం అనుభవించవలసింది నేను. ఎవడో రామన్న నాకు నా పంటలో భాగస్వామి కావడ మేమిటి? అయితే నా ఆలోచనలు నాలోనే ఉండిపోయాయి. శకుంతలంతో గాని, వావిలాల తాతగారితో గాని ఈ విషయం సంప్రదించలేక పోయాను. భయపడ్డాను. ఎందుకు భయం? నా సొంత చేనును నా అధీనంలో పెట్టుకుంటే తప్పేముంది? దానికి భయం ఎందుకు? భయపడుతున్నానంటే.. అంతరాత్మ ఎందుకో వద కాదంటున్నదన్నమాట! "తప్పు"ను చేస్తున్నపుడు ప్రతివాడూ భయపడుతాడు. అంతరాత్మ హెచ్చరిక 'భయం'గా కనపడుతుంది. భయంను, తనకు తాను పోగొట్టుకోవడానికి ప్రయత్నించడమే అంతరాత్మకు విరుద్ధంగా నడవడానికి ప్రయత్నం అన్నమాట!

సరే... రెండో ఏడుకూడా పాలు వ్యవసాయమే!

వావిలాల తాతగారికి కొంత నలతగా ఉందంటే నేను వెళ్లాను, ఆయన నవ్వుతూ పలకరించారు. "ఏమీ లేదు. మామూలు నలతే, వార్ధక్యం కదూ!" ప్రతిరోజూ వెడుతూ చూస్తూ వస్తున్నాను. ఆయన 'నలత' ఆయనను అంతకంతకు దిగజార దీసింది. చివరకు తీవ్ర పరిణామానికి తీసుకుపోయింది!!

భోజనానికి కూర్చుంటే కబురున్నట్లు వినవచ్చింది. రామన్న భార్య పరుగున వచ్చింది. నేను వెళ్లాను: ఆయన మాట్లాడే స్థితిలో లేరు. పూర్తి మగతలో ఆయన ఉన్నారు. తిరిగి వచ్చాను.

ఆయన కన్ను మూశారు!! నేను కూడా, ఆయన భౌతిక దేహం వెనక నడిచాను. మానవాళి గమ్యస్థానం రుద్రభూమి. చిన్నా, పెద్దా, చివరకు, అంతా అక్కడకు చేరుకోవలసిందే. నదులన్నీ చేరేది చివరకు సముద్రానికి అలాగే... మానవాళిలో ఉన్న తరగతులు-ఎత్తు పల్లాలు—పెద్ద చిన్నలు—అంతా సమ మట్టం కావలసిన బల్లపరపు నేల అది. అందర్నీ, ఏవిధమైన భేదా లేకుండా, సమాన ఔదార్యంతో స్వాగతమిచ్చే పుణ్యభూమి అది. చితిపై పేర్చిన వావిలాల తాతగారి మౌనముద్రతో కూడిన ఆయన ముఖాన్ని ఒకసారి చూచి, కడసారి నమస్కరించి, తిరిగి వచ్చాను బాధగా, బరువుగా!

ఇంటికి వస్తున్న నన్ను రామన్న భార్య పరుగున వస్తూ, ఆపింది. రొప్పుతూ వచ్చింది. ఏమిటన్నాను భయంగా!... "అమ్మకు నొప్పులు!!"

"ఎవరు దిక్కు?" అనుకున్నాను. శకుంతలం నొప్పులతో పెద్దపెట్టున రోదనచేస్తోంది. వెంటనే రెండుమైళ్ళదూరాన ఉన్న గవర్నమెంటు ఆసుపత్రిలో చేర్పించాను. నేను ఎంతో ఆనందమైన మాటవింటాను అనుకున్నాను. ఆ బాధలో నాకు చల్లనివార్త వస్తుందని ఆశపడ్డాను. నిద్రాహారాలు లేకుండా రెండు రోజులు శకుంతలం దగ్గర కూర్చున్నాను. ఆ నొప్పులతో మరణయాతన పడుతూ చెప్పింది.

"నేను బ్రతకనండీ!"

"ఛ"

నా మాటలు వినిపించుకోలేదు. తిరిగి తిరిగి అదే మాట చెప్పడం.

"పుట్టిన బిడ్డ అయినా కులాసా గాఉంటే..." —శకుంతలం నోటికి అడ్డు వేసాను. నాతల తిరుగుతోంది శకుంతలం పరిస్థితిచూస్తే. విసురుగా భయంగా డాక్టరును కలుసుకొన్నాను.

"డాక్టర్ ఏమిటది?"

"అనవసరంగా ఆవేశపడకండి." అని మందలించాడు నన్ను.

"కాదు డాక్టర్, ఆమె బ్రతికి తీరాలి. ఎంతైనా ఖర్చుపెడతాను."

"ఖర్చు పెట్టగలరు. తెలుసు. తల్లో బిడ్డో మాత్రమే దక్కవచ్చు. ఎవరో ఒకరు త్యాగంచేయాలి."

నాకు ఇది పరీక్ష. శకుంతలమే కావాలి. డాక్టర్."

"సాధ్యమయితే, భగవంతుడనుకూలిస్తే ఇద్దరూ కులాసాగా ఉండవచ్చు!"

నేను గది ఇవతలకు వచ్చాను. ఆ రాత్రి శాకుంతలం చాలా ఖంగారు పెట్టింది. ఆమె పడిన మరణ బాధ ఇంతింత కాదు.

"ఏమిటి శకుంతలం?" పిచ్చిగా అన్నాను. నాకు ఏం మాట్లాడుతున్నానో కూడా తెలియదు.

"ఏమీ లేదు. ఈ రాత్రి గడవటం కష్టం."

"అలా వీల్లేదు. నువ్వు బ్రతుకుతావ్."

"నాకు తెలుసు." నా చేతిని ఆమె చేతిలోకి తీసుకొంది.

"మిమ్మల్ని ఒకటి కోరుతున్నాను." అశ్రుపూరితాలయ్యాయి ఆమె కళ్ళు. నేనెప్పుడూ ఊహించలేను అల్లాంటి పరిస్థితిని ఎదుర్కొంటానని.

"చెప్పు శా!" గాద్గదికంగా అన్నాను.

"ఏమీ లేదు. పుట్టేబిడ్డ..." భోరుమని ఏడ్చింది. అంత బాధను ఆమె ఎలా భరించగలుగుతోందో! "బ్రతికితే, భగవంతుడు అనుకూలిస్తే, బామ్మగారికి..." మాట పూర్తి కాకుండానే ఆమె విరుచుకు పడిపోయింది ఆ నొప్పులలో ఆమెకు మగత కూడావస్తోంది. నన్ను నర్సువచ్చి బయటకు పంపింది. డాక్టరును కలుసుకొన్నాను.

"శాకుంతలం అధ్వాన్న పరిస్థితిలో ఉంది. వెళ్ళండి." జేబులోనుంచి నలిగిన వందరూపాయల నోటును ఇవ్వబోయాడు. ఆయన వారించారు. నన్ను తట్టుతూ "నీ పరిస్థితి విన్నాను. నాకు అర్థంఅయ్యింది. డబ్బా, ఖంగారు ఈపరిస్థితిని తప్పించలేవు దైవాన్ని ప్రార్థించు. శాకుంతలంను నర్సులు చూస్తారు. నేచేసే దేమీ లేదు. చేయవలసిందంతా చేసాను."

నేను ఏమీమాట్లాడకుండా శాకుంతలం గది దగ్గరకు వచ్చాను. శాకుంతలం మరణయాతన పడుతోంది లోపల. ఉండలేక డాక్టరుదగ్గరకు వచ్చాను. డాక్టర్ అవబోయి తగ్గిపోయాను. తిరిగి శాకుంతలం గదిదగ్గరకు వచ్చాను. అడవిబాధ! మరణయాతన! నరకంలోపడి వట్టు గిజగిజలాడుతోంది. పెద్దపెద్ద కేకలు! భరించలేను. శాకుంతలం ఎప్పుడూ అలాఅరవదు. అలా అరవగా వినలేదు. ఇది శాకుంతలంకాదు. "శాకుంతలం!" అని గట్టిగాఅరిచాను. నర్సువచ్చి డాక్టరు గదిలో నన్ను బంధించింది. క్షణక్షణమూ భయపడుతున్నాను. విన్నాను. ఆడబిడ్డను కని శాకుంతలం కన్నుమూసింది!

వావిలాల తాతగార్ని విడిచినట్టే శాకుంతలంను కూడా విడిచాను. ఎంత భయంకరమైన ప్రదేశమది. అగ్ని ప్రచండమూర్తిఅయి, దాహం చాలదన్నట్లు నాలికలు చాపుతున్నాడు. శాకుంతలం ప్రశాంతంగా మంటల అలలపై నిద్రపోతోంది!

ఎవరీ శాకుంతలం? ఎక్కడపుట్టింది? ఎక్కడ పెరిగింది? నేను ఎవరిని? చివరికి...నాచేతిలో... ఇక్కడ...బుగ్గిఅయ్యింది. పోతూ, పోతూ, ఒక బాధ్యత నను ఇచ్చి వెళ్ళిపోయింది!

ఈ కష్టకాలంలో రామన్నభార్య చేసిన సహాయం అపూర్వం. నేను ఎప్పుడూ మరిచిపోను. ప్రొద్దుపోయి రామన్నఇంటికి వెళ్ళాను. రామన్న చెడీమీద కూర్చున్నాడు. నన్ను చూసి లేచి "రండి" అన్నాడు. రామన్నభార్య పిల్లకు ఆవుపాలు పడుతోంది. తల్లి లేని పిల్ల! నాకు విచారం పెల్లుబికింది. ఏదో చెప్పాలని సంకల్పం. మాటలు రావు.

"రామన్నా మీ ఇద్దరి ఋణం నేను ఎలా తీర్చుకోనేది?"

"మాదేముంది బాబూ!"

"నేను ద్రాక్షారామ వెళతాను."

"వెళ్ళరండి. మనసు కుదుటబడుతుంది." అన్నాడు.

"మనస్సు కుదుటబడ్డానికి కాదు రామన్నా. పెద్ద పని ఉంది. చాలా పెద్దపని. నా బాధ్యత వదిలించుకోవడానికి రామన్నా. నాది వెధవ బ్రతుకు. వెధవలాపుట్టి వెధవలా పెరిగాను. నేను ఎవరికీ సహాయం చేయలేదు గాని అందరి దగ్గరా సహాయం పొందాను. మీకు కృతజ్ఞుణ్ణి."

"ఏమిటి బాబూ!

"రేపు ఉదయం పిల్లను తీసుకు వెడుతున్నాను."

"ఎక్కడికి" రామన్న భార్య అంది ఆశ్చర్యంగా.

"ద్రాక్షారామ!"

"మీకు అభ్యంతరం లేకపోతే..."

"అభ్యంతరం ఏముంటుంది? ఏమీ ఉండదు. దీనిపై నాకు ఏ విధమైన అధికారమూ లేదు. ఇది శాకుంతలంబిడ్డ. శాకుంతలంకు మాట ఇచ్చాను. నెరవేర్చాలి."

ఇద్దరూ మాట్లాడలేదు.

నేను ఉదయమే ద్రాక్షారామ బయలుదేరి వెళ్లాను. ఇంకా అలానే ఉంది హోటలు. సరిగా పన్నెండు దాటింది. భామ్మగారు ఉన్నారు. నన్ను చూసి ఆశ్చర్యపోయారు. చేతిలో పిల్లను చూసింది. ఆమె బెదిరింది. నేను బావురుమన్నాను.

"ఏం జరిగింది నాయనా?"

"మీ శకుంతలను, మీకూ, నాకూ కూడా లేకుండా చేసుకున్నాను. ఇది మిగిల్చింది తన గుర్తుగా!"

కథ చెప్పాను. ఆవిడ వింది. ఆవిడ కృంగిపోలేదు. ఏడవనూ లేదు. "అంతా విధి విలాసం. దీనికి ఎవరు బాధ్యులు? ఎవ్వరూ కారు. అందరూ ఔను. ఏది అన్నా చెల్లుతుంది. శకుంతలం ఎవరు? నేను ఎవర్ని? నువ్వెవరవు? ముగ్గురూ ఒకరికొకరు తెలియదు. సంబంధం ఏర్పడింది. ఈ సంబంధం మనం ఏర్పరచుకున్నామా? మన తెలివా? ఇది మనం పోగొట్టుకున్నామా? శకుంతలం మాట కాదనను. పెద్ద శకుంతలం పోయి చిన్న శకుంతలం వచ్చింది. ఇదెవ్వ."

ఇచ్చుకున్నాను. ఆవిడ సమాధాన పరుచుకోగలిగింది. సరే నేను. ఏడ్చాను. "ఏమిటి నాకు ఈ శిక్ష? శకుంతలం పోతూ, పోతూ, నాకెందుకు వేసినట్టు ఈ కఠినమైన శిక్ష?"

"అనవసరంగా మనసుపడకు; శిక్ష ఒకరు వేసేది కాదు. తీసేది కాదు. అనుభవించడమే. అంతే. భోజనానికి లే!"

"నేను ఉండలేను భామ్మగారూ! నన్ను వెళ్ళనివ్వండి. తల్లి, తండ్రీ లేనిపిల్ల అనాథ."

"ఛ! తప్పు నాయనా! వెళ్ళిరా!"

అలా అప్పచెప్పి తిరిగివచ్చేశాను. నేను ఏ పనీ చేయటంలేదు. శూన్యంలోకి చూస్తూ—పూర్వ విషయాలను జ్ఞాపకం చేసుకుంటూ కూర్చోవడమే. రామన్న, రామన్న భార్య నా గురించి శ్రద్ధ తీసుకొనేవారు.

ఒకరోజు నా ఇల్లుకొనుక్కున్న ఆసామీ వచ్చాడు. ఎందుకని అడిగాను.

"ఒక కోరిక!" అన్నాడాయన నమ్రతగా.

"ఏమిటది!"

"ఏమీ లేదు. నువ్వు ఉదారుడివి. నువ్వు ఒప్పుకుంటావని తెలుసు. చూడు నాయనా, ఏదో ఇల్లు కొనుక్కున్నామంటె, నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండాలనుకుంటాం."

"అవును. ఇప్పుడేం జరిగింది.?"

"ఏమీ లేదు. ఎప్పుడూ ఇంటిలో...ఒక తెల్ల చీర, రవిక కట్టుకొని ఒక స్త్రీ ఆకారం మసులుతోంది. చూసెలో తే...నీ..."

"శకుంతలమా?"

"అవును. పిల్లా జెల్లా కలవారముకదా! అప్పుచేసి ఇల్లుకొనుక్కున్నామా మరి? నీ ఇంటిలో మేం నాశనమయ్యాలను నే పాడు పేరు నీకొద్దు నాయనా!"

"నన్ను ఏం చేయమంటారు?"

"వాపసు"

"మరి డబ్బు..."

"నువ్వకొన్న..."

"అలాగే..." అని దృఢంగా అన్నాను.

ఒకరికయినా సహాయపడ్డాననే తృప్తి నాకు మిగులుతుందని ఆశపడ్డాను. పైగా శకుంతలం పిలుస్తోంది నన్ను రమ్మన్నట్లు. ఆమె కోరికను నేను ఎప్పుడూ కాదనలేదు. ఇప్పుడుమాత్రం ఎందుకనాలి? "అలాగే శకుంతలం" అని అనుకున్నాను.

తర్వాత రెండెకరాల ఆస్తి ఆ కుసకు వ్రాసి నా ఇల్లు నేను పుచ్చుకున్నాను. రామన్న, రామన్న భార్య నా తెలివితక్కువకు నొచ్చుకున్నారు. వాళ్ళకు తెలియదు. చెప్పినా అర్థంకాదు. నేను ఆశగా ఇంటిలో ప్రవేశించాను. ఒక రాత్రి, ఒక పగలు తదేకదీక్షగా శకుంతలంకోసం వెఱ్ఱిగా నిరీక్షించాను. వృథా! ఇది మోసం. నన్ను, శకుంతలం పేరు చెప్పి మోసపుచ్చాడు. మోసపుచ్చినా నా కొచ్చిన నష్టం ఏంలేదు. ఎప్పటి 'నేనును' కాగలిగాను.

ఇప్పుడు పూర్వం పరిస్థితిలో ఉన్నాను. ఒక చక్రం దొర్లుఅయ్యింది. ఇంకెంతో లేదు చివరిఅంకం. దానికోసమే ఎదురు చూస్తున్నాను. ఎంతపెద్ద వాడి నయ్యాను!

భామ్మగారికి పిల్లను అప్పచెప్పాను. కాని... కాస్తోకూస్తో డబ్బు ఇవ్వవలసిన అగత్యం జ్ఞాపకానికి

రాలేదు అప్పుడు. విచారించాను. నా తెలివి తక్కువకు. నేను చేయవలసిన పని అంతా ఈ అంకంలోనే జరగాలి. నా తెలివి తెల్లారేలోపలే అన్నీ దక్కబెట్టుకోవాలి. రైలుకోసం నిరీక్షించుతూ ప్లాట్‌ఫారంమీద బెంచీమీద కూర్చున్న ప్రయాణీకుడిలా ఉండాలి. ఇక నేను ఎటుపోయినా, కాదు...ఏ చావుబచ్చినా, ఫరవా ఉండదనిపించింది. అందుకే మిగిలిన ఏకరం అమ్మజూపాను. అమ్మను. రెండువేలు వచ్చింది. వెంటనే ద్రాక్షారామ ప్రయాణంకట్టాను.

అక్కడ!

బామ్మగారు ఉన్నట్టుండి పోయారట. మరి పిల్ల? ఎవరు తీసుకువెళ్ళారు? ఎవరో? ఏమో! ఏ అనాథ శరణాలయంలో నయినా ఉందేమో! భగవంతునికే తెలియాలి? నా డబ్బుకూడా పనికిరాదన్న మాట. ఏ ఒక్కరికీకూడా ఈ ప్రపంచంలో నేను సహాయ పడకూడదేమో! నేనంత పాపిష్టివాణ్ణా?

నా ఇష్టమా? నేను ముగింపుకోసం ఎదురు చూస్తే మాత్రం వీలు కలగవద్దూ. నా పాపాలు ఇంకా పర్దుకోకుండానే రైలు వస్తుందేమో! ఎవరు చెప్పగలరు? ఇంతకీ నా కథకు ముగింపు ఉండదా? అమ్మాయిజాడ నాకు తెలుస్తుందా? ఎక్కడ? ఎలా?...

అంతే...ఈ కథకు ముగింపు లేదేమో? లేక... అర్ధాంతరంగా ఇదే ముగింపా? కాని...ఎప్పటికయినా నేను నా కూతురును, కనుక్కో లేక పోయినా, అదే, నన్ను వెతుక్కుంటూ రాగలదనే మొండిధైర్యం నాకుంది? ఎలా తెలుసుకోగలదని నేను ప్రశ్న వేసుకున్నా, తలచినా, కొయ్యబారిపోతాను శిలా ప్రతిమలా!

# వసుచరిత్రలోని వైచిత్రి

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

వసుచరిత్రము ఆంధ్రమున నొక విలక్షణమైన కావ్యము. పంచకావ్యములలో దానికి ప్రత్యేక స్థానమున్నది. రామరాజభూషణుఁడు దానిని వ్రాసిననాటనుండి సంస్కృతకవుల కాలీవల కొంత కంటుపడెననియే చెప్పవలెను. శబ్దశాసనుఁడు భాషాంతరీకరణముతో నీయాంధ్రమునకు శ్రీకారమును జుట్టెనాఁడు. నాటనుండి కవులందఱు-'ఉద్యద్దాదరథి శ్రేష్ఠః' యని యా మార్గమునే యనుసరించిరి. కొందఱు గీర్వాణము నుండి కథలు దీసికొని 'తమది కొంత, తాల్పాక వారిది కొంతగా' రచన సాగించిరి. ఈపద్ధతులతో తెలుఁగు వారి సొమ్మంతయు దమనుండి యెరవుదీసికొన్నదే గదా యను భావము సంస్కృత కవులలో నాటుకొని పోయెను. ఉభయభాషలలోని తెలుఁగు-మెలఁకువలను దఱచి చూచిన యుద్దండుఁడు కవిసార్వభౌముఁడు. అంతటివానితోఁగూడ సంస్కృత పండితులు "నీ డు, ము, వు, లు నీవు దీసికొని మా సైపమును మాకిమ్మ"న్నారట! ఆంధ్రభాషామయమైన కావ్యము-అయోమయ విభూషణ మను తలఁపు నాటి ప్రతి గీర్వాణకవికి నుండినదే. ఒకసారి పెద్దనామాత్యులకడ నీప్రస్తావనయే రాగా-వారు "సంస్కృతారణ్య సంచార విస్వఙ్మత్తేభ శృంఖలం" అని బదులిచ్చి యాపండితుని ముఖభంగ మొనర్చిరట. ఈ బదులు లోపఁగుటలో నధికారము న్యాయముగ పెద్దనలకంటె-భట్టుమూర్తి కెక్కువ యేమో యని నాతలఁపు. వసుచరిత్ర దలయెత్తుటతోఁ- దెనుఁగువారికి గొంత యాశ్వాసము గలిగినది. తమ గొప్పలు చెప్పికొనుట వదలిపెట్టి—సంస్కృత కవులు దానిని-శ్రవ్యకావ్యముగను—దృశ్యకావ్యముగను ననువదించికొనిరి. ఆనంద గజపతి వంటి రసికప్రభువుల కొలువు కూటములలో—పండితుల ప్రజ్ఞకది నికషోపల మయ్యెను. ప్రఖ్యాత కవి పండితుఁడు అప్పయదీక్షితుల శిష్యుఁడు కాళహస్తి కవి వసుచరిత్రమును శ్రవ్యకావ్యముగ ననువదించినాఁడు. 'పేరినూరి' యను కవి—దానినే నాటకముగ వెలయించెను. పై రెండును సంస్కృతమున సాఁగిన యనువాదములు. వసుచరిత్రసౌభాగ్య మంతటితో నాగలేదు. "అంబలత్తాడు మయ్యర్" అను తమిళకవి దానిని తమిళమున కనువదించినాఁడు. లక్ష్మీసుఁడు గన్నడమున ప్రౌఢుండైన కవి. అతఁడు జైమిని భారతమును రచించెను. దానినిండ వసుచరిత్ర ఛాయలున్నవి.

ప్రాచీన కావ్యములలో - వసుచరిత్ర కున్నన్ని వ్యాఖ్యలు-మరి దేనికిని లేవు. శిష్ట్లకృష్ణమూర్తిగారు-సంగీత సాహిత్యములయం దసాధారణమైన ప్రజ్ఞగల వారు. వసుచరిత్రకు వారి దొక వ్యాఖ్య యున్నది. దానిలో, వసుచరిత్రలోని యేయే పద్యము నేయే రాగమున బాడవలెనో, సంప్రదాయమును సంతరించి, వారు చెప్పిరి. కాని యా వ్యాఖ్య నేటికిని ముద్రింపబడ లేదు. ముద్రింపఁబడునన్న యాశయును లేదు. మొన్న మొన్నటివఱకు, ముఖ్యముగ రాయలసీమలో, భిన్న రాగములలో, వసుచరిత్రలోని పద్యములను, పట్ప్రగులవలె, ఏలలవలెఁ బాడుట వాడుకలోనుండెను. తక్కిన యన్నిసుగుణములవలెనే, నేటి కీపద్ధతియు నంతరించినది. 'లలనా జనాపాంగ' యను పద్యము నెవరో వీణపై వాయింపఁగాఁ దాము విన్నట్లు వల్లమూడి గోపాలకృష్ణయ్యగారు నాతో నొకసారి యన్నారు. రామరాజభూషణుఁడు - సంగీత సాహిత్యముల లోతులు దఱచిచూచిన యద్భుతశాలి. అతఁడెక్కడెక్కడ - దన కావ్యమున వెల్లడించిన సంగీత శాస్త్ర రహస్యములే యీ విషయమును స్పష్టము సేయును. ఇప్పుడు ప్రచారమున నున్న వీణ రామరాజభూషణుఁ డేర్పాటు చేసినదే. అంతకు బూర్వ ముండిన వీణ యిప్పటివలె లేదు. దాని సారెల నొక్కొక్క రాగమునకు దగిన ట్లమర్చికొనవలసి యుండెను. ఒక రాగమునకు కుదిర్చిన సారె లట్లే యుండినచో-వేరొక రాగము వాయించుటకు సాధ్య

మర్యాదిది గాదు. ఈ విషయమును వసుచరిత్రలో పెద్దన స్పష్టముగ జెప్పినాఁడు. ఆ పద్య మిది.

శా|| వాలారుం గొనగోళ్ళ నీవలసతిన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ వంట మింజేసి యా
యాలాపంబె యవేళ బల్కెడు ప్రభాతా యారివాతాహతా
లోలత్తంత్రుల మేళవింప గదవే లోలాక్షి దేశాక్షికిన్ (3.67)

నాటరాగమునకు మేళగించిన మెట్ల మేళగింపు దేశాక్షికి బనికిరాదట. దానికి దంత్రులను వేఱుగాఁ గుదుర్పవలయును. నేటి వీణ యట్టిది గాదు. సారెలకు నియతమైన స్థానము లేర్పాటు చేయఁబడినవి. శ్రుతి గుదిర్చియే రాగమైనను, సరకట్లను మార్పకయే వాయింప వచ్చును. ఈ యమరిక సమరించినది - రామరాజభూషణుఁడే. "సంగీత కళారహస్యనిధి"— యని యాతనికి బిరుదు. ఇఁకను "భట్టుమూర్తి" సంగీతమునకుఁ జేసినసేవ యెంత లుప్తమైపోయెనో! నాటి కవులు—కావ్యార్థ వివేచనాపరులు మాత్రమే గాదు. ఇతరకళలను గూడ ముఖ్యముగ సంగీతమును—వారు సాధించుచుండిరి. రాజులు సంగీత సాహిత్య కోవిదులు. అందుకు దగినట్లే కవుల కరాంగుళులను వీణెలపై వింత సొబగులు వోయుచుండివి. దీనితో పాటు—శిల్పము—నాట్యము గూడ వారి 'సాము గరిడీ'లు. అందులోను—రామరాజభూషణుఁడు—తన యభిమానమును—సంగీతమునందే యెక్కువగ నుంచి కొన్నట్లున్నది.

వసుచరిత్రమున సంగీత రహస్యముల నెన్నిటినో రామరాజ భూషణుఁడు వెల్లడించెనంటిమి. ఆ వెల్లడించుటలో గూడ నెంతయో చమత్కారముగఁ జెప్పును. చమత్కృతి యతని కొక ప్రత్యేక గుణము. అది లేనిది శోభ యుండదని యాతని సిద్ధాంతము. చమత్కారము మాత్రమే చాలదు. అది 'రసోదంచిత' ము'ను గావలెను. కనుక నే 'సకల జన సంసేవ్యంబగు నొక్క మహాకావ్యంబు రసోదంచిత చమత్కృతియా కల్పాకల్పదివ్యంబు గా' సంతరింపఁ బూనినాఁడు.

శబ్దార్థ చమత్కారములకు—ముఖ్యముగా శబ్ద చమత్కారములకు వసు చరిత్రము పుట్టినంటిది. ప్రతి పద్యమందును—యీ గుణము 'చేనువాన్న' వనును. దానికిఁదగినట్లు—యనేక నిఘంటువు లాతని జిహ్వాగ్రమున నాట్యమాడుచుండినవి. ఇంతటి శబ్ద చిత్రములుగల కావ్య మింకొకటి మనకు గానరాదు. తరువాతి వారెందరో యతని ననుకరింపఁజూచిరి. కాని వారి ప్రయత్నములు రక్తికి రాలేదు. ప్రధానముగ రామరాజభూషణుఁ డాదరించినది శ్లేష. చదువుచున్నప్పుడతని పద్యములలో శ్లేష యున్నట్లే తెలియదు. ప్రకృతార్థమునకే మైప యనకు దగిలినగదా మనకు దాని జోలి! అట్టిది మంగునకైన నాతనియందు గానరాదు. పైఁగా నొక్కొకచోట—శ్లేష యున్నదే మీనాని పని గట్టుకొని వెదుకవలసియుండును. దాని నింత సహజ సుందరముగ బోషించినవాఁడాంధ్ర సాహిత్యమున మరి యొక్కఁడు లేఁడు. క్రింది పద్యము బరికింపుఁడు.

"భావం బెక్కడ లేక వృత్తినియమా
పాయంబు జింతింప, కొం
దేవర్తించి, పరార్థ బంధనలచే దీపించి,
మూర్తాళి సం
భావింపం, సుకవి ప్రణీత కృతి,
సామాన్యాకృతిం బూని, పై
పై వన్నె ల్పచరింప, దానిఁ దిలకింపంబోరు
ధీరోత్తముల్."

వేశ్య కెటి యవగుణము లుండునో, సుకవిప్రణీత కృతికి గూడ నట్టివే యుండునట! ఇందలి శ్లేష చాల సుందరమైనది. పద్యమును జదువునప్పుడు మనకు శ్లేష యున్నదనుభావమే తట్టదు. కారణము అందలి పద సామగ్రి శ్లేషకై వెదకి తెచ్చినదిగాదు. 'రసపారవశ్యమున కియ్యకుఁ దనంతఁదా వచ్చిననాయికవలె' తనంతఁదా వచ్చి కుదురుకొన్నది.

సంస్కృతమున భట్టబాణుల పలుకుబడి యింతింత గాదు. "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అని-పండితులాయనకు బ్రహ్మరథమును బట్టిరి. ఆతఁడు దడవి చూడని విషయమే లేదు. వాగ్దేవి యాతనిని వలచినది. అతని కనుసన్నల నాడినది. అతని తరువాతి సంస్కృతమున నంతటివాఁడు పుట్టలేదు. అట్లే, తెలుఁగునకు భట్టుమూర్తి, భాషతో నాతఁడాడినది యాట-పాడినది పాట. అతని నోట నేమాట వెడలినను-సందో యొక శ్లేష-యొక వైచిత్రి నవ్వుచుండును. ఈ పద్యమును దిలకింపుఁడు!

మ॥ అరిగా బంచమ మేవగించి
    నవలా లవ్వేళ హిందోళ నై
ఖరి మాపంక్తిక జాల మాత్సరత
    ధీంగ వ్యాకులంబై వనీ
ధర నాలంబిత పల్లవ వ్రత విధుల్
    దాల్పం బ్రదియ ధ్వనిన్
సరిగా గైకొనియెన్ వసంతము,
    మహాసంపూర్ణ భావోన్నతిన్॥

శిశిర వసంతముల సంధికాలము వచ్చినది. అప్పుడు యువతులు హిందోళ రాగము నాలపించిరి. ఆ రాగమునకు పంచమస్వరము వర్జ్యము. పికములకు పంచమస్వరమే ప్రాణము. అది లేని హిందోళ గానము చెవులకు రోతైనది. ఎటులైనను-వాయసముల సంగీతములో-దాము స్థానము సంపాదించికొనవలె నను కొన్నవి. అడవులలో చిగుళ్లు మేయుచు వ్రతము పట్టినవి. వాని తపస్సు పండినట్లు వసంతము వచ్చెను. ఇక నేమున్నది! కలకంఠ నాదములతో కకుబంతములు మారుమ్రోగినవి. కలకంఠులు వల్లకులు మేళవించి-వసంత రాగము నాలపించిరి. ఆరాగము-పికధ్వనిని గూడ-దనలోఁ గలిపికొని-తన యుదారతను బ్రకటించెనట! వసంతము షాడవరాగము. కాని-రామరాజభూషణుని మతమున నది సంపూర్ణరాగమేమో! సంగీతశాస్త్రరహస్య నిధి సిద్ధాంతము నందుకొనియే తరువాతి విద్వాంసులు-'చ్యుతపంచమము' దానిలో నుపయోగించిరి. ఇక్కడ-కవి సూచించిన సంగీత సంప్రదాయ మట్లుండఁగా-"అరిగా-సరిగా" నను పదములలో-మరికొంత చమత్కార మున్నది. ఆ స్త్రీలు - పంచమము 'నరిగా' సేవగించిరట!. అనఁగా-శత్రువుగా నన్న యర్థము స్పష్టమే. ఋషభస్వర వర్జ్యముగా ననియు నర్థాంతరము. హిందోళమునందు - పంచమము తోఁ బాటు - ఋషభమును వర్జ్యమే. వసంతము పంచమమును 'సరిగా' స్వీకరించెను. అనఁగా—ఆరోహణమున షడ్జ - ఋషభ - గాంధారము క్రమముగా ననుట! ఇది రామరాజభూషణుఁడు జూపిన చమత్కారము.

ఒక్కొకచోట దానుపయోగించు మాటలలో - నేదో నిగూఢమగు భావమును బొదిగి - యామాటల కెక్కడనో సంబంధము నాతఁడుగల్పించును. పాఠకుల కందేదో యర్థము దాగియున్నట్లు స్ఫూర్తి కేరాదు. తలచి- తలచి లోతునకుఁబోయినగాని - దానిగుట్టు తెలియదు. మచ్చున కొకటి బరికింతము.

వసురాజు కోలాహల పర్వతమునకు - విహరింప బోయినాఁడు. ఆ గిరికందరమునుండి మధుర గానము వినవచ్చినది. అంత కమ్మగా - నా కొండకోనలోఁ బాడుచున్న యువతు లెవ్వరో - తెలిసికొనిరమ్మని— నర్మసచివుని బంపినాఁడు. వాఁడా జవ్వను లున్నచోటికి బోయి - పొదలమాటున నిలిచి చూచెను. గిరిక వీణ వాయించుచున్నది. ఆమె "ప్రచుర తానామృతముల మూర్ఛనలచే". "నచేతనంబులు చేతన రీతి దనర। చేతనంబు లచేతన భాతినొనర" వల్లకిని మ్రోయించుచున్నది. తానామృతములచే - నచేతనములు చేతనము లగుటలో నౌచిత్యమున్నది. అట్లే 'మూర్ఛనలచే' చేతనంబు లచేతనము లగుటయుండును. ఆ యలివేణి లావణ్యమును జూచిన నర్మసచివుఁడు—

సీ॥ తన కప్పు నెఱి కొప్పు నెఱయూని గౌరీ స
    మాఖ్య మించఁ జనించినట్టి యార్య,
తన చాపలము చూపులనెఁ జూపి, సిరులెల్ల
    కడఁ జల్లవచ్చిన కమల పాణి,
తన పాండిమము నవ్వులనె యుంచి, గాంధర్వ
    మవనికిఁ దెచ్చిన, యంచయాన,
తన యదృశ్యత నడుమున దాల్చి పొంగరౌ
    వెంగసీన యతను సమ్మోహ విద్య,

గీ॥ గావలయు నీవెలఁది, దీని కాంతి సుగుణ క
    ళాభిరూప్యము లెఱిఁగించి, యా మహేశు
    నా నగోద్ధారకుని, నా ప్రజాధినాథు
    నా జగన్మోహనుని దెత్తు, ననుచు జనియె॥

గిరికను నా సచివుఁడు పార్వతీ, లక్ష్మీ, సరస్వతుల తోఁ బోల్చినాడు. చాలనిదానికి మీనకేతనుని సమ్మోహవిద్యతోను, అట్లే వసురాజును మహామూర్తులుగను మన్మథునిగను — రూపించికొన్నాఁడు. ఈసుందరి కా యందకాఁడు దగినవాఁడనియు — నిశ్చయించికొన్నాఁడు. వసు రాజుకడకుబోయి—

ఉ॥ స్వైరవిహార ధీరలగు
    సారసలోచన లున్నచోటికిన్
పోరున లాతివారు
    జొరబూనినచో రసభంగమంచు నే
జేరక పువ్వుదీవియల
    చెంతనె నిల్చి, లతాంగి రూపు క
న్నారగ జూచి వచ్చితి,
    నవాంబురుహాంబక, నీకు దెల్పగన్॥

అని తాను వారిని జూచినతీరు వివరించినాఁడు. పైపద్యమున రెండు చిత్రము లున్నవి. 'సారసలోచనలు స్వైరముగా విహరించుచోటికి లాతివారు పోయిన రసభంగమగునట! ఇది పైకి దోచు నర్థము. 'సారసలోచనలు' అనుపదమున 'రస' భంగము — అనఁగా — రసశబ్దము లోపించిన — 'సాలోచనలు' నిగులును. కుసుమపేశలములైన వారి చిత్తముల నాలోచనలు వోసి యలయింపుట పాడిగాదని పొదలచాటున నాతఁడు నిలిచినాఁడు. ఇక నొక చిత్రమున్నది. అదియే మనకు ప్రధానమయినది. నర్మసచివుఁడు—'వనాంబురుహాంబక!" యని వసురాజును సంబోధించినాఁడు. అంత పొసఁగైన విశేషణమునకు సార్థక్యము నిరూపింపవలెను. 'శ్రోత్ర తామరలవంటి కన్నులు గలవాఁడా!' యని దాని యర్థము. కాని—కవి యభిప్రాయ మంతటితో విశ్రాంతము గాదు. గిరికను నర్మసచివుఁడు నాలుగురీతులుగ రూపించిన పద్యమునందు — వసురాజునుగూడ — నాలుగురీతుల నిరూపించినాఁడు. ఆరూపణము నాలుగు విశేషణములతో జరిగినది. ఈపద్యమం దొక్క దానితోనే—యా నాలుగర్థములను జెప్పి యాపద్యముతో బొత్తుగలిపినాఁడు. "అంబురుట్" శబ్దమున 'అగ్ని' యని యర్థము. అగ్నినేత్రుఁడు శివుఁడు. అన్యకాతఁడు దగును. అంబురుహాంబకుఁ డనగా పుండరీకాక్షుఁడు. ఇది విష్ణువునందు రూఢము. కమలపాణికి బుండరీకాక్షుఁడు దగినవాఁడే. గిరిక హంసయాన. వసురాజు అంబురుహము "ఉత్పత్తి స్థానముగ" గలవాఁడు. అనఁగా బ్రహ్మ. మన్మ[illegible] కంబురుహము పంచబాణములలోఁ జేరినది. ఇది — యీపద్యములోని యాశ్చర్యకరమైన ప్రతిభ, 'యాపు' పెండ్లికాని బాలికలు ధరించెడు నొక యాభరణ విశేషమని రాయలసీమలోని పెద్ద లందురు. ఇట్టి సాభిప్రాయములైన విశేషణములలో—నాతఁ డింతటి భావమును దాచియుంచును. పై నుదహరించిన రెండు పద్యములకును నడుమ నిరువదియేడు పద్యములు నడచినవి. ఇరువదిరెనిమిదవపద్యమున, మరల దనచూపు వెనుకకు మలపినాఁడు. అతని కావ్యమునింత మన కిట్టివి గానవచ్చును.

కన్నడరాయఁ డాంధ్ర కవితాపితామహుల కందలము బట్టునాటికి భట్టుమూర్తి చిన్నవాఁడు. పెద్దనకుఁ బట్టిన యీ యదృష్టమును దలఁచి పైకి యెంత సంతసించినను-లోలోన గొంత యసూయయు—నాఁ డిలోఁ దావుచేసికొని యుండును. దానితో పెద్దనపై భట్టుమూర్తికి—స్పర్ధగూడ చేర్పడినది. అట్లగుటలో వింతలేదు. తప్పుగూడ లేదు. పెద్దనకంటె నా నేమిట దక్కువ? కొంత నెమ్మదిగ నాలోచించినచో—నతనికన్న తనదే పైచేయి. ఇట్టితలఁపు లతని యెడఁదలోఁ దప్పక భాసించియుండును. అందుకే యతఁడు తన గ్రంథములో చాలచోట్ల పెద్దనామాత్యులను సవరించుటకు వలెఁ బ్రయత్నించును. మనుచరిత్రలోని "అదటబుట్టిన చిగురాకొమ్మైన చేవ" యను పలుకుబడి ప్రసిద్ధమే. దానిని పెద్దనామాత్యులు—అరుణాస్పదపుర విషయమున వాడిరి. అచట నా ప్రయోగము లాక్షణికము. దానిని గమనించి—భట్టుమూర్తి యిట్లు వ్రాసినాఁడు.

క॥ స్వామీ యేమని పొగడెద
మామనికిఁ జనికి యైన యారామముఁ గన్,
గామ విశిఖాస్త్రములు ద
క్కోమలతర లతలు చిగురుకొమ్మల చేవన్॥

చిగురుకొమ్మలు ద్యానములందే యుండును. "చిగురుకొమ్మలే చేవగలవిగా నుండగా నితరము లేమి చెప్పవలె"నని ధ్వని. పెద్దనామాత్యులు మనుచరిత్రము మూడవ యాశ్వాసమున

"తామరతంపరై ప్రియులు దారు, విహారము సల్పుచోట" (3.29)

—నని "తామరతంపర" శబ్దమును బ్రయోగించిరి. "ఎక్కువగా"నని యీ శబ్దమున కర్థము. భట్టుమూర్తి యీ పద్యమును గ్రహించి యిట్లు వాడినాడు.

॥సీ॥ తనగుల్లు తామర తంపరై మెలయు సం
పన్నలినాక్షి కాపున్న చోటు (3 155)

—'తామరతంపర' యనుశబ్దము — తామరలల్లుకొనుటలో పుట్టినది. తరువాత నా పదము భాషలో—'దండిగా' నను నర్థమున బ్రయుక్తమయ్యెను. ఆ పదముయొక్క మూలమును స్పృశించి, దాని నావిషయముననే వాడుట భట్టుమూర్తి చూపిన మెలకువ.

పెద్దనలు "ఆనందో బ్రహ్మయటన్న ప్రాఁజదువ"న్న మాటను వాడిన సందర్భము సాహితీపరు లెఱిఁగినదే. ఆ యభిరుచిని విరసించుచున్న వానివలె, భట్టుమూర్తి యీ పద్యమల్లినాఁడు.

సీ॥ పినుల విందై యమృతపు
సోనల సొందై యమంద సుమదలదళనీ
గానము క్రిందై యారవ
మానంద బ్రహ్మమైన నధిపతి పలికెన్
(2.14)

రతి విషయముకంటెను — వాదానుభవమువం
దానంద బ్రహ్మ సాక్షాత్కారము, రసికమైన యను
భవము. కాని, పెద్దనామాత్యుల పద్యమెంతో తార్కి
కముగా నున్నది. ఆ పద్యమిది:—

శా॥ ఎంతేజెందము గందళించు రహిచే నేకాగ్ర
తన్నిర్వృతిన్
జెందుం గుంభిగత ప్రదీప కళికా శ్రీదీప్ర నెం
దెందు లో
కెంచి నింద్రియముల్ సుఖంబుగను నాయింపే
పరబ్రహ్మమా
నందో బ్రహ్మ యటన్న శ్రాజగుపు వంతిగ్బుద్ధి
నూహింపుమా (2.62)

ఆనందమును భౌతిక సుఖమున కన్వయించినను బ్రహ్మానందానుభవ లక్షణములు కొన్ని, వారద్పట సమన్వయించినారు. ఈపద్యమును జూచి భట్టుమూర్తి పెద్దనామాత్యులు చెప్పక విడిచిన కొఱతను పూరించుచు వ్యాఖ్యానించుచున్న వానివలె—గిరికా వసురాజుల ప్రణయ సుఖము నిట్లు వర్ణించెను——

శా॥ భూనాథాగ్రణికి న్వధూమణికి సంభోగాంత
సౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబు దెల్పె ననవద్యంబై య
వేద్యాంతరం
బై నిర్లేపకలాపమై క్రమవిముక్తైకైక బం
ధానుసం
ధానంబై యపునర్భవప్రభవభేదంబై, విజృం
భించుచున్

రతిసుఖము బ్రహ్మానందసామ్యము నెట్లు పొందినదో భట్టుమూర్తి శ్లేష సహాయముతో ప్రౌఢముగ నిరూపించినాఁడు. పైఁగా—నీ రెండు పద్యములును—శార్దూలములే యగుట రసికులు గమనింపఁ దగినది. పెద్దనామాత్యుల పద్యమును జూచియే దీనిని రామరాజభూషణుఁడు వ్రాసెననుట కిదియొక స్ఫోరకము, పెద్దన పద్యముతో 'కుంభిగతప్రదీపకళికాశ్రీ' యను సమానమున్నది. భట్టుమూర్తి దృష్టిలో నది యద్భుత సరిగా బోదిగినట్లు లేదు. దానిని గూడ చక్కగా వాడి చూపవలెననుకొన్నాఁడు. అందుకై యాతఁడీ పద్యమల్లెను.

గీ॥ కుంభిగత దీపశోభావిగుంభి లీల
కుంభికుచ మీన మాడ్కి లా గుబ్బగొనగ
గాంచు విభుఁ డంగనాప్రసంగంబు కతన
మంత్రితను నెట్టకేలకు మరలిమాచి
(2. ఆ. 77 ప.)

వసురాజు మాపులు కుంభికుచయైన గిరికాదేవి పైఁ బడినవి. అతని మాడ్కులు దీపములవలె—గిరికాదేవి స్తనములు కుంభములవలెనున్నవని భట్టుమూర్తి భావము. ఈ దృష్టి వసుచరిత్రలో నెక్కడ బట్టినను కనిపించును. కనుగలిగి చూడవలెనంతే.

శ్లేషను వాడుటలో భట్టుమూర్తికున్న శక్తి మఱెవ్వరికిని లేదు. అతఁ డావిద్యలో నెన్నియో చమత్కారములు సేయును. కోలాహల పర్వతము నాతఁడు వర్ణించినాఁడు. ఆ పద్య మిది.

సీ॥ సుమనోభివాస భాసురశిఖోన్నతివాఁడు
ఘనసారతిలక వాసనలవాఁడు
ఘన పంకమద సాంద్ర గండభాగమువాఁడు
నవపద్మరాగ దంతములవాఁడు
కలితోప కంఠ వక్త్రతిమాలికవాఁడు
హరిచందనచ్ఛాయ నమరువాఁడు
తపనీయ మేఖలా ధారిశస్త్రము వాఁడు
మణిపాదవలయ ధామంబువాఁడు
గీ॥ సర్వ రత్నాకరీ విచిత్రాంబరాభి
రామకింగారముల వాఁడు హైమగర్భ
గేహమున కేగువాఁడు కోలాహలాఖ్య
ఘోరకధరాధీసు డెదురయ్యె నుదిదకప్రుడు.

ఇందులో పర్వతార్థము ప్రకృతము. కాని—యీ పద్యము నడచిన శైలిలో కోలాహలుని పరమైన యర్థము విడకకొనవలసి యున్నది, ఇది యాతఁడు శ్లేషలోఁ జూపిన చిత్రము. ఇట్టివెన్నియో యుదాహరింపవచ్చును.

భట్టుమూర్తికి గల సంగీతాభినివేశమును సూచించు పద్యము లనుగడుగునను నండికొన్నట్లు వసుచరిత్రము నిండియున్నవి. గ్రంథమంతయు నా విష

యమున కుదాహరణమే, మరియొక్క పద్యము మచ్చునకుఁ జూపుదును.

మ॥ "ఇది సంధింపఁగ వేళయంచు వసురా
 జేంద్రుండు వీరంధ్రనీ
రదవారప్రతిసీర వెల్వడిన తా
 రాభిద్రల్లీలవ తా
చ్ఛాదసంఛాదికశాపి నిల్చె నెదుటన్
 సారంగరాగక్రియ
న్వదన భృంగీరుతి వందిమాగధ కథా
 మాధుర్యముల్ దెల్పఁగన్."
 (3 ఆ. 45 ప.)

ఉపమానమూలమున మహాకవి నాటక సంప్రదాయమును పొందించినాడు. వసుచరిత్రమున నున్నన్ని నాటకలక్షణములు—యితర ప్రబంధములలో---గావు. అది విషయాంతరము, ఇందులోని 'సారంగ రాగక్రియ న్వదన భృంగీరుతి' యను విశేషణ మిప్పుడు మనకు ప్రధానము. మగతుమ్మెదల యందలి యనురాగముచే మ్రోయుచున్న భృంగీగణమని దానికి వ్యాఖ్యానము. సారంగ రాగముతో మ్రోయుచున్న యాడు తుమ్మెదల మ్రోతయని యర్థాంతరము. ఆడు తుమ్మెదల ఝంకార మిచ్చట సారంగ రాగముతోఁ బోల్పఁబడినది. తుమ్మెదల ఝంకారమునకు సారంగ రాగముతో గల సాదృశ్యము- రసికులకుఁ దెలిసిన విషయమే. ఆనాఁడు వందిమాగధులు రాజును పొగడుట కారంభించినపుడు సారంగ రాగముతోనే మొదలు పెట్టుచుండిరేమో !

స్త్రీలకు సంగీతము - పురుషులకు సాహిత్యము తగిన విద్యలని భట్టుమూర్తి భావించె నేమో! అందుకే యాతఁడు స్త్రీలనుగూర్చి చెప్పునపు డంతయు- రాగములను ధ్వనింపఁజేయుచుఁ బోవును. కుతీమతి నాతఁడు కల్యాణి (5 ఆ. 24 ప.) యని సంబోధించినాఁడు. ఆతనికీ యభిప్రాయమున్నదను విషయము మనకీ క్రింది పద్యమున స్పష్టముగా దెలియును.

"సతిసాహిత్య రహస్య మీవు వలనన్
 సాధించి తోడ్తో నతి
స్తుతికిం బ్రత్యుపదేశ మిచ్చె నతుల
 ప్రౌఢిన్ ధ్వనివ్యక్తిద
వ్యుత్పత్తికిం జొన్పుదు లోచనాంజన రస
 ప్రోత్సేకముల్ తన్ముఖో
ద్గతముల్ సేయుచు బ్రత్యలంకరణ మా
 ధుర్యంబు దీపింపఁగన్. (6 ఆ. 94 ప.)

గిరికాదేవి రతి మర్మములను వసురాజుతో సాధించి యతుల ప్రౌఢితో ప్రత్యుపదేశ మిచ్చినదట! సాహిత్యముయొక్క రహస్య మనియు నర్థాంతరము. భట్టుమూర్తి సృష్టించిన యధిష్ఠానపురమందలి బాలికలు గూడ 'జగదభివంద్య గానము'ను నేర్చిన వారే.

ఇట్లు వసుచరిత్రలోని విశేషములు త్రోడు కొలఁది వచ్చుచునే యుండును. "సాహిత్య మాలోచనామృతి" యన్నమాట వసుచరిత్రలో సార్థకమైనంత - మరి యే ప్రబంధమునను కాదేమో యని నా యూహ !

# కళాకారులు

శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి

**పాత్రలు:** శేఖరం, కామేశ్వరరావు, చిదంబరం, అప్పలస్వామి, డాక్టరు, పోలీసు

* * వరండా గది. ఒకవైపు వీధివాకిలి. రెండవవైపు ఇంటిలోపలి ద్వారం. ఒక పడకకుర్చీ, మూడు మామూలు కుర్చీలు. ఇతర అలంకరణాలు. వాకిట్లోనుంచి కామేశ్వరరావు ప్రవేశం

కా : శేఖరంగారింట్లో వున్నారండీ...

అ : (ఇంట్లోనుంచి వస్తూ) ఎవరండీ...

కా : శేఖరంగారి కోసం వచ్చాను...

అ : (తేరిపార చూస్తూ) నేనూ అదే అనుకున్నాను లెండి.

కా : (విసుగ్గా) ఏమిటా మాటలు...ఇంట్లోవున్నారా (లోపలకు పోబోతాడు)

అ : ఉన్నారు గానీండీ... చాలా కోపంమీద వున్నారు.... అందుకని భయపడుతున్నాను.... కొంచెంసేపు కూర్చోరాదుటండి...

కా : కోపంగా వున్నారా...ఏమిటి విశేషం...

అ : అదేమో తెలీదుగానీండి... రాత్రినుంచి చాలా చిరాకుపడుతున్నారు.

కా : ఇంతకీ ఈ ఇంట్లో ఎవరెవరు వుంటున్నారు వాయనా. అహా...నువ్వు కావండా...

అ : అబ్బే... నేనూ ఆరేగదండీ...ఉంట...

కా : మరి! భోజనం...అదీ...

అ : భోజనం అంటే హోటలునుంచి నేనే తెస్తానుండి...మరింక అదంటే రాత్రిపూట ఆలస్యంగానే వస్తారయ్యే యింటికి.

కా : ఏమిటీ వాగుడు ... మరుంటే మాట్లాడుతున్నావా...

అ : మరీ చిత్రం...మతిలేకపోతే మాటెలా వస్తుందండి...

కా : ఇదుగో...కోపం తెప్పుకోక...నీపేరేమిటి...

అ : (కోపంగా) అదంతా ఎందుకు లెండి... అయన్ను పోయి పిలుచుకువస్తాను... (లోపలకు పోబోతాడు)

కా : (కామేశ్వరరావు అతన్ని పట్టుకుని బుజ్జగిస్తూ) నీతో చాలా అవసరమైన పనుంది...అన్నట్టు నువ్వు చుట్టలు కాలుస్తావా (చుట్టనొకటి తీసి యిచ్చి) ఈపొగాకు ఎక్కడిదో తెలుసా... గుంటూరుది.

అ : అబ్బే...ఎందుకు లెండి (అంటూనే చుట్ట తీసుకుంటాడు) (వాసనచూచి) ఇది గుంటూరేనండి...

కా : కొంచెం మెల్లిగా మాట్లాడు...శేఖరం నిజంగా వున్నాడా యింట్లో...

అ : పత్తె ప్రమాణకం అండి...ఇంకా నిద్రకూడా లేవలేదు...

కా : ఇందాక కోపంగా వున్నారన్నావు...

అ : అంటే..."ఏమిటిదయింది బాబూ, కాఫీ తాగుతారా" అని పిలిచినానండి...దాంతో లేస్తిరి. నన తిట్టునా...నా నా చివాట్లు వేసి మళ్ళీ పండుకున్నారు...

కా : రాత్రి ఎంత యిందేమిటి వచ్చేటప్పటికి...?

అ : రెండుగంట లవుతుందండి...అయినా అవన్నీ మీ కెందుకులెండి.

కా : అలా అంటే ఎలా చెప్పు...మనం అంతా కావలసినవాళ్ళం (రూపాయి కాగితం ఒకటి తీసి యిస్తాడు) ఆయన ఇంకా నిద్ర లేవలే

దన్నావుకదూ...(గడియారం చూచుకుని) అప్పుడే తొమ్మిదవుతోందే...ఏం వాయనా! నీ పేరేమిటి...

అ : అప్పలసామి అండి...పేరుకేంలెండి...అప్పలూ అనే పిలుస్తారు మా అయ్యగారు...

కా : అప్పలసామీ...నేనొకటి అడగనా.

అ : ఒకటి కాకపోతే పది అడగండి బాబుగారూ. కాదన్నానా.

[రూపాయి బొడ్లో దోపుకుంటాడు.]

కా : మీ శేఖరం ఏం చేస్తూ వుంటాడు...?

అ : ఏం చేస్తాడో తెలీదుగానీ...ఎప్పుడూ ఏదో వకటి రాస్తూ వుంటారు...తెల్ల కాగితాలు ఎన్ని కొంటారో ఏమోగానీ...ఇంటినిండా అయ్యేవండి...

కా : ఆహాఁ...

అ : వాళ్ళూ...ఆ సినిమావాళ్ళు లేరండి...వాళ్ళ దగ్గరికి పోతారండి. సినిమా కథంతా ఈయనే చెప్పారట.

కా : నువ్వు కూడా ఎప్పుడైనా వెళ్ళావా...

అ : అదేంటండి...అట్లా అనుకుతారు. ఎప్పుడూ అరివెంటే వుంటాగదండి...అంజనేయులోరికి తోక వుండదుటండి, వారికి నేను అట్లాగను కోండి...

కా : నువ్వేమన్నా చదువుకున్నావా...

అ : చదువేవస్తే...ఈ తిప్పలు ఎందుకండి...నేను కూడా ఏదోవక సినిమాకి కథ రాయకపోదు నండి...

కా : భలేవాడివే...మరి నీకు పెళ్ళాం...పిల్లలూ...

అ : అదెందుకులెండి (లోపలకు పోబోతూ) అయ్యగారు నిద్రలేచారేమో...

కా : ఇదుగో వక్కమాట...

అ : అదిగో ఆ మాటే అడగొద్దనంది (లోపలకు పోతాడు).

[కామేశ్వర్రావు తిరుగుతూ వుంటాడు]

అ : (వచ్చి) ఇంకా నిద్దర లేవలేదండి...మీరు బజారుకోయి వస్తారా.

కా : బజారు కేమొచ్చిగాని...అప్పలసామీ...నిజం దాచకుండా చెప్పు...ఈయనదగ్గర నౌకరీ కోసమే వుంటున్నావా...

అ : మరెందుకండీ...తెలియక అడుగుతానూ...?

కా : తెలియక కాదు. తెలిసే అడుగుతున్నావు... ఈయన నీకు జీతం ఎంత యిస్తున్నారు...?

అ : జీతాని కేముందండి...తిండి యిక్కడే గడిచి పోతున్నదాయె...బట్ట కూడా అయ్యే యిస్తారు. ఇంకేం కావాలి.

కా : అంతేనా నీకు దొరికేది.

అ : అవును కాదండి......

కా : తిండీ బట్ట కాకుండా పైన పదిరూపాయలు ఇస్తాను...నాతో బాటు వచ్చి మా యింటిదగ్గర వుంటావా......

అ : ఇక్కడ బాగానే వుంది గదండి......

కా : అదే "ఏంబాగుంది......" తెలుసుకుందామనే అనుకుంటున్నాను......

అ : అవన్నీ ఎందుకులెండి...

కా : ఎందుకూ అంటే కాదు...చాలా అవసరం...

అ : ఏమిటో అది...

కా : అయ్యగారు ఎప్పటినుంచి తెలుసు నీకు...

అ : ఇప్పుడెక్కడండి...నేనూ మా అన్న ఈ ఊరు వచ్చినప్పటినుంచీ ఎరికే గదండి...

కా : మీ అన్న ఏంచేస్తుంటాడేమిటి...?

అ : రిక్షా లాగుతుంటాడు లెండి...

కా : ఎవరి రిక్షా అది...

అ : మాంబళంలో ఎవరో ఆసామీ అండి...అద్దెకు తెచ్చుకుంటాడు...

కా : మీ అన్న ఎక్కడవుంటాడు...

అ : అదూ...ఇక్కడేవుంటాడండి...

కా : ఇక్కడ మీ రిద్దరే వున్నారన్నావుగదూ...

అ : మా అన్నే గదండి?...అది లెక్కమున్నది...

కా : మీ అన్నకు పెళ్ళయిందా...

అ : అదుగో......ఆ పెళ్ళాంసంగతే...... అడగొద్దనేది...

[చిదంబరం ప్రవేశం]

చి : ఎవరిపెళ్లాం సంగతీ మాట్లాడుకుంటున్నారు...

అ : అయ్య...దణ్ణాలండి...

చి : ఆ ... ఆ ... (కామేశ్వర్రావువేపు తేరిపార జూస్తాడు.)

అ : ఈయన...అయ్యగారండి ... గుంటూరునుంచి వచ్చారు...శేఖరం బాబుగారితో...

చి : శేఖరంగారితో నేనాపని...! ఏరా అప్పలూ... ఏమిటి విశేషం.

అ : అబ్బే ఏంలేదండి ... ఏదో పనిమీద వచ్చారుట...

చి : (వ్యంగ్యంగా) పనికొలా...మీ బాబు ఏమంటాడురా...వచ్చిందటవా...

కా : ఏమిటి వచ్చేది...

చి : నే నేం ఆకాశంలోంచి ఊడిపడలేదు లేవయ్యా.... నేనూ శేఖరం అంతా వకటేలే...ఎక్కడ నుంచి వచ్చారేమిటి...?

కా : (కోపంగా) ఏమిటి...మీరు మాట్లాడేది...?

చి : మొన్న ఉత్తరం రాసింది మీరుగాదుటండీ (అప్పలసామివైపు తిరిగి) ఏరా...అప్పలూ... బేరం పటేలు కాలేదేమిటి.

అ : ఆదేమిటో నాకు తెలియదండీ...

చి : దొంగవెధవా...నీకు కూడా రహస్యాలు ఏమిటిరా...డొక్క చీరేస్తాను...

అ : ప్రమాణీకంగా అండీ...నాకు తెలీదంటుంటే...

చి : తెలియకపోతే చావు ... శేఖరాన్ని పిలుచుకురా... నేను మళ్ళా తొందరగా పోవాలి...

అ : ఇంకా నిద్ర లేవలేదనుకుంటానండి.

చి : లేవలేదా...? ఆ కర్ర పుచ్చుకు వాలుగుతుకు అన్ని నిద్రలూ వదిలిపోతాయి.

అ : నాకు చావొచ్చిందే...

చి : నీకు ఎల్లాగో చావుమూడిందిలే (సంచీలోంచి సారా సీసాలు తీసి యిస్తాడు) ఇవి తీసికెళ్లి లోపల పెట్టు...(కామేశ్వరరావువైపు చూస్తూ) అట్లా చూస్తావేమిటయ్యా...

[అప్పలస్వామి లోపలకు వెళ్ళిపోతాడు]

కా : అబ్బే ఏంలేదండి. మందుసీసాల్లాగా వుంటేనూ.

చి : మందుసీసాలు గావు మారణం సీసాలు...మీరెందుకు వచ్చారో...రెండు ముక్కల్లో చెప్పండి...

కా : శేఖరంగారితో పనుండి...

చి : ఇక్కడ పని వుంటే నాతోనే వుండాలి. (వత్తి పలుకుతూ) శేఖరం! శేఖరం!! పోనీగదా అని ఊరుకుంటే...ఏమిటో చెప్పరాదూ...?

కా : అది వారితో మాట్లాడాల్సిన విషయం...

చి : ఇక్కడ రహస్యాలు వుంచటానికి వీల్లేదు... రహస్యాలున్నయ్యంటే రక్తం కళ్ల చూస్తాను... ఎవరయినా అంతే...శేఖరం రానీయండి... నాకు తెలియకుండా రహస్యాలుట...ఇంకా మీరేదన్నా తెచ్చారేమో అనుకున్నాను...

కా : ఏదన్నా అంటే మీ ఉద్దేశం...

చి : నా ఉద్దేశం అడుగుతున్నారా...నాతో హాస్యం చెప్పకండి. ఈ మారుమూల వున్న ఈ యింటికి వచ్చిన వారికి అన్నీ సమగ్రంగా తెలియాలి... అన్నీ తెలియకుండా యిక్కడికి వచ్చారంటే బతికి వున్నా దేవుడూ వినడు...నమ్మడు...! (విసుగ్గా) నేను చెప్పేది మీ తలకు ఎక్కుతోందా...?

కా : తొందరపడకండి... నేనన్నీ చెబుతాను... నేను ఒక దుర్భరమైన బాధ ననుభవిస్తున్నవాడిని... నామాట శాంతంగా వినండి.

చి : ఇదేం అనాథశరణాలయం గాదు...మీ అందరి కథలూ వింటానికి...మీరెవరైనా తీసుకువస్తే...ధర ఎంతో ఇంత అని చెప్పండి కావాలంటే యింకో పదిరూపాయలు ఎక్కువ తీసుకోండి...అంతేకాని వగలుపోకండి...

కా : ఆ...? ఏమన్నావు...వగలుపోతున్నానా... మర్యాదగా మాట్లాడండి...మీరు దేనికి ధర కట్టేది...?

చి : (బిగ్గరగా) అప్పలూ...ఈయన్ను బయటకు పంపించెయ్యరా!

కా : నేను శేఖరంగారి కోసం వచ్చాను...నన్నెవరూ బయటకు పంపించలేరు...ఏమిటీ దౌర్జన్యం...?

చి : ఏమిటండీ...పోనీగదా అని ఊరుకుంటుంటే.. "మీకు శేఖరంతో ఏమిటిపని?" అని అడుగుతున్నాను—

కా : నాకు శేఖరంతో పనేమిటని అడుగుతున్నారా? ఇంకెవరితో వుంటుంది నాకు పని...నా కూతురును వెంటబెట్టుకు వచ్చాను...ఆమె కోసం...

చి : ఆహా ... తెచ్చారూ ... ఆ మాట మొదటే చెప్పితే సరిపోయేది గాదుటండీ...ఇంత గడబిడ జరిగేది కాదుగా!

కా : నామాట వింటే...నామీద మీకు సానుభూతి వుంటే...నా కదే చాలు...

చి : సానుభూతికేం...బోచ్చెడు వుంది...అమ్మాయిని శేఖరం కోసమేనా తెచ్చింది...

కా : మీకెల్లా తెలిసింది ... నేను శేఖరంకోసమే తెచ్చాను...అతను అంగీకరిస్తాడా...

చి : భలేవారే....ఎంతడబ్బు...?

కా : డబ్బా...తెచ్చాను...ఎంతకావాలంటే అంత యిస్తాను...

చి : మీరు యిస్తారా ... తమాషాలాడకండి...ఎంత కావాలో చెప్పండి...

కా : నాకు డబ్బుయిస్తారా...ఎందుకు?

చి : అబ్బే ఏమీలేదు ... పట్టణం కొదుటండీ ... మీకు ఇబ్బంది లేకుండా వుంటుంది ... చూసెండి ... ప్రయాణానికని దానికని ఖర్చు అయివుంటుందిగా మీ దగ్గర పైకం...

కా : ఫరవాలేదు ... నాకు ఖర్చు అయిందని దిగులు లేదు...శేఖర్ మా అమ్మాయిని స్వీకరిస్తే అదే పదివేలు నాకు ... అంతకంటే నేనేమీ కోరుకోను...

చి : మీ రంతగా చెప్పాలా ... శేఖరం కళ్లు కద్దుకుంటాడు ... ఒరే అప్పలూ ... రెండు కాఫీ పట్టుకురారా ... మీకు కాఫీ త్రాగటానికి అభ్యంతరం లేదుగా...

కా : నాకేంవద్దు...నన్ను క్షమించి వదిలిపెట్టండి...

చి : అట్లా అంటే ఎలా ... మా ఇంటికి వచ్చిన వాళ్లను గౌరవించటం మాకు మర్యాద ... అంతేగాని...మీకోసం గాదండి ... ఒరేయి అప్పలూ...పిలుస్తుంటే నీకు కాదటరా...

అ : వస్తున్నానయ్యా...అయ్యగారికోసం...

చి : అయ్యగారు ... కొయ్యగారు ... శేఖరం లేవ లేదురా? నువ్వుపోయి రెండు కాఫీ తీసుకునిరా...'ఏ వన్' లాగా వుండాలి.

అ : నేను కలుపులే వంక వుంటుందాండీ—భలే వారే...

కా : శేఖరం యింకా నిద్ర లేవలేదా?

అ : లేవలేదయ్యా...ఇవ్వాళ పది గంట లయ్యేట్టుంది...

చి : నువ్వుపోయి తొందరగా తీసుకురా (అప్పల స్వామి వెళిపోతాడు.) (కామేశ్వరరావు శేఖరంవైపు తిరిగి) ఏమండీ అమ్మాయి ఎక్కడ వుంది...

కా : ఈ ఊర్లోనే వున్నది ... మీరంతా సహాయం చేస్తే...

చి : మనచెయ్యి ఎలాగైనా వుంటుందిలెండి... దానికేం మీరు భయపడనక్కర్లేదు ... ఈ చిదంబరం 'యస్' అన్నాడంటే—'నో' అంటానికి బ్రహ్మదేవుడికికూడా గట్స్ చాలవు...అదీ చిదంబరం అంటే...

కా : మీ పేరు చిదంబరంగారా—

చి : అవునండి...అసలు హడావుడిలో మీ పేరు అడగటమే మర్చిపోయాను...మీ పేరేమిటి అన్నయ్యగారూ...

కా : అన్నయ్య!! ఏమని పిలిచారు? మళ్ళీ ఒకసారి అనండి...

చి : అబ్బే...దానికేం అన్నయ్యగారూ...మనం ఫ్రెండ్స్ అయిపోయాక బ్రదర్స్ క్రింద లెక్క...మీ పేరేమిటో చెప్పారు కాదు...

కా : కామేశ్వరరావు...కోర్టులో గుమాస్తా పనిచేసి రిటైరయ్యాను...

[అప్పలస్వామి ప్రవేశించి కాఫీలు అందిస్తూ]

అ : శేఖరంబాబు వస్తున్నారు...

కా : ఆఁ...వస్తున్నాడా...ఇంకో కాఫీ పట్టుకు వస్తావు అప్పలసామీ...

అ : మా అయ్యగారి సంగతి మీరు చెప్పాలా ఏమండి...

కా : అందుకు కాదు (లేచి నిలబడి ఆదుర్దాగా తిరుగు తుంటాడు)

చి : నువ్వు పోయి రా రా...సీసా ఎక్కడ పెట్టావు...?

అ : ట్రంకులో పెట్టానండి (వెళ్ళిపోతాడు)

చి : వీడు కొలాంతకుడండి...భలే జాగ్రత్త మనిషి లెండి...

కా : (తల ఊపుతూ) పనిమనిషన్న తర్వాత జాగ్రత్తగా వుంటేనే మనకు మనశ్శాంతిగా వుంటుంది...(ఆదుర్దాగా తిరుగుతూ, శేఖ రావి కోసం ఎదురు చూస్తూవుంటాడు)

చి : భేషైన మాట చెప్పారు...ఇంతకీ మీరు ఇల్లు ఎట్లా కనుక్కోగలిగారు...

కా : ఇల్లు...ఇల్లు అంటే కొంత శ్రమఅయిందిలెండి ...ఒక రిక్షావాడి ద్వారా రాగలిగాను...

చి : ఇటువంటి చోట్లు అసలు రిక్షావాళ్ళకే బాగా తెలుస్తాయి...

కా : ఇబ్బంది పడితే ఏం...అనుకున్నచోటికే రాగలిగాను—ఇంతకీ మీ రిక్కడ ఏంచేస్తుంటారో చెప్పారుగాదు...

చి : 'ఏం చేస్తుంటారూ' అని నిలవేసి అడిగితే ఏం చెప్పను...?నా గురించి మీకు ఈపాటికే తెలియాల్సింది...ఈ ఊళ్ళో ఏ పని జరిగినా మన చేతులమీద గుండా జరగాల్సిందే...మనం అంటే అంత గురి...ఈ ఊళ్ళో మనకు తెలియని పెద్దమనిషి లేడు...మనం తెలియని మనిషి అంటూ లేడు...

కా : అంటే...

చి : అంటే ఏంలేదు...సాంఘిక సంక్షేమం గురించి నాకు చేతనయిన సహాయం చేస్తుంటాను...ఎన్నికల్లో నిలబడలేదు గాని....

అ : (ఇంట్లోనుంచి వస్తూ) అప్పుడెప్పుడో నిలబడ్డారు గదండీ...

చి : వరేయి, అన్నీ తెలిసినట్టు మాట్లాడకు...వీడికి మర్యాద అసలు తెలియదండి...మతి ఆసలే లేదు...ఎన్నికల్లో నిలబడ్డానికీ, నిలబెట్టడానికీ తేడా తెలియదు వెధవకి...ఇక్కడ అసెంబ్లీలో చాలామంది నా సపోర్టుతో వచ్చినవాళ్ళేనండి...అందులో మొన్న వకాయన మంత్రిగూడా అయ్యేవాడే...కొంచెంలో పోయింది...అయినా వాడి జాతకం బాగుంటేగదూ...మనం ఎంతవరకని పైకి నెట్టుకుపోతాం చెప్పండి...(అప్పలస్వామి వెళ్ళిపోతాడు)

కా : అవునవును...శేఖరం ఇంకా రాలేదే...

చి : వస్తాడులెండి...

కా : మీరు ఉండటం ఎక్కడో...

చి : ఇక్కడే మద్రాసులోనే...

కా : మద్రాసులో అంటే...ఏ పేటలో అండి...

చి : చెప్పద్దూ...వున్నమాట...వక్కచోట అంటూ లేదండీ...ఎక్కువ కాలం ఇక్కడే గడిచిపోతుంది...శేఖరం నేనంటే పడిచస్తాడు. మా ఇద్దరి స్నేహం అటువంటిది...అందుకని ఇక్కడే ఉంటుంటాను...విడిగా గది అయితే వుందనుకోండి...

కా : గది...అంటే మీరు పెద్ద ఇల్లు ఏదన్నా తీసుకోక పోయారు...పెళ్ళాం...పిల్లలూ...

చి : పెళ్ళాం...అబ్బే అదేం లేవండి...

కా : మీ కింకా పెళ్ళి కాలేదా...

చి : కాలేదా ఏమిటి! చేసుకోలేదా? అని అడగండి.

కా : ఆc...ఆc...నా ఉద్దేశమూ అదే...

చి : పెళ్ళికీ సంఘ సేవకీ లంకె కుదరదండీ...పెళ్ళి అవగానే పిల్లలు...ప్రకృతి నరికట్టలేం గదా! పిల్లలు అవగానే పాల డబ్బాలు, ఆముదం సీసాలు...డాక్టర్ల చుట్టూ తిరగడాలు...ఒక్క మాటలో చెప్పాలంటే నా జీవితం అంతా పిల్లలు, పెళ్ళాంతోనే సరిపోతుంది...అలా అనామకంగా నేను చచ్చిపోలేను...

[శేఖరం ప్రవేశం]

శే : ఏమిటండోయ్! చచ్చిపోలేనంటున్నారు...!

చి : ఒహో...వచ్చావు నాయనా...

శే : (బద్ధకంగా వళ్ళు విరుచుకుని) ఆ...ఆ...వచ్చానుగా (కామేశ్వరరావు వైపు తిరిగి) ఎవరు...?

కా : (ఆవేశంగా దగ్గరకు వస్తూ) శేఖర్...నేనే...కామేశ్వరరావుని...

శే : (ముఖం నల్లబడిపోయి) మీరా....ఎందుకు వచ్చారు...ఇక్కడికి...

చి : మన కోసం వచ్చారు శేఖర్...

శే : నాకు కళ్ళు తిరుగుతున్నాయి (కడుపుపట్టుకుని) అబ్బా నొప్పి...గుండెల్లో మంట...ఎవరు? మీ రెవ్వరు కనబడటం లేదే నాకు!... [నాలుగు వైపులా చూస్తూ అంటాడు.]

అ : ఏమయిందండీ...అరె పడిపోతున్నారేమిటి...

చి : ఇదేమిటి శేఖరం...

శే : (మాట రానట్టు నోరు చూపిస్తాడు)

కా : ఏమయిందండి...

చి : అబ్బే భయపడకండి...ఏం లేదు...కళ్ళు తిరిగి వుంటాయి...

అ : లేచి, నవ్వుతూ కూడా బాగానే వున్నారండి., ఇప్పుడేమయినట్టు...

చి : తొందరగా నువ్వు డాక్టరు దగ్గరకుపోయిరా...నేను చూస్తూవుంటాను...

అ : నాకేమిటో దడగా వుంది...

చి : ఏమిటిరా...

అ : ఒక్కడినీ పోలేనండి...

చి : వీరికి పండా...మన శరభయ్యగారిని పిలుచుకు రావటానికేంరా...టాక్సీ తీసుకుపో...ఊ...

అ : (బయటకు పోబోయి వెనక్కి తిరిగివచ్చి) మీరు కూడా రారాదుటండి...

కా : పోనీ నేను చూస్తూవుంటాను...మీరిద్దరు పోయి రండి. ఇదిగో ఈ పదిరూపాలు తీసుకుపోండి.

చి : రారా అప్పలూ (ఇద్దరూ నిష్క్రమిస్తారు.)

కా : (శేఖరాన్ని బలవంతంగా పడకకుర్చీలో పడుకో బెట్టి గుడ్డపెట్టి విసురుతూ మధ్య మధ్య దేవుడికి దణ్ణాలు పెడుతూ వుంటాడు...శేఖరం రొప్పు తుంటాడు.)

కా : (ఆప్యాయంగా) ఎలా వుంది...కళ్లు తిరిగి నాయా...

శే : ఊఁ

కా : ఏం మాట్లాడొద్దులే ... పడుకో ... గుండెల్లో దడగా వుందా! ... ఎలావుంది? పోనీ మాట్లా డొద్దులే...కొంచెం విసురుతే బాగుంటుందా...

శే : (వద్దులెమ్మన్నట్లు చెయ్యి ఊపుతాడు.)

కా : పోనీలే. నిన్ను కలుసుకోలేక పోతా నేమోనని ఎంతో బెంగపడ్డాను. కాని నా అదృష్టం బాగుంది. నామీద అంతకోపం ఎందుకు శేఖర్.

శే : (కుర్చీలో లేచికూర్చుంటూ) ఎందుకువచ్చినట్టు?

కా : (తిరుగుతూ) ఎందుకు వచ్చానా?...అదేం ప్రశ్న శేఖర్...ఎవరింటికి వచ్చానని? నా కూతురు ఉండాల్సిన చోటికే వచ్చాను.

శే : ఇప్పుడా విషయాలేం ఎత్తకండి...

కా : లలిత నిరపరాధి ... ఆ మాట చెప్పటానికే వచ్చాను. నన్ను శిక్షించు కావాలంటే... నిప్పుల్లో దూకమన్నా తయారుగా వున్నాను. లలిత...లలితమీది మమతతో నే దానితల్లి నన్ను విడిచిపోయింది. "లలిత జాగ్రత్త జాగ్రత్త!" అని చెప్పి మరీపోయింది. ఆమె కళ్ళలో నీళ్ళు నిలిస్తే నా శరీరం అంతా నీరుగా మారి పెద్ద పెట్టున ఏడ్చింది. నేనుకూడా ఆమెతో వెళ్ళ లేకపోయానా? నాకోసం వుంపలేదు శేఖర్ ... లలితకోసం...

శే : ఆ సంగతులన్నీ నాకు తెలుసు.

కా : తెలిసేనా...అవును. దేవుడు నన్ను సమయానికే పంపాడు...నీ ఆరోగ్యం బాగపడనీ...

శే : (లేచి నుంచుని) నాకు బాగానే వుంది,

కా : (ఆశ్చర్యంగా) సర్దుకుందా శేఖర్ బాబూ... నా ప్రార్థన భగవంతుడు ఆలకించాడా?... గుండెల్లో నొప్పి ఎలావుంది నాయనా.

శే : గుండెలకేం...బాగానే వున్నాయి. మీ గొడవే శూలంలాగా గుచ్చుకుంటోంది...మీకూ నాకూ సంబంధం లేదు. మీరు వచ్చినదారి నే వెళ్ళి పోవచ్చు

కా : సంబంధం వుంది గనక నే వచ్చాను...వచ్చిన దారిని వెళ్ళిపోటానికీ...నీకు నీతి బోధించ టానికీ కాదు...

శే : మీరు నీతిబోధించే అవసరంలేదు.

కా : నాకు తెలుసు...నాకోసం అయితే నీగుమ్మం తొక్కేవాడిని కాదు...ఇదంతా నాకోసం కాదు శేఖర్ ... నా కూతురుకోసం...అదీ స్వార్థమే అనుకో...ఆ స్వార్థంలో పాపం లేదు...లలిత ముఖం చూడలేకపోతున్నాను శేఖర్ ...నాగుండెలు తరుక్కుపోతున్నాయి. నిన్నేమీ కోరను...(కన్నీళ్లు తుడుచుకుంటూ) నా కన్నీళ్లల్లో కపటం వుంటుందా? శేఖర్ ... నా ఈ ఒక్క కోరిక తీర్చు...లలితను ఒక్క సారి చూడు...

శే : ఏం అక్కర్లేదు...

కా : (ఆవేశంగా) కావాలి...శేఖర్ కావాలి... లలితకంటి వెంబడికారే ప్రతి కన్నీటిచుక్క నిన్ను వెంటాడుతుంది...ఆపాపం తెచ్చుకోకు... ఆమె నీ ధర్మపత్ని...కనిపెంచిన నేను అగ్ని సాక్షిగా నీకు దానం చేశాను...అందుకు శిక్ష పెడతావా...

శే : మితిమీరుతున్నారు ... మిమ్మల్ని బయటకు పంపించి వెయ్యవలసివుంటుంది...

కా : (బాధగా) ఆఁ నన్ను బయటకు పంపిస్తావా... నే నెవర్ని...నీ బాగుకోరి నీకు వివాహం చేసిన వాడిని...నీభార్య తండ్రిని శేఖర్ ...

శే : నన్ను బెదిరిద్దామని చూస్తున్నారా?

కా : కాదు......బ్రతిమిలాడు తుంటాను......ఇవి చేతులు కావు......ఏం కావాలంటే అది చేస్తాను...ఆజన్మాంతం నీకు బానిసనై నీకాళ్ల దగ్గరపడి వుండమన్నా వుంటాను ... కాని లలితకు అన్యాయం చెయ్యకు...

శే : నా కవన్నీ అక్కర్లేదు...ఈ ఆవేశాలకు కరిగి పోయేవాడిని కాదు...మీకు వయస్సు ఎక్కువ కావచ్చు కాని...అనుభవం నాకు ఎక్కువ... జీవితంలో నేను కోరుకు నేది వేరు...అన వసరంగా నన్ను కలవర పెట్టకండి...

కా : పోనీ పడుకో...విశ్రాంతి తీసుకో డాక్టరు వచ్చేవరకూ...

శే : నాకు బాగానే వుంది...మీతో మాట్లాడవల సింది ఇంకేం లేదు...

కా : ఉంది...చాలా ఉంది...

శే : నా గురించి ఏ విషయం ఎత్తద్దని చెప్పు తున్నాను...

కా : ఇది నీ విషయం కాదు...మా విషయం...నా అల్లుడి సంగతి మాట్లాడటానికి నాకు హక్కు వున్నది...

శే : ఇక్కడ హక్కుల విషయం తేల్చుకోవటానికి వచ్చారా...?

కా : శేఖర్ ... నేనన్న ప్రతిమాటకూ అపార్థం కల్పించటానికి ప్రయత్నించకు. నా అల్లుడు ప్రఖ్యాత రచయితగా యిక్కడ చెలామణీ అవుతున్నాడు. నీ కథలన్నీ చదివాను...నువ్వు ప్రత్యేకంగా మాటలు రాసిన సినిమాకూడా చూశాను... నేను ఒక్కర్తే కాదు...లలిత కూడా చూసింది... లలిత చూసి ఏమన్నదో తెలుసా...

శే : నాకదేం అక్కర్లేదని చెబుతున్నాను...

కా : కావాలి!..."నీ చేతికలంలో అంత కరుణ ఎలా పలికిందా...! మనసును కదిలించివేసే అన్ని వన్ని వేశాలు ఎలా చిత్రితమైనాయా!" అని ఆశ్చర్యపడ్డాను... పావని గురించి నువ్వేకదూ వ్రాసింది...పావని చచ్చిపోతే... సినిమాలో ఏమయిందో బాగా గుర్తురావటంలేదు... ఏమ యినా ఆమె నా మనస్సులో స్థిరభావం ఏర్పరచు కుంది......"అంతా పావనిలాగా తయారు కావాలి. ఎదుటపడి మనస్సువిప్పి మాట్లాడగల గాలి" అనిపించింది...కాని అది సాధ్యంగాదు.

శే : (పళ్ళు కొరుకుతూ) లలిత? లలిత?

కా : లలితకూడా సినిమాలోని పావనిలా మాట్లాడితే నువ్వేం చేసేవాడివి...?

శే : నేనా...ముందు ...... ఆవేశంతో మీదకు వస్తాడు)

[చిదంబరం, అప్పలస్వామి ప్రవేశం]

చి }
అ } : ఎలా వుంది...

శే : ఊఁ...

కా : డాక్టరు గారేమన్నారు?...

శే : (కుర్చీలోకి పడిపోతాడు)

కా : మళ్ళీ ఏమయింది? ఏమండీ చిదంబరం గారూ. ఎప్పుడన్నా యిలా ఫీట్సు వస్తుంటాయా...

చి : లేదండి...

అ : డాక్టరుగారు వస్తున్నారులెండి...

చి : ఎలా వుంది శేఖర్ ...

కా : ఇప్పుడు ఒక్క నిమిషం బాగానే మాట్లాడాడు.

చి : నిజంగా! ఇవేవో ఫిట్సులాగా నే వున్నాయే...

కా : డాక్టరుగారిల్లు ఎంత దూరం అండి...

అ : ఎంత...అర మైలు దూరంలెండి...

చి : ఇప్పుడేగా వెళ్ళివచ్చాం...వస్తాడు లెండి...

కా : పోనీ...నన్ను ఒక్కసారి పోయిరమ్మంటారా?

చి : ఆ ఒడ్డుతో ఎంతసేపు వినుకుతావు...లోపలకు పోయి విసనకర్ర తీసుకురారాదూ... (అప్పల సామి పోతాడు)

[కామేశ్వరరావు బయటకు పోబోతుంటే డాక్టరు ఎదురువస్తాడు.]

చిద : రండి...రండి.

డా : (చేతిగడియారం చూచుకుంటూ) మీరు జరిగిం దేమిటో నాకు రెండు ముక్కల్లో చెప్పండి. కేసు విషయం నేను చూచుకుంటాను.

అ : (నటనచేసి చూపిస్తూ) ఇట్లా గదిలోంచి వస్తు న్నారయ్యా...... నేనేమో ఇక్కడే నిల బడ్డాను...చిదంబరంగారేమో ఇక్కడ కూర్చు న్నారు...ఆయ నేమో......

చి : ఏమిటెరా సోది...ఏమన్నా దయ్యంపట్టిందా ఏం?

డా : దయ్యంపట్టినా ఒక ఇన్‌జక్షను ఇస్తే వదిలిపోతుంది......

అ : అబ్బే వాకేం లేదండి.

కా : ఇలా గదిలోంచి వస్తూ పడిపోయారు.

డా : అయితే ఈ కేసు నన్ను తీసుకోమంటారా ?

అ : అందుకోసమే కాదయ్యా పిలుచుకువచ్చింది.

డా : అయితే విజిటింగుఫీజు మూడు రూపాయిలు.

కా : నేను ఇస్తానులెండి...(డబ్బు ఇస్తాడు).

డా : (స్టెతస్కోపు పెట్టి పరీక్ష చేస్తూ గడియారంవంక చూస్తుంటాడు). నిమిషానికి తొంభైసార్లు... అంటే ఎబ్నార్మల్...నాట్ సీరియస్...... మీకు ఎట్లా వుంది...కళ్ళు తిరుగుతున్నాయా.

శే : అవునండి.

డా : తిరుగుతాయి...తిరుగుతాయి. భయమేం లేదు. మందులు అవీ ఇప్పించమంటారా...

కా : అదేమిటండీ అట్లా అడుగుతారు.

డా : కన్సల్టేషన్ ఫీజు అయిదురూపాయి లవుతుంది మరి.

అ : (ఆశ్చర్యంగా) అయిదు రూపాయిలా !

డా : (కోపంగా) ఇదేమన్నా చింతపండు బేరమను కున్నారేమిటి ?

కా : అబ్బే అది కాదండీ...ఎంత ఇవ్వమన్నారేమిట డిగాను...(డబ్బు తీసిఇస్తూ) దేవుడులాగా వచ్చారు.

డా : నేను వచ్చింతర్వాత ఇంకా దేవుడి గొడవ ఎందుకయ్యా! అంతా బాగయిపోతుంది... మా రూముకు వచ్చి మందు తీసుకుపొండి! దాని డబ్బు అక్కడ ఇవ్వచ్చును...

కా : అట్లాగే...ఇప్పుడే రమ్మంటారా?

డా : (లేచి నుంచుని) రండి ... రండి ... అన్నట్టు టెంపరేచరు చూచారా...

కా : ఇంకా చూడలేదండి.

డా : టెంపరేచరు చూడకుండా డాక్టరు దగరకు ఎందుకు వచ్చినట్లు?

చి : ఇక్కడ థర్మామీటరు లేదండి...

డా : అదే—మన భారతీయులు అందులో మన తెలుగు వాళ్ళ దగ్గరవున్న జబ్బు...ప్రతి ఇంట్లోను ఒక థర్మామీటరు కంపల్సరీగా వుండాలి...

అ : చిత్తం అయ్యా...

డా : చిత్తం ఏమిటి నీ పిండాకూడు...ఒక గ్లాసుడు మంచినీళ్ళు తీసుకురా...

చి : పోరా అట్లా చూస్తావేం?

డా : (థర్మామీటరు శేఖరుచేతి కిస్తాడు.)

చి : ఒరే నీళ్ళు తీసుకురారా అప్పలూ.

అ : వస్తున్నానయ్యా (నీళ్ళు తెస్తాడు.)

డా : (థర్మామీటరు చూచి) టెంపరేచరు ఏమీ లేదే...ఏమిటయ్యా కంగారుపడ్డారు...

కా : మరి ఇదంతా ఏమిటండీ?...

డా : ఒక్కొక్కసారి జ్వరం లోపలవుండి బయటకు రాలేకపోతే ఇటువంటి వికారాలు కలుగుతాయి. ఒక ఇంజక్షను ఇస్తాను. జ్వరం ఏమన్నా వుంటే బయటకు వచ్చేస్తుంది...

కా : అంటే...

డా : అంటే ఏమీ లేదు...ఇంజక్షను ఇవ్వమంటారా.. వద్దంటారా!

చి : అది మేమేం చెప్తాము డాక్టరు. అవసరాన్నిబట్టి మీరే ఇవ్వండి.

డా : నాదేం వుంది ... మీ ఇష్టమైతే యిస్తాను. ఇంజక్షనైతే ముందు పడిపోవటాలు...చేసినం దుకు రెండు రూపాయలు...మొత్తం మూడు రూపాయలవుతుంది...

కా : డబ్బు గురించి మీరేమీ సంశయపడకండి... నే నిచ్చేస్తాను. ఇంజక్షను...ఇవ్వండి.

శే : ఇంజక్షను వద్దులెండి...

డా : ఇంజక్షను వద్దంటారేమిటి ...ఎక్కడో పల్లెటూరివాడిలాగా...దానివల్ల ప్రమాదం లేదండీ.

శే : మందేమన్నా తాగుతాను. కొంచెం తెరిపిగా వుంది.

డా : ఇదివరకెప్పుడన్నా ఇటువంటి ఫిట్సు వచ్చాయా?

చి : అబ్బే లేదండి...ఇదే మొదటిసారి.

డా : ఆహా! అయితే రక్తం పరీక్ష చెయ్యాలి. అసలు డిఫెక్టు ఏమిటో...

కా : అంటే అప్పుడు ఖుస్తీ ఏమిటో...

డా : గదిలో సామానులేమున్నాయో బయటనుంచి చూస్తే తెలుస్తుందా...గదిలోపలకుపోయిచూస్తే తెలుస్తుందా?

అ : లోపలకు పోతే కాని కాదండీ తెలిసేది...

డా : రక్తపరీక్ష అంటే అటువంటిదేనన్నమాట... అసలు సుస్తీ ఏమిటో తెలిస్తే వెంటనే వైద్యం ప్రారంభించవచ్చు...

కా : అయితే పరీక్ష ఎప్పుడు చేస్తారు...

డా : పరీక్ష ఆసుపత్రిలో... ఇప్పుడు కొంచెం రక్తం తీసుకుపోతాను.

కా : రక్తం తీస్తారా?

డా : రక్తం అంటే ఓ చెంబుడు అక్కర్లేదు. బొటన వ్రేలిమీద సూదితో పొడిస్తే కొంచెం రక్తం చిందుతుంది... అది తీసుకుపోతాను. పరీక్ష ఆసుపత్రిలో...

చి : అట్లాగే చెయ్యండి.

డా : 'బ్లడ్ ఎక్జామ్' అంటే అయిదు రూపాయలవుతుంది ఆలోచించుకోండి...

కా : మీరే ఆలోచించాలి. అతనికేమి చేస్తే బాగవుతుందో అది చెయ్యండి... డబ్బు ఎంతైనా ఇబ్బంది లేదు.

డా : మీరంత శ్రద్ధగ వైద్యం చేయిద్దామనుకుంటే యక్స్‌రే కూడ తీయిస్తే మంచిది. పదిహేను రూపాయిలు తీసుకు మా ఆసుపత్రికి రండి... అక్కడ ఫోటో తీయిద్దాం... ఇంతకీ ఇంజక్షను ఇద్దామంటారా? వద్దంటారా?

చి : మీ ఇష్టమని ఇందాక నే చెప్పానుగదండి...

డా : "మీ ఇష్టం...! మీ యిష్టం!!" అనకపోతే ఫీజు సంగతి చెప్పానుగా.

కా : (పది రూపాయిల నోటు తీసి) ఈ పది రూపాయిలు వుంచండి. సుస్తీ నయమైన తర్వాత మనం మాట్లాడుకుందాం.

డా : దటీజ్ గుడ్. వైద్యంమీద శ్రద్ధ అంటే అలా వుండాలి. మందెట్లాగా తీశానుగదా... ఇంజక్షను ఇస్తే సరిపోతుంది. ప్రమాదం లేదని ఇందాక నే చెప్పానుగా. (ఇంజక్షను ఇచ్చేసి) మందు కోసం ఆసుపత్రికి రండి... మళ్లీ ఏదన్నా అవసరం వస్తే కబురు పంపండి. మా డిస్పెన్సరీ పగలూ రాత్రికూడ పనిచేస్తుంది...

చి : అట్లాగేనండి...

డా : అడగటం మర్చిపోయాను... మీకు నిద్రపోవాలని వుందా... రెండు మాత్రలు ఇస్తాను.

కా : రాత్రికూడ నిద్రపోలేదని అన్నారండీ...

డా : చెప్పరేంమరి (సంచిలో చెయ్యిపెట్టి) ఈ రెండు మాత్రలు తీసుకోండి. పెద్ద ఖరీదు కాదులెండి. రెండు పావలాః అర్ధరూపాయి, "నిద్రపోదామని వుంటే ఒకటి తీసుకోండి" మళ్ళీ రాత్రికి ఒకటి తీసుకోవచ్చు.

చి : సంచీ నేను పట్టుకుని వస్తాలెండి...

కా : నమస్కారమండి...

డా : ఆ... నమస్కారమండి... (వెళ్ళిపోతాడు).

కా : ఏం శేఖర్... లోపలకుపోయి విశ్రాంతి తీసుకుంటావా...

శే : ఓహ్... మీరుగూడా వెళ్లకపోయారు వాళ్ళతో బాటు...

కా : నేను వెళ్ళటానికి రాలేదు...

శే : మీకోదణ్ణం పెడతాను... నన్ను కాసేపు విశ్రాంతిగా పడుకోనీయండి.

కా : విశ్రాంతి మానసిక సంక్షోభంలో లభించదు శేఖర్... కడుపుశోకం నీకు తెలియదు... వ్రాయటం వరకే నీకు తెలిసింది... అదిగూడా అనుభవం కాదు... నా హృదయం దహించుకు పోతోంది...

శే : నాకన్నీ తెలుసు... మీపట్టుదలకే నాకాశ్చర్యం కలుగుతోంది... నే నామెను కావాలని పెళ్ళి చేసుకోలేదు....

కా : అబద్ధం... పచ్చి అబద్ధం... పోనీలే శేఖర్... నామాట ఒకటి అర్థం చేసుకుంటావా...

శే : అందరి మాటలూ అర్థం చేసుకోగలను కానీ...

కా : కానీ... కాని... వయస్సు, యౌవనం... శాశ్వతం కావు శేఖర్... పాపపుణ్యాల చర్చ చెయ్యటం లేదు...

శే : మరి ఇదంతా ఏమిటి...

కా : ఇక్కడ నీ జీవితం ఎలా గడుస్తోందో చెబుతున్నాను... చిదంబరం ఇచ్చిన సారాబుడ్లు... నీ ఇంట్లో ట్రంకుపెట్టెలో వున్నాయి... ఎవరికోసం అవి...?

శే : ఏమిటో మీరు చెప్పదలచుకున్నది. నా సొంత వ్యవహారాల్లో జోక్యం కలగచేసుకోకండి...

కా : నా మాటలు చెవికెక్కించుకో దలచుకో లేదన మాట...

శే : నేను చాలా స్పష్టంగా చెబుతున్నాను...నాకు మీతో సంబంధం అక్కర్లేదూ...అని...మీరు వచ్చినదారిన ఎంత త్వరగా వెళ్లిపోతే అంత సంతోషిస్తాను...

కా : అంతేనా ?...అయితే విను...నీ భార్యను నీ దగ్గిర విడిచిపోతాను... (కోపంగా) నువ్వేం చేసుకున్నావురే...(నిదానించి)ఏమన్నాను...? ఏం చేసుకున్నావా...!!! ఏం చెయ్యటానికీ వీలులేదు...లలిత అంటే ఎవరనుకుంటున్నావు ...నా కూతురేగాదు ... నీభార్యకూడాను...

శే : నా మనస్సు కలవర పరచకండి...ఇక్కడ నా జీవితం శాంతియుతంగా జరిగిపోతోంది...

కా : శాంతికాదు శేఖర్ అది...ప్రళయం రావటానికి ముందువుండే నిశ్శబ్దత...అదిరాకుండా కాపాడుకో...

శే : నాకేం అవసరం లేదు...అర్థమైనవాళ్ళ బాధలు పంచుకునే అవసరం లేదు నాకు...

కా : లేకేం...వుంది...నీకే లేక లేక ఒక కూతురు కలిగిందనుకో...ఆమె పేరు...ఏదన్నా సరే... నీముసలితనంలో ఆమె వయసులో వుంటుంది. ఆమెభర్త వ్యభిచారి...జూదరి...త్రాగుబోతు.

శే : ఆఁ...ఏమన్నావు...

కా : నీ కూతురు అనాథ...భర్తవిడిచినది అయి... బజార్లవెంబడి తిరుగుతుంటే...

శే : తలబద్దలుచేస్తాను...

కా : ఎవరది...?నీకున్న పేరు ప్రఖ్యాతులు...ధనం స్నేహితులు....ఒక్కరు ....ఆదుకోరు...... నికృష్టమైన బ్రతుకు అది శేఖర్ ...

శే : అధిక ప్రసంగం ఆపుచేస్తారా లేదా...

కా : అధిక ప్రసంగం కాదు...నువ్వు వెళ్లి నీ అల్లుడిని బ్రతిమాలుకుంటావు...కూతురు కాపురం నిలపెట్టమని కాళ్లా వేళ్లాపడతావు......అతను ఆవేశపడతాడు...

శే : అలాఎప్పటికీ జరగదు...యూగెటవుట్ ...

కా : అలాగే జరుగుతుంది...అదనే పడుతుంది...

శే : ఆఁ...(చెంపమీద కొడతాడు)

కా : (దెబ్బతిని)....ఆ.......అతను నీ చెంపమీద కొడతాడు శేఖర్ ... అప్పుడు తెలుస్తుంది నేననుభవిస్తున్న నరకం...

శే : (బిగ్గరగా అరుస్తూ) పొండి...నా కళ్లకు కనపడకుండా పొండి...

కా : పోతాను శేఖర్ ...కాని...నువ్వు పశ్చాత్తాపం పొందిన రోజు ... నాక్షమాపణ కోరుకుందామనుకున్నా నేనుండకపోవచ్చు... నేనూ పెద్దవాణ్ణయిపోయాను...చేతులు కాలేటంతవరకు రానీయకు...

శే : (కోపంగా)మిమ్మల్నేంచేసినా పాపంలేదు... సత్యంగా నడుస్తున్న నాజీవితంలో తుఫాను లేవదీశారు (కొంచెం ఆగి) ఆ...ఏమన్నారు నా కూతురు అవమానం పొందుతుందా ...ఏమన్నావ్...(కామేశ్వరరావు గొంతు పట్టుకుంటాడు)

కా : నేనా మాట అనలేదు ... ఆలోచించుకోమన్నాను...శేఖర్ ... ఆచేతులతో గొంతుపిసికినా నేను బాధపడను...(రుద్ధకంఠంతో) కాని, లలితకుమాత్రంఅన్యాయం చెయ్యకు శేఖర్ ... ఆమె నీ భార్య...

శే : భార్య...? మీరంతా దొంగలు మాటలగారడీ అంతా...

కా : దీంట్లో గారడీ ఏముంది ... అనాకారి కావటం ఆమె దోషమా...ఆవిడ చదువుకుంది... భారత స్త్రీ బ్రతుకు భర్త ఛాయల్లోనే అనుకుంటుంది...నీ నీడలో ఆమె బ్రతుకు దామనుకుంటుంది...

శే : (పళ్ళు కొరుకుతూ) భారత స్త్రీ...

కా : నువ్వే లలితవైతే ఏం చేసేవాడివి...ఆమె ఒక్క కన్నీటిబొట్టుతో ... నీ సాంగత్యం, ఖ్యాతి, ధనం అన్నీ కలిసి తూగవు...ఆ అప్పల స్వామి ఎవరు...నిజం చెప్పు...

శే : అతని సంగతెందుకు...అతను నా నౌకరు...

కా : నౌకరుకాదు......నీ గర్భ శత్రువు......నీ యింట్లో వుండి నీ యింటి వాసాలు లెక్కపెడుతున్నాడు...ఆ చిదంబరం ఎవరు... సంఘసంక్షేమం పేరుతో, పడుపుకత్తెలతో తిరిగే సంఘద్రోహి...తుచ్ఛుడు...సంఘద్రోహానికి శిక్ష ఏమిటో తెలుసా...?

శే : వాళ్లందరి సంగతి మీ కక్కర్లేదు—

కా : నీ సంగతి చూసుకో చాలు...

శే : నేనా...నన్ను కూడా అంటున్నారా... అవును...నామనస్సు వికలం చేశారు మీరు.

కా : దానికి నీదే బాధ్యత... నే నన్నదల్లా నీ బ్రతుకు విలువ చూచుకోమన్నాను...నీతో చెడుగా తిరిగే స్త్రీలంతా కూడా...నీతల్లి, చెల్లెలు, భార్యలాంటి స్త్రీలే అనుకోమన్నాను...

శే : అమ్మా! (పెద్దపెట్టున అరుస్తాడు)మీరు ముందర బయటకు వెళ్లిపొండి...ఆలోచించుకో నీయండి. మీరు వెళ్లిపోతారా లేదా (బయటకు తోసేస్తాడు)...

కా : వెళ్ళిపోయేముందు ఒక్కమాట...వచ్చేటప్పుడు లలితను తీసుకు వచ్చాను...మొదలియారు సత్రంలో ఒక గది తీసుకుని ఉన్నాం...బాగా ఆలోచించుకో...ధర్మం ఎటో అటు ఒగు...

శే : మీరు నాకు చెప్పక్కర్లేదు...ముందర బయటకు వెళ్లండి...(అని ఇంట్లోకి పోబోతాడు)

కా : (వెళ్లిపోతూ) పోతున్నాను...లలిత ఇక్కడే వుంది...అదిమాత్రం గుర్తుపెట్టుకో...

[వెళ్లిపోతాడు]

శే : (వెనక్కు తిరిగి ఆశ్చర్యపడుతూ) వెళ్ళిపోయావే (బిగ్గరగా) కామేశ్వరరావుగారూ! (బయటకుపోయి చూస్తాడు. కంగారుగా లోపలకు పోతాడు)

[బయటనుంచి అప్పలస్వామీ, చిదంబరం వస్తారు]

చి : ఏళ్ళేరిరా...అప్పలూ...

అ : నన్నడుగుతారేమండీ...మీతోనే గదండి వస్తా (లోపలకు పోతాడు) (మళ్ళా వెంటనే పరుగెత్తుకుంటూ వచ్చి)...శేఖర్ బాబు...

చి : ఏమయిందిరా...

అ : ఏడుస్తున్నారండి...

చి : (తాపీగా) నువ్వుకూడా కూర్చుని ఏడవలేక పోయినావు...అయినా ఏడవడ మేమిటిరా...

అ : నాకేం తెలుస్తుందండి...

చి : ఓరి నీదుంపతెగ...డాక్టరుకుకూడా మతిపోయిం దేమిటి...నిద్రపట్టటానికి మందిచ్చావన్నాడు గాని...ఏడవటానికి మందిచ్చావని చెప్పలేదే. ఏడుపుగొట్టుమందూ వాడూను......ఒరేయి అప్పలూ!...

అ : అయ్యా...

చి : ఆ ట్రంకులోంచి ఒక సీసా తీసుకునిరారా...

[అప్పలస్వామి లోపలకుపోయి ఒకసీసా తీసుకుని వస్తాడు]

చి : గ్లాసు తీసుకురావాలని మళ్ళీ చెప్పాలిరా నేను... సరే కానీలే...ఏం చేస్తాం ఖర్మ (సీసా ఎత్తుకుని తాగేస్తాడు) హు...ప్రాణం కొంచెం తెరిపిన పడింది. (లేస్తూ) ఇప్పుడు పిలుచుకు రారా శేఖరాన్ని...ఏడుపేమిటో వదిలించి వేస్తాను......

అ : (లోపలకు పోయి వచ్చి) "రానుపోరా...... వినవా...గెట్ అవుట్" అంటున్నారండి.

చి : గెట్ అవుట్ అన్నది ఎవరినిరా...

అ : మన నేనండి...

చి : ఓరి నిన్ను తగలెయ్య ... మనం ఏమిటిరా ... గౌరవవాచకం...గ్రామరు కూడా తగలేశావు..

అ : అయిదో క్లాసు దాకా చదివాను గదండి......

చి : అదికాస్తా నామీద ఉపయోగిస్తున్నావ్... (కొంచెం విసుగుతో) అరేయి. శేఖరాన్ని పోయి పిలుచుకు రారా...కొంచెం మాట్లాడాలి... పోరా అంటే అట్లా చూస్తావ్...

అ : పోతున్నాగా... ఎట్లా చూస్తున్నానండి......

చి : దయ్యం......

అ : (భయంతో కేక వేస్తూ) అమ్మో......

చి : (కంగారుగా) ఏమిటిరా అది...

అ : (వణికిపోతూ) దయ్యం అండి.

చి : ఎక్కడరా అది (అమాంతం వచ్చి అప్పలస్వామిని కౌగలించుకుంటాడు.

అ : మీరే గదండి అంట......

చి : (పెద్దపెట్టున నవ్వుతాడు) నీ సంగతేరా అంది.. పోయి అయ్యగారిని అర్జంటుగా పిలుచుకు రాపోయి...మళ్ళా మీటింగుకు పోవాలి... ఇవాళేమన్నా తిండి తిప్పలూ ఉన్నాయా? లేదా?

అ : ఆరేమో ... రావంటున్నారు గదండీ...(అంటుండగానే శేఖరం వస్తాడు)

చి : హల్లో గుడ్ మార్నింగ్ ...ఎలా వుంది శేఖర్ ...

శే : ఏమిటి...దన్నిగురించి నువ్వడుగుతోంది...

చి : నీ ఇంట్లో సంగతే... హఠాత్తుగా పడిపోతే స్టంటేమో అనుకున్నా...ఫిట్స్ ఒక్కసారి ఎందుకు వచ్చినాయి బ్రదర్...

శే : నాకు ఫిట్సురాలేదు...

అ : మరి ఇందాక పడిపోయారుగదండి...

శే : నువ్వు మాట్లాడకు...(స్థైర్యంగా) నేను కావాలనే పడిపోయాను...

చి : (చెయ్యి చూపించి) ఇవెన్ని వేళ్ళు బ్రదర్ ...

శే : మన సంగతి మనకు తెలియకనే ఇలా అవస్థ పడుతున్నాం ... చేతికెన్ని వేళ్ళున్నాయో లెక్క పెట్టలేవచ్చు...నీవంట్లో బొమికలెన్ని వున్నాయో తెలుసుకోవాలి...అదీ ఆత్మపరిశీలన అంటే...

చి : మళ్ళీ కొత్త కథేమన్నా వ్రాస్తున్నావా నాయనా...

శే : సరికొత్త కథ...ఆత్మకథ వ్రాసుకుంటున్నాను

చి : అందులో నా పేరుకూడా వుంటుందా...

అ : సినిమా తీస్తున్నారాండి...? ఈసారన్నా నాకు వేషం ఇప్పించాలండి...

శే : వరేయి అప్పలూ...అతిగా వాగక...

అ : ఏమిటిసార్ ...అంతకోపం...

శే : లేకపోతే ఏమిటి... నేనొక్కమాట అడిగనా...

అ : వక్కటేమిటండీ...

చి : పది అడిగినా చెబుతాడు...

అ : అదే నేనూ అందామనుకున్నానండి...

శే : (గదమాయిస్తూ) సో...సరిగ్గా విను...నీకెంతమంది పెళ్లాలున్నారురా...

అ : అదేమిటండీ అయ్యగారూ ... నాకు పెళ్ళే కాలేదుగదండి...

చి : భలే ప్రశ్న ... ఘోరమైన సమాధానం ... వరేయి నా ప్రశ్నకు సమాధానం చెప్పరా ... పెళ్లాం అంటే ఏమిటిరా...

అ : ఊరుకోండి...మరీను...(సిగ్గుపడతాడు)

శే : నవ్వులాటకోసం అడగటం లేదు ... ఊళ్ళో నీకు తెలిసిన ఆడవాళ్ళు ఎంతమంది అని అడుగుతున్నాను...

అ : నాకీవూళ్లో తెలియనివాళ్లెవరండి...

శే : (గద్దిస్తూ) నీతో సంబంధం ఎంతమందికివుందీ అని అడుగుతున్నాను...

చి : ఇదేమిటి శేఖర్ ... వింతగా మాట్లాడుతున్నావ్ ... తేలికగా వుందా?

శే : తేలికగానే వుంది...

చి : ఇంకేం డ్రస్సు చేసుకునిరా...ఇంకా మీటింగుకు పోయే యోగం లేదేమో అనుకున్నాను ... మన పేర్లు రెండు వేసుకుని మీటింగుకి ప్రచారం చేసుకుంటున్నారు వాళ్ళు...ఇంకా భయం వేసింది నీ సుస్తీ చూచేటప్పటికి...

శే : నేను మీటింగుకి రావటంలేదు...

చి : రాకపోతే పీడాపాయెను ... ముందర డ్రస్సు చేసుకునిరా...

శే : నవ్వులాటకి సమయంకాదిది...

చి : నాదేంపోయిందిలే ... ఇప్పుడు కారువేసుకుని వస్తారు ... వాలంటీర్లు బలవంతాన తీసుకుపోతారు...

శే : బ్రహ్మతీరంగూడాగాదు...అప్పలూ ... నిజం చెప్పు....నీకు పెళ్ళయిందా...లేదా...

చి : కాలేదని చెబుతున్నాడుగా ... ఇప్పుడెందుకు వచ్చింది ఆ పితలాటం అంతా...

శే : (అప్పలస్వామి భుజం పట్టుకుని) చెప్పు ... ప్రాణం తీసేస్తాను.

అ : అయింది...అయినా మీకెందుకండి మా యింటి గొడవలు...

శే : ఆ అమ్మాయి ఎక్కడవుంది...

అ : ఇంటిదగ్గరేవుందండి...ఇంకెక్కడికిపోతుంది...

శే : నీతో బాటు తిరిగే ఆడవాళ్ళమాదిరిగానే... నీ పెళ్లాంకూడా ఇక్కడికి వచ్చి తిరుగుతుంటే ఏంచేస్తావు...

అ : ఇక్కడకువచ్చి తిరుగుతుంటేనా ... డొక్క చీల్చి డోలుకట్టనుటండి... అప్పలుసంగతి తెలీనట్లు అడుగుతారు...

శే : నీ సంగతి అంతా తెలియదు...ఇప్పుడిప్పుడే తెలుస్తోంది.

చి : ఏమిటి శేఖర్ ఈ వింత ధోరణి...అరేయి అప్పలస్వామి...వీధి తలుపు వేసి వుందేమో చూసిరా...

అ : (బయటకు పోయివచ్చి) వేసివచ్చానండి...

చి : ట్రంకులోనుంచి ఇంకో సీసాతీసుకునిరారా... వచ్చేటప్పుడు వక గ్లాసుకూడా పట్టుకునిరా...

అ : అట్లాగేనయ్యా ..

శే : (అప్పలసామి చెయ్యి పట్టుకుని గుంజుతూ) పిలుస్తుంటే పోతావేంరా...

అ : ఇద్దరూ దొరలే నాకు...ఎవరిమాట వినమంటారండి...

చి : నువ్వుపోయి తీసుకురారా అంటే.

శే : వద్దు...

చి : కావాలని చెబుతుంటే...

శే : (చిదంబరాన్ని కోపంగా చూసేసి) ఈ రోజు నుంచి సీసాలు నాకంట పడ్డాయంటే...వాటిని తెచ్చినవాళ్ళ రక్తం కళ్ళ చూస్తాను...

చి : మళ్ళీ ఫిట్టువచ్చినట్లుందే......ఇదేదో ఊరికే రాలేదు...

శే : నాకు ఫిట్టు రాలేదు...ఉన్న మైకం వదిలిపోతోంది...

చి : అదీ మంచిదేలే... ఇంతకీ ఇవాళ మీటింగుకు విషయం ఏమిటో గుర్తుందా నాయనా...

శే : దాని సంగతి తర్వాత ఆలోచిద్దాం...

చి : తర్వాత చూద్దాం! కాసేపాగితే వాళ్ళే వస్తారు.. (కరపత్రం తీసి చదువుతూ) 'పతిత స్త్రీజనోద్ధరణ...పౌరుని బాధ్యతలు...' నాకయితే బాధ లేదులే......అధ్యక్షుణ్ణి కాబట్టి ఏవో రెండు ముక్కలు చెప్పి వూరుకుంటాను...సినీ రచయితగా నువ్వు చెప్పవలసిందే చాలా వుంటుంది...

శే : నేనీ మీటింగుకి రాను...రాను అని చెప్పాను. కావాలంటే మీరు వెళ్లండి.

[బయట తలుపు చప్పుడవుతుంది]

చి : ఈ గ్లాసులోపల పెట్టరా అప్పలూ...ఈ సీసా గూడా (కంగారు పడుతూ) అరేయి అప్పలూ...త్వరగా లేవిరా...సరే నేనే తెచ్చుకుంటానులే...

శే : ఎందుకంత కంగారు.

చి : అబ్బే ఏం లేదు. ఇప్పుడే ముఖం కడుక్కొని వస్తాను.

అ : (సీసాలు, గ్లాసు లోపల పెట్టేవచ్చి) ఎవరండీ అది...(బయటకు పోయి పోలీసుతో వస్తాడు)

[పోలీసు ప్రవేశం]

పో : శేఖరం గారంటే ఎవరు?

అ : వీరేనండి...

: మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను... అప్పల సామి ఎవరు?

అ : (వణికిపోతూ) నన్ను గూడా...

శే : ఏమిటి హడావుడి...

చి : (తలవంచుకుని లోపలనుంచి వస్తూ) మీటింగుకు పిలవటానికి వచ్చారా... (పోలీసును చూచి అదిరిపడి) గుడ్ మార్నింగండీ...ఏమి టిలా వచ్చారు...

పో : అలా కంగారు పడిపోతున్నా రెందుకు...

చి : అబ్బే...ఏంలేదు...

పో : మీ ఇల్లు సోదా చెయ్యాలి...

చి : ఎవరైనా దొంగ వచ్చాడేమిటి ఇటువైపు...

పో : కాదు...దొంగ సారా రవాణా అయింది... అందుకని...

చి : మా యింట్లోకా ... ఇందాకట్నుంచీ మేం ఇక్కడే వున్నామే...

పో : అల్లాగయితే మీకు తప్పకుండా తెలిసే వుండాలి...

చి : మాకు తెలియదు...మరీ బాగుంది...

పో : నిజం చెప్పండి...లేదా నేనె సోదా చెయ్యాల్సుంటుంది...

[లోపలకు పోబోతాడు]

చి : ఏమిటి దౌర్జన్యం...ఇంట్లోకి చొరబడతారు...

పో : విధి నిర్వర్తించటం కోసం నేను వెళ్ళటం తప్పేమీ కాదు...మీరు నిజం చెప్పండి...నా శ్రమ తగ్గించిన వారవుతారు...

శే : ఏమి టిదంతా...

పో : విషయ సేకరణ అంతా అయింది...అయిదు సారా సీసాలు ఈ యింటిలోకి ఉదయమే చేరినట్టు తెలిసింది...

చి : చూడండీ పోలీసుగారూ...దాన్లోని నిజానిజాలు మాకయితే తెలియవు...ఇప్పుడు మేం అర్జంటుగా మీటింగుకు పోవాలి...మధ్యాహ్నం వచ్చి సోదా చేసుకుందురు గానీ...

శే : పాపానికి శిక్ష అనుభవించటం తప్పగాదు...ఇప్పుడే సోదా చేసుకోండి...

చి : వీల్లేదు పోలీసుగారూ...మీతో ఒకరహస్యం మాట్లాడాలి...(రహస్యంగా చెవిలో ఏదో చెప్పి ఒకరూపాయి చేతిలో పెట్టబోతాడు)

పో : ఏమిటా ఆటలు ... లంచాలు తినేవాడి ననుకున్నారా ... వెధవ రూపాయకోసంపడి నేను వచ్చినపని మానుకోలేను...

అ : పోనీ యింకో రూపాయి యివ్వండి...

పో : ఈ ధోరణిచూస్తే యితనే సారా చేర వేసినట్లున్నాడు...మీరు పోలీసుస్టేషనుకువచ్చి చెప్పుకోండి ... నాకేం తెలియదు ... మొదలియారు సత్రందగ్గిర మీ వాళ్లెవరయినా వున్నారా...

శే : అవునండి...ఏమయింది—

పో : అప్పలస్వామి అంటే ఎవరు?

అ : నేనేనండి...

పో : ఆ సత్రంలోవున్న కామేశ్వర్రావుగారట... ఒకసారి రమ్మనమని చెప్పారు—

శే : ఏమయింది...

పో : నాకేం తెలుసునయ్యా...నన్ను పోదా చెయ్యి విడవండి...

చి : (బతిమాలుకుంటూ) మా పరువు మంటగలపకండి పోలీసుగారూ...

శే : ఇదిగో అప్పలూ...నువ్వు త్వరగా అక్కడికి పోయిరా...

అ : అల్లాగేనండి (అంటూ వెళ్లిపోతాడు)

పో : నన్ను వెదకనివ్వండి...

చి : మీకు ఏంకావాలంటే అది యిస్తాను...మాకు అమర్యాదగా వుంటుంది ... ఈసారికి వదిలి వెయ్యండి—

పో : యిందాక...పెద్ద బిచ్చం వేసినట్టు రూపాయి యివ్వచ్చారే...

చి : పోనీలెండి ... ఏదో అయిపోయిందిగా ... (పది రూపాయలనోటు యిస్తాడు.)

పో : మళ్లీ నామీదకు వస్తుంది ... ఇంట్లోవున్న బుడ్లన్నీ ఎక్కడున్నా పారవేయించండి... మీరింతగా బతిమాలుతున్నారనిగానీ ... వ్యాపారానికి ఈ కేసు పది రూపాయలతో వదలాల్సిందికాదు...(నోటు జేబులో పెట్టుకుంటాడు.)

చి : కూర్చోండి...ఇప్పుడే వస్తా-(లోపలకుపోయి విస్కీసీసా తెచ్చి కొంచెం గ్లాసులో పోసి యిస్తాడు).

పో : నేను తాగటమేమిటి—నో...నో......చాలా తప్పు-(చిదంబరం బలవంతంచేస్తూ యిస్తాడు... పోలీసు తాగుతాడు) ఏవీ రెండు లవంగాలు యాలక్కాయలు ఇలా పడేయండి...పాడు వాసనండి...ఎలా తాగుతారో గానీ ...వస్తా మరి ..జగమే మాయా...

(బయటికి...(వెళ్ళిపోతాడు)

చి : హమ్మయ్య...పీడ పీను వదిలిపోయింది...... ఇంత త్వరగా వదిలిపోతుం దనుకోలేదు...మర్చిపోయాను. శేఖర్ ...మన స్పీచ్ సంగతి ఏం చేశాను...మాటల మధ్యలో పోయింది...

శే : (ఆవేశంగా) చిదంబరంగారూ—నా కడుపులో ఏదో మంటగా బయలుదేరుతోంది...

చి : ఇందాక ఆ డాక్టరు ఏదో ఇంజక్షను యిచ్చాడుగా......అదేమన్నా రియాక్షను ఇస్తోందేమో...!

శే : ఉన్న పరిస్థితుల్లో ఊరుకున్నాగానీ...ఇందాక నాకు పోలీసుతో వెళ్లిపోవాలనిపించింది... పాపానికి శిక్ష అనుభవిస్తేనేగాని నివృత్తిలేదు చిదంబరంగారూ...

చి : ఏమిటసలు వింతగా మాట్లాడుతున్నావు... మీటింగుకు రాకపోతే పీడ పోయెగానీ... నువ్వు కొత్తగా రాస్తున్న సినిమాలో హీరోయిను దొరికిందా...

శే : నాకు ఇంక సినిమాల్లో పాల్గొందామని లేదు... నాకు ఆనందమో దుఃఖమో తెలియటంలేదు... కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి...

చి : దానికేంగానీ...నాకు ఒక ఆలోచనగా వుంది. ఇందాక ఆయన వచ్చాడు చూశావు...ప్రొద్దున రాలేదుటయ్యా...ఆయన ఎవరో అమ్మాయిని తీసుకువచ్చాడుట...

శే : ఔను...నాకూ తెలిసింది...అప్పటినుంచే నా మనస్సూ మారింది...హృదయం వికసించింది...

చి : అవన్నీ మంచి లక్షణాలే...జబ్బు లక్షణాలేంగావుగా...

శే : ఆమె నాకు ఆశాజ్యోతిలా కనబడుతోంది చిదంబరంగారూ...

చి : అందుకనే నేనేది...ఆ అమ్మాయికి ఏదన్నా సినిమాలో సైడురోలు యిప్పించామంటే... ఆ అమ్మాయి కోరిక తీరుతుంది...మనకూ ఉపయోగిస్తుంది...

శే : మనకు ఉపయోగిస్తుంది!? అంటే ఏమిటి నీ ఉద్దేశం...

చి : బండగా చెబితేగాని వరిపోదా ఏమిటి? మగ వాళ్ళకు ఆడవాళ్లు ఎందుకు ఉపయోగిస్తారు...

శే : ఏమన్నావ్ ... (చిదంబరం గొంతు పట్టుకుంటాడు.)

చి : అదేమిటి...

శే : ఆమె ఎవరో తెలుసా...

చి : పొద్దున వచ్చినాయన కూతురని చెబుతున్నాను కాదటయ్యా.

శే : ఆమె ఆయన కూతురే గాదు...నా భార్య కూడాను.

చి : ఆ!!!

శే : ఛీ...మిమ్మల్నించేసినా పాపంలేదు (చక్క విదిలింపు విదిలిస్తాడు) నిలువునా కాల్చి వేసే వాడిని...

చి : నాకు చెప్పలేదే ఆయన...

శే : చెప్పాలా...సంస్కృతీపరుల మనుకున్న మన బుద్ధి ఎప్పుడూ పెడమార్గమే తొక్కుతోంది... మనం చేసే ఛండాలపు పనుల నన్నిటినీ కప్పిపుచ్చుకోవటానికి మనకు తెలివితేటలు, నోరు వున్నాయి...

చి : క్షమించు శేఖర్ ...మీ బంధుత్వం నాకు తెలియదు.

శే : మనఃప్రవృత్తి మారాలి చిదంబరం గారూ...నా భార్య అయిందని గాదు...ఏ స్త్రీ అయినా సరే. స్త్రీ అంటే వట్టి ఆడది గాదు చిదంబరం గారూ నాకు కనువిప్పు కలిగింది. స్త్రీ అంటే మాతృ స్వరూపంగా, చెల్లెలుగా, అక్కగా కనబడుతోంది ... నా జీవితంలో ... దృక్పథంలో మార్పు వచ్చింది...

చి : నువ్వయితే మీటెంటుకు రావన్న మాటేగా...

శా : ఇంక ఎన్నడూ రాను...కళ అంటే కథలు రాయటం, ఉపన్యాసా లివ్వటం కాదని పిస్తోంది...బ్రతకటం కూడా కళకళే...దానికీ సూత్రాలూ నియమాలు ఉన్నాయి... జీవితాన్ని వ్యర్థంగా, అపసవ్యంగా గడుపుతున్న తర్వాత అతని కళలన్నీ వ్యర్థాలు... తుచ్ఛాలు...తుక్క అరుపులు.

చి : అయిందా ఉపన్యాసం...

శా : ఇది ఉపన్యాసం కాదు...నాకడుపు దహించుకు పోతోంది—పడుపు కత్తెలంటె ఏమిటో తెలుస్తోంది...మీకే సుండేలుంటే...మీతో తిరిగే ఏ పడుపు కత్తెనయినా వివాహం చేసుకోండి అనాడే మనం మిత్రులం...అప్పటిదాకా మన మిద్దరం బద్ధశత్రువుల మన్నమాట...ఇంక మీరు వెళ్ళిపోవచ్చు...ఆ సీసాలు పట్టుకుపోండి... మీరు సంఘంచేత పూజింప బడుతున్నారు... మిమ్మల్ని దూషణగా మాట్లాడినందుకు క్షమించండి...

చి : నిన్ను క్షమించ మంటావా శేఖర్ ... నీబాధ అర్థమయింది...కాని దాన్ని నేనింకా జీర్ణించుకోలేక పోతున్నాను...నా మనస్సుకూడా నీ మనస్సులాగా పరిపక్వమయిననాడు... నువ్వు చెప్పినట్లు...సతీ సమేతంగా వస్తాను... అంతదాకా సెలవు...

[వెళ్ళిపోతూవుంటే పోలీసు ఎదురై]

పో : నమస్కారమండి...

చి : మళ్ళీ ఎందుకు వచ్చావు...

పో : మా సబిన్స్పెక్టరు గారు పంపించారండి—

చి : ఏమిటో తొందరగా చెప్పు...వెళ్ళిపోవాలి...

పో : ఆయనదగ్గర బొత్తిగా కేసు ల్లేవుటండీ... ఆయన వుద్యోగం కూడా గొడవల్లో వుందండి...

చి : ఆ సోదంతా ఎందుకు కిప్పుడు...

పో : అది కాదండి...ఏదన్నా కేసు పట్టుకుంటే ఇరవై రూపాయలిస్తా నంటున్నారండి.

చి : స్కౌండ్రెల్ ...నన్నే ఇంకో పది రూపాయ లివ్వమని అడుగరాదూ......ఎందుకా దొంగ మాటలు...

పో : మీరట్లా కోప్పడితే పేదవాళ్ళం బ్రతికే దట్లాగండి...

చి : ఇందాక యిచ్చిన పది రూపాయ లిటెయ్యి... చెబుతాను—

పో : ఎందుకండీ అంత కోపం...

చి : నేను నీకేం యివ్వదలచుకోలేదు...పోలీసు స్టేషన్కు రావటానికి సిద్ధంగా వున్నాను... పద...

శే : అదేమిటండీ చిదంబరం గారూ—మీరు మీటింగుకు పోరా రేం?...

చి : మీటింగుకు కాదు...పోలీసు స్టేషన్‌కు పోతాను...అట్లా చూస్తావేమిటయ్యా...ఆ సారా సీసాలు పట్టుకుని పద...పోలీసుస్టేషన్‌కి...

పో : అట్లా మాట్లాడితే ఎలాగండి...ఇంకో అయిదు రూపాయలు ఇప్పించండి పోతాను...

చి : నీకు దమ్మిడీకూడా ఇయ్యను...

శే : పోనీయండి చిదంబరం గారూ ... (అయిదు రూపాయలు తీసియిస్తాడు) ఈ సారాసీసాలు కూడా తీసుకుపో...రోడ్డుమీద దొరికాయని చెప్పు—

పో : వస్తానండి...

[అప్పలస్వామి, కామేశ్వర్రావుల ప్రవేశం]

అయ్యా వస్తాలండి...(పోలీసు వెళ్ళిపోతాడు).

కా : ఇదిగో అప్పలూ...

అ : అయ్యా...

చి : మీ అమ్మాయిగారు ఎక్కడున్నారండి...

కా : సత్రంలోనే వున్నారు...క్షమించు శేఖర్ ... ఆహ్వానం లేకుండానే మీ యింటికివచ్చాను... మళ్లీ నీ మనస్సులో గందరగోళం కలిగించానను కుంటాను...

చి : అయిపోయిందేదో అయిపోయిందిలెండి. ఆ అమ్మాయి సత్రంలో వక్కతేవున్నదికాబోలు.

కా : ఫరవాలేదు. నే వెళ్ళిపోతాను. శేఖర్ ...లలిత ముఖం చూడలేక నీ దగ్గరకు వచ్చాను ప్రతి ఫలం అనుభవించాను. నువ్వుకొట్టినదెబ్బ జ్ఞాపకం వుంచుకోవటానికి ప్రయత్నిస్తాను వక్కమాట అప్పలస్వామికి చెప్పి పంపిద్దామని పిలిస్తే, అతనే నన్ను బలవంతంగా తీసుకువచ్చాడు.

అ : (నవ్వుతూ) అమ్మ అంటున్నారండి.

శే : ఏమిటి?

కా : నేనే చెబుతాను. దాంట్లో సిగ్గుపడవలసిన పని లేదు. లలిత స్వతంత్ర జీవితం గడుపుదామను కుంటోంది. ఆమె ఒక నిశ్చయానికి వచ్చింది ఇక నీనుంచి నేం కోరదిమీ లేదు.

శే : ఆఁ...ఏమన్నారు!

చి : అదెట్లా వీలవుతుంది?

కా : వీలు కాక ఏం ... అందరికీ ఆత్మాభిమానా లుంటాయి...ఇక్కడకు తీసుకువచ్చిం తర్వాత గానీ, లలిత ఒక నిర్ణయానికి రాలేకపోయింది.. మొదటినుంచీ ఆమె సౌఖ్యమే నేను కోరింది. నీ సాంగత్యంకోసం గాదు ఇక్కడకు వచ్చింది.

శే : (ఒక్కసారిగా కాళ్ళమీదపడి) మామయ్యా!... నన్ను క్షమించు...నన్ను క్షమించుమామయ్యా!..

కా : పిచ్చివాడా ... ఇందులో నేను క్షమించే దేముంది...

శే : అలా కాదు...నువ్వు క్షమించానన్నంటే... నేను లేవను...ఇక్కడే తల పగులగొట్టుకుని చచ్చి పోతాను...

[తల గట్టిగా బాదుకుంటాడు.]

కా : క్షమించటానికి మనమూ కర్తలం ... అందరి తప్పులు క్షమించేవాడు ఆ భగవంతుడే వున్నాడు...లలిత వప్పుకుంటే నాదేం వుంది నాయనా...లలితకోసమేగదా నా తాపత్రయం అంతా...లే...నాయనా...లే...

శే : (కామేశ్వర్రావును కావలించుకుని) నువ్వు చెబితే లలిత తప్పకుండా వింటుంది మామయ్యా...చిదంబరం గారూ మీరు గూడా వచ్చి చెప్పి...నా కాపురం నిలబెట్టండి...

చి : పద శేఖర్ ...నువ్వు చెబితే కాదంటావా...

శే : ఇంకా అక్కడే నిలబడ్డావేం అప్పలూ... తొందరగా ఇంటికిపో ... పెళ్లాన్ని తీసుకుని మరీ యిక్కడికిరా...నువ్వొక్కడవే వచ్చా వంటే కాళ్ళిరగ్గొడతాను...ఊఁ...పద...పద మామయ్యా...లలితను క్షమాపణ కోరుకోవాలి ...నన్ను లలిత క్షమిస్తుంది...నాకు తెలుసు ...నన్ను లలిత క్షమిస్తుంది... [తెర]

# రేడియో ఖగోళ శాస్త్రము

శ్రీ మా. కృష్ణమూర్తి

విశ్వములోని నక్షత్రములు, గ్రహములు, వీటినిముడ్చుకొని యుండు శూన్యాకాశమును గూర్చి వివరించు శాస్త్రము ఖగోళ శాస్త్రము. ఇరువది, ముప్పది యేండ్ల నాటివరకూ వీటిని గురించిన పరిశోధనలన్నీ యీ ఖగోళములు ప్రసరించు కాంతికిరణముల పరిశీలన వలననే జరుగుచుండెను. ఉదాహరణకు నక్షత్రముల యుష్ణోగ్రత, వాటిలోని వివిధ మూలపదార్థములు, ముఖ్యముగా ఆకాశములో వాటిస్థానము, కదలిక మున్నగు విషయములు దూరదర్శినులతోను, విచ్ఛిన్న కిరణదర్శిను (Spectrascope) లతోను అవి ప్రసరించు కాంతిని పరిశీలించి నిర్ణయించుచుండిరి. కాని, 1932 వ సంవత్సరములో కారల్ జాన్‌స్కీ (Karl Jansky) అనే అమెరికాదేశస్థుడు మొట్టమొదటి సారిగా ఈ విశ్వములో కొన్ని భాగములనుండి రేడియో తరంగములు కూడా మన భూమిని చేరుచున్నవని కనిపెట్టెను. సాధారణముగా ఏ స్టేషనులు లేనిచో కూడ రేడియోలలో ఒకవిధమైన "చప్పుడు" వినవచ్చు చుండును. ఈ చప్పుడులో కొంతభాగము రేడియోలోనే ఉత్పన్నమగును. మరికొంత భాగము భూమి వాతావరణములో నుండి ఏరియలుద్వారా రేడియోలోనికి చేరును. జాన్‌స్కీ యీ రెండవ భాగమునకు కారణము పరిశీలించునప్పుడే, మన వాతావరణమే గాక యీ విశాల విశ్వములో కొన్ని భాగములు కూడ యీ చప్పుడుకు కొంతవరకు కారణమని కనిపెట్టెను. అప్పటిలో నీ విషయమునుగూర్చి యంతగా ఎవరునూ శ్రద్ధవహించలేదు. కాని రెండవ ప్రపంచ యుద్ధకాలములోను, ఆతరువాత కూడా, రేడియోశాస్త్రము, ఎలక్ట్రానిక్సు శాస్త్రము చాలా అభివృద్ధి గాంచినందువల్ల ఈ నూతన ఖగోళ శాస్త్రమునందు పరిశోధనలు జరుగుటకు మంచి అవకాశము కలిగెను. ఇప్పుడు రేడియో ఖగోళశాస్త్రమునందు మిక్కిలి శ్రద్ధ వహించుచున్న దేశములు ఆస్ట్రేలియా, ఇంగ్లండు, అమెరికా, రష్యా, హాలెండు, జర్మనీలు.

ఈ పరిశోధనలకు ముఖ్యముగా కావలసినవి ప్రత్యేకమైన ఏరియలులూ, రేడియోలు. వీటి ప్రత్యేకతను గ్రహించుటకు సామాన్యమైన "కాంతి దూరదర్శిను"లతో (optical telescopes) పరిపోల్చుకొనుట అవసరము. కాంతి కిరణాలను పరిశీలించునప్పుడు మన మేనక్షత్రమో లేక ఆకాశము ఏభాగమందు ఆసక్తులమో ఆదిక్కునకు మనదూరదర్శినిని త్రిప్పుకొని ఆ ఒక్క భాగమునే పరిశీలించుచున్నాము. అటులనే మనము మామూలుగా వాడు ఒక్క ఏరియలు తీగలుగాక ప్రత్యేకముగా ఈ పరిశోధనకు పనికివచ్చునట్లు ఏరియలులు తయారు చేసికొనినచో మనమాకాశములో ఏభాగము పరిశీలింప దలచుకొన్నామో, ఆభాగమునుండి వచ్చు రేడియోతరంగములనే ఈ ఏరియలు మన రేడియో కందజేయును. ఏ యంత్ర సహాయములేక మనకంటితో మాత్రమే ఆకాశమును జూచిన మన కాకాశ మంతయును కనిపించును. అందువల్ల మన మేదైన ప్రత్యేక నక్షత్రమును సూక్ష్మముగా పరిశీలించవలెననిన, ఒకదూరదర్శినిని వాడవలసి వచ్చుచున్నది. మనకంటికీ, ఈ దూరదర్శినికీ ఉన్న భేదమువంటిదే మామూలు ఏరియలుకూ యీ పరిశోధన కుపయోగించు ఏరియలుకూ గలదు. దూరదర్శిని ఆకాశములో చాలా చిన్నవిస్తీర్ణమును చూపకలుగునట్లు చేయుటయే గాక, ఆ చిన్న ప్రదేశమునుండి వచ్చుచున్న కాంతిని మన కంటికంటే ఎన్నో రెట్లు కూడదీయును. అట్లే రేడియో ఖగోళశాస్త్రమునకు వాడు ఏరియలుకూడా మామూలు ఏరియలులకంటే ఎన్నో రెట్లు ఈ రేడియో తరంగముల మనరేడియో కందజేయును. ఇక రేడియోలోని ప్రత్యేకత ఏమిటి? రేడియోలో కొంతచప్పు డుత్పన్నమగునని యిదివరకే చెప్పబడెను. ఈ చప్పుడు సామాన్యముగా

ఆకాశమునుండి మనము వినగోరు చప్పుడుకన్నా చాలా రెట్లుండును. ప్రత్యేకముగా తయారుచేసిన రేడియో వాల్వులవల్లనైతేనేమి, రేడియోలో వాడు యితర పరికరముల ఎన్నికవల్లనైతేనేమి, ఈ చప్పుడు కొంతవరకు తగ్గించవచ్చును. ఇటువంటి రేడియోలు కూడ ఈ పరిశోధనకు కావలసిన అతి ముఖ్యసాధనాలు, రేడియో చప్పుడునుండి, దానికంటే చాలా తక్కువ పరిమాణముకల ఖగోళ ధ్వని (Cosmic noise) ని వేరుచేసి, స్వయం ప్రేరితముగ (automatic) రికార్డు చేయుటకు ఎలక్ట్రానిక్ యంత్రములు కూడ అవసరము.

కాంతి దూరదర్శినుల సామ్యముగా, ఈ ప్రత్యేక పరికరములను రేడియో టెలిస్కోపు లనుచున్నారు. ఇప్పుడు ప్రపంచములోకల్ల పెద్ద రేడియో టెలిస్కోపు యింగ్లండులో మాంచెస్టరు విశ్వవిద్యాలయమందున్నది. ఇదిఒక పెద్ద యినుపమూకుడు ఆకారములో నుండును. దీనిమూతి 250 అడుగుల వ్యాసము కలిగి, 60 అడుగుల లోతుగా నుండును. ఇంత బ్రహ్మాండమైన ఉక్కు కటాహమును సునాయాసముగా ఆకాశములో ఏ దిక్కునకైన త్రిప్పగలుగునట్లుగా అమర్చియున్నారు.

అయితే రేడియో ఖగోళశాస్త్రము కాంతి ఖగోళశాస్త్రము సాధించలేనిదేమి సాధించగలదనేది ప్రశ్న. దీనికి జవాబు చెప్పుటకుముందు రేడియో తరంగాలు, కాంతి తరంగాలూ కూడా వస్తుతః ఒకటేనని గుర్తుంచుకోవలెను. రెండూకూడ విద్యుదయస్కాంత (electro-magnetic) తరంగాలే. అయితే భేదమంతా ఆ తరంగముల పొడవులోనే. రేడియో తరంగముల పొడవు మీటర్లూ, సెంటిమీటర్లలో ఉంటే, ఒక సెంటిమీటర్లో యిరవైముప్పై వేలయినా కాంతి తరంగము లుండును. ఈ పొడవులోని భేదమువల్ల కలుగు ఒక లాభమేమంటే రేడియో తరంగములు మన భూమిని చేరుటకు పెద్ద అడ్డేమీ లేదు. మేఘములు ముఖ్యంగా అడ్డు కానేకావు. అందువల్ల ఇరవై నాలుగు గంటలూ యీ పరిశోధనకనువుగానుండును. ఈ రేడియో తరంగాలు కూడా మరీ పొడవయితే—అంటే 20, 30 మీటర్లకన్నా హెచ్చయితే—భూమికి వందమైళ్ళ ఎత్తులో ఉన్న ఒకవిధమయిన ఎలక్ట్రిక్ తెర (Ionosphere) అడ్డము వచ్చును. భూమి వాతావరణములోని యీ అడ్డంకులు గాక, అంతర్నక్షత్ర ప్రదేశముకూడా కాంతి తరంగములనూ, రేడియో తరంగములనూ వేరుచేయుచున్నది. ఈ అంతర్నక్షత్ర ప్రదేశము నిజముగా శూన్యము కాదు. కొంతవరకు కణములతోను, కొంతవరకు ఉదజని పరమాణువులతోను ఈ ప్రదేశము నింపబడియున్నది. ఈ కారణమువల్ల, కాంతికిరణములు వీటి ద్వారా రాలేకపోవుచున్నవి. కాబట్టి వీనివెనుకనున్న ఆకాశభాగములు దూరదర్శినిలో పరిశీలింప లేకున్నాము. అయితే రేడియోతరంగాలకు యీ కణములూ, అణువులూ ఏమంత అడ్డుగావు. ఈ ముఖ్యాంశము వల్లనే రేడియో ఖగోళశాస్త్రము మిక్కిలి ప్రాముఖ్యత వహించినది. ఇదివరకు మనము కాంతి దూరదర్శినులతో పరిశీలింపలేని అంతరిక్షభాగములను, ఎక్కువదూరములనూ కూడా రేడియో దర్శినుల ద్వారా పరిశీలింప కలుగుచున్నాము. అందువలన, ఇదివరకు తెలియని ఎన్నో నూతన విషయములు ఇప్పుడు మన విశ్వమునుగూర్చి తెలియవచ్చుచున్నవి.

మొదట రేడియో శాస్త్రపరిశోధకులు ఆకాశములో వివిధభాగములనుండి ఎంతెంత తీవ్రతతో ఈ రేడియో తరంగములు వచ్చుచున్నవి అని పరిశీలించిరి. దీనివలన తెలియవచ్చిన దేమన, మన పాలపుంత (Milky-way) కేంద్రము (Galactic centre) నుండి మిక్కిలి తీవ్రమయిన రేడియో తరంగములు వచ్చుచున్నవి. ఈ కేంద్రమునుండి దూరమగుచున్న కొలది, ఏదిక్కుంబోయినను వీటి తీవ్రత సామాన్యముగా తగ్గుచుండును. కాని అక్కడక్కడ కొన్ని స్థానముల నుండి చాల తీవ్రముగా ఈ రేడియోతరంగములు మన భూమిని చేరుచున్నవి. ఈ స్థానముల విస్తీర్ణములు, మన కంటి కనుపడు నక్షత్రములకన్న ఎక్కువగ నుండవు. అందువల్ల వీటిని రేడియో నక్షత్రము లనుచున్నారు. సాధారణముగా మన కనుపడు నక్షత్రములలో రేడియో నక్షత్రములయినవి—అనగా రేడియో తరంగములను ప్రసరింపజేయు దృశ్యనక్షత్రములు—చాల అరుదు. మన కండ్లు కాంతికిరణముల బదులు రేడియో కిరణములనే గ్రహింపగల్గియున్న యెడల, ఆకాశమే మరియొక విధముగ కన్పించియుండును. సూర్యుడు చాల కాంతిహీనుడై యుండును. నక్షత్రవీధి (Milky-way, galaxy) మిక్కిలి ప్రకాశవంతముగ ఆకాశములో

ఆగ్నేయమునుండి నైరుతికి ఒక దారవలె కన్పించి యుండును. ఇదిగాక అక్కడక్కడ నక్షత్రము లుండును.

ప్రస్తుతము, రేడియో ఖగోళశాస్త్రజ్ఞులు ఈ రేడియో తారల స్థానము, వైశాల్యము, తీవ్రత దృశ్య నక్షత్రములతో వాటికిగల సంబంధము మున్నగువాటిపై పరిశోధనలు జరుపుచున్నారు. పరిశోధనా పద్ధతుల నెప్పటికప్పుడు అభివృద్ధి చేసి యింతవరకు కొన్ని వేల రేడియో నక్షత్రములను కనిపెట్టి యున్నారు. ఇంతే గాక, నక్షత్రములలోను, అంతర్నక్షత్ర ప్రదేశము లోను చాలవరకు ఉదజనియే యున్నదని యిప్పుడు తెలియవచ్చుచున్నది. ఐతే, ఈ రేడియో తరంగము లెట్లుత్పన్న మగుచున్నవి అనే ప్రశ్న కింతవరకు ఊహా మాత్రమైన సమాధానమే యివ్వగలుగుచున్నారు. సూర్యునినుండికూడ రేడియోతరంగములు వచ్చుచున్నవి. ఈ తరంగములు కాంతి తరంగములవలెనే, అదే పద్ధతిలోనే సూర్యునిలో పుట్టవలెననిన, సూర్యునియుష్ణోగ్రత ముఖ్యముగా సూర్యుని వెలుపలి భాగములలో, ఇప్పుడు మనమనుకొనుదానికన్న కనీసం కొన్ని వందలరెట్లు అధిక ముగానుండవలెను. అంతేకనీసము పదిలక్షల డిగ్రీలసెంటిగ్రేడయినా ఉండవలెను. ఇటువంటి పెక్కు క్రొత్త విషయములు ఈ శాస్త్రమువల్ల బయటపడుచున్నవి. మనపాలపుంత ఏఆకారము గలది, అటువంటి నక్షత్రసమూహాలు విశ్వములో ఎన్ని ఉన్నవి, ఎన్ని విధములుగనున్నవి; క్రొత్త నక్షత్రములు (Nova) పుట్టునపు డెటువంటి మార్పులు సంభవించును; ఈ విశ్వముయొక్క పుటుక ఎప్పుడు ఏ విధముగ జరిగెను? ఈ విశ్వమున కేవయిన సరిహద్దు లున్నవా? అవి స్థిరములా?—ఇటువంటి పెక్కు ప్రశ్నలకు సమాధానాలు బడయుటకు ఈ నూతన శాస్త్రము మిక్కిలి తోడ్పడు అవకాశ మున్నది. గతించిన పది యేండ్లలోనే శాస్త్రజ్ఞులు ఈ విషయములందు చాలా నూతనాంశములు కనిపెట్టి యున్నారు. ఈ శాస్త్రము విలువ ఇప్పుడిప్పుడే అన్ని దేశములవారు గ్రహించుచున్నారు. త్వరలోనే మన దేశముకూడా ఈ శాస్త్రపరిశోధనలో ప్రముఖపాత్ర వహింపబోవుచున్నది. ప్రస్తుతము, ఉస్మానియా విశ్వ విద్యాలయములోనూ, కొడైకనాలు అబ్జర్వేటరీలోను రేడియో టెలిస్కోపులు నెలకొల్పబడి యున్నవి.

# సత్యవ్రతుడు

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

పుడమిని విశ్రుతుం డొక ప్రబుద్ధ గృహస్థుఁడు దేవదత్త నా
ముఁడు కలఁ డాతఁ డన్నియును బూర్తిగ నేర్చి స్వకీయ ధర్మమున్
నడపుచుఁ గాలముం గడపు నాతియుఁ దానును — గాని పుట్టఁడొ
క్కఁడు మగబిడ్డయైన నదికర్మముగా నతఁడెంచు నిచ్చలున్

కడు వగఁ గుంది లోకమునఁ గల్గు వ్రతంబులు శ్రద్ధధానుఁడై
నడపుచు ధర్మకార్యము లనారతముం దగ నాచరించి యె
క్కుడు శ్రమ చెందెఁ గాని తనకోరికి లేశము తీఱదాయె; నా
తఁడు తుదికొక్కయాగము ముదంబునఁ జేయఁగడంగె నిమ్మగా

వేదము లన్ని నేర్చిన వివేకధనుల్ పదియుండి వాని యం
దాదర ముంచి యాగమున కక్కఱయైన సమస్త వస్తువుల్
ప్రోది యొనర్చి దాని కొక మూర్తము పెట్టి తదీయదీక్ష నిం
పాదిగఁ బెంపొనర్చి రనయంబుగ దీవనలిచ్చి మెచ్చగన్

అందఱుఁ జేరి యాగము సమంచితరీతి నుపక్రమింప నా
నందము సెంది విప్రుఁడు మనంబున నూయలలూఁగు కోరుకుల్
క్రందుగ పండడింప శుభకార్యము చక్కఁగ నివ్వటిల్లఁగాఁ
దొందరఁ జూపసాగెఁ బరితోముఖవైదిక కర్మబద్ధుఁడై

ఆ తరుణంబులో నెవరి యత్నము వారలొనర్చుచుండ ను
ద్గాతగ నున్న 'గోబిలుఁడు' దక్షుఁడె యయ్యును దైవికంబుగా
వాతను లోపముం బొదివి వైదికభాగ మపస్వరంబుతో
లాఁతిగ నుచ్చరించె; నిఁక లాభము లేదని రెల్ల పెద్దలున్

యజమానుం డది గాంచి యోర్వక మహాప్రారంభ మీ రీతి న
క్కజముం గొల్పెడి విఘ్నముం బొరసి భగ్నంబయ్యె నయ్యో! యటం
చు జడిం బొందియు గోబిలుం గని యిసీ! స్రుక్కింపఁగాఁ జేసి మా
యజనం బిట్లు వృథా యొనర్చితె దురాత్మా! యంచు రోషంబుగా

అని, యా విప్రుఁడు వెండియుం బలికెఁ బుత్త్రార్థంబు నే నింతగా
వనటం గూరి తదేకదీక్ష మెయి నిప్పాటం బ్రవర్తింప నా
ర్తును వక్రింపఁగఁ జేసి కామ్యమును సంపూర్ణమ్ముగా నమ్మ నే
సిన నిన్నేమనవచ్చు? మూర్ఖుఁడవు నా శ్రేయస్సు పోకార్తువా!!

అనుడుం గోబిలుఁ డట్టె బిట్టలిగి యారా! యిందు నాదోసముం
గనియే కూసితివో! యిదెట్టులగునో కానిమ్ము నేఁ జూతు నె
వ్వనికిన్ నైజము మార్పుసేయఁ దరమా! ప్రారబ్ధ మిట్లుండ నీ
కును నాకున్ వగగాక యొండు గలదా? క్రూరాత్మ, యిట్లందువా?

ప్రాణికి నూర్పు పుచ్చుట స్వభావము; దానిని మార్పుసేయ నె
వ్వానికిఁగాని సాధ్యమె? యవార్యమునై గమనింపరాని యి
ద్దానినిబట్టి దోషివని దర్పముతో నను ధిక్కరించి దు
ర్మానము చూపి తిట్టిన ప్రమాదము నిన్నుఁ దపింపఁ జేయదా!

నను మూర్ఖుండని యందువా! వినుము సంతానమ్ము లేదంచుఁ జిం
తను యాగంబునకై కడంగితివి కానన్ బుట్టెఁ బుత్త్రుండు; వా
నిని మూర్ఖుండుగఁ జేయు దైవమిఁక నీ నిష్ఠాగరిష్ఠత్వమె
ట్లనువై తీర్చునో చూతమంచు నతఁ డుగ్రాకారముం బూనినన్

గడగడలాడి విప్రుఁడు మొగంబున నెత్తురు చుక్కలేక య
ప్పుడు సభలోని పెద్దలను బాల్పుగ నొక్కటఁ గూర్చి వారికిం
గడు వినయంబు చూపి యపుగాము లెఱింగిన మానులార, నా
యెడఁ గరుణింపరే! యనుచు నెంతయు వందురి పల్కెనిమ్మెయిన్

ఇది నా చేసిన దానికిన్ ఫలితమే! యేదో మహాబాధలో
మది స్వాస్థ్యంబును దక్క పల్కినను నా మర్యాదఁ బోకార్చి పె
ట్టిద మా శాపము నిచ్చి యాపదల నన్ డీకొల్పఁగాఁ జేయ న
మ్మదమై యొప్పనె మీకు? న్యాయ్యమును సంపూర్ణంబుగాఁ ద్రుంతురే!

కొడుకు వివేకి గాక తనకుం గడుఁ గూర్చెడివాఁడుగాక మూ
ర్ఖుఁడు నయి యున్న లోక మది రోయదె! తండ్రికి లాభమేమి? పు
త్త్రుఁడు జనియింపఁడే యనుచుఁ దొందరఁ జూపితిఁగాని మూర్ఖుఁడౌ
కొడుకును సైఁతునే! యెఱిఁగి కోరిన కోరుకు లిట్లు తీర్తురే!!

అంతకు మించి తండ్రికి ననర్హత మెద్దియు లేదు; పెద్దగాఁ
జింతను దెచ్చి పెట్టఁ గల చిక్కు లనేకము లుప్పతిల్లు; ని
న్నంతతివల్లఁ గల్గెడి విచారము వైఖరి కేలఁ—దీని న
త్యంతము పాఱఁ జూచి శుభమైనది కూర్పరె మ్రొక్కి వేఁడెదన్

పయిగా విప్రుఁడు మూర్ఖుఁడైన నిఁక దౌర్భాగ్యంబు వర్ణింప నెం
తయు దుస్సాధ్యము; వాని జీవితము నిందాపాత్రమై పెద్ద రోఁ
తయుఁ బుట్టించును దల్లిదండ్రులకు నిత్యం; బిట్టి దౌర్గత్య దు
ర్నయముల్ సైఁతురె పెద్ద లిందఱు! ననునె రక్షింపరే యిత్తఱిన్!!

అదియునుగాక విప్రుఁడగు నాతఁడు ప్రాజ్ఞుఁడు గామి తేనికే
గద చెఱు పట్టి దేశమున జ్ఞానులు కాఁపుర ముండఁగూడ ద
య్యది యొక దుష్టరాజ్యమని యందురు పెద్దలు; దీనినైన నె
మ్మది గుఱితించి యిట్టి యవమానము తీర్పరె మూలముట్టఁగన్

తన దేశమ్మున విప్రుఁ డజ్ఞుఁడయినన్ ధాత్రీశుఁ డవ్వాని జీ
వనమున్ సేద్యములోన నుంచి కృషికవ్యాపార మేపార నా
తనిఁ బోషింపఁగఁ జెల్లుఁగాని యతనిన్ ధాత్రీసురుండంచు మె
ప్పునఁ జూడందగ; దిట్టి పుత్త్రివలనన్ మోక్షంబు సిద్ధించునే?

ఎంత విపత్తు మూఁడినను హీనుని విప్రుని శ్రాద్ధమందు ర
వ్వంతయు నాదరింపరు గదా! యెవరైనను వానిఁ గూర్చి యా
వంతయుఁ జింతనొంద రిది యన్నము పున్నమటంచుఁ దీర్పులున్
సుంతయుఁ జెప్ప, రిట్టి యొక శుంఠను బుత్త్రిని నాకు నిత్తురే!

మతి పసలేని బాఁపనికి మన్ననసేయుట పెద్ద దోసమై
వెతలను గూర్చు; వానిని వివేకులు దవ్వులనుంచి పొట్టకున్
మెతుకులు నాల్గు రాల్పవలె మించియు నేదియుఁ బంచరాదు న
ద్గతి కతఁడర్హుఁ డెన్నఁడును గాఁడని యందురు శాస్త్రవేత్తలే

కలిగిన యింటఁ బుట్టినను గాని సహింపక వాని యాస్తి పా
స్తులు మొదలంట దోఁచుకొని త్రోలుట దోసముగాదు; కాకి మూఁ
కలు తమ భాగ్యభోగ్యములుగాఁగఁ దలంచియు వేఁపపండ్లు న
గ్గల ముగ మెక్కవే? యిదియగాదె ప్రపంచపు ధర్మ మెప్పుడున్

ఎవనికి నచ్చనట్టి గుణహీనుని బుత్త్రుని బొంది లోకమం
దెవరికి మేలు సేయును? మదీప్సిత మెయ్యది తెలు? విచార లీ
యవసరమందు న్యాయ్యమగు నట్టిది బిట్టుగఁ జూచి శుద్ధి వై
భవ మధికంబుగాఁ గలుగు వానిని బుత్త్రునిగాఁగ నీయరే!!

అని తన గోడు విప్రుఁడిటు లందఱికిం దెలియంగ వెళ్లఁ బో
సిన నది శోచనీయముగఁ జిత్తమునం దలపోసి గోబిలుం
డనియెను:—దేవదత్త, యిది యంతయు నీ గ్రహచారమయ్య యె
వ్వని కెటు వ్రాసె దైవము ప్రపంచమునం దది తప్ప దేమొకో!

కాని యనుగ్రహించితిని గావున ధైర్యము గొమ్ము లెమ్ము-వి
జ్ఞానము గల్గి జీవితము శాంతిముగా నడిపింపవయ్య, నీ
సూనుఁడు మూర్ఖుఁడే యగును సుమ్మ! పదంపడి బుద్ధిమంతుఁడై
కానఁగవచ్చు లోకమున గౌరవమంది సుఖంచు నిచ్చలున్

అనఁగా విప్రుఁడు సంతసించి యపుడా యాగంబు శాస్త్రీయ ధో
రణి సంపూర్ణముగా నొనర్చి తనకున్ రాఁబోవు లాభంబు ని
మ్మన మందుం బరికింపఁగాఁ దొడఁగె; సమ్మానంబులంబొంది స
న్మను లాశీస్సు లొసంగి రాతనికిఁ; దన్మూలంబుగా నావలన్

అతని భార్య గర్భిణియునై కనె నొక్క కుమారు వంశ వి
ఖ్యాతికిఁ దగ్గవాఁడె యగునా! యని యాప్తులు సంశయింప సం
ప్రీతియుఁ గల్గి తండ్రియు విరించి విధించిన రీతి సక్రమం
బై తగు జాతకర్మముల నన్నిటిఁ బూర్తి యొనర్చె నిమ్మగా

స శే ష ము

# స్వప్నసీమ

శ్రీ అంగర సూర్యారావు

## పాత్రలు: శ్యామసుందరం, నరేంద్రరావు, జగం, వెంకటప్పయ్య, నటరాజు, రత్నం, జోగయ్య

* * స్థలం :—ఒక ఫొటోస్టుడియో.

సమయం :—రాత్రి 8 గంటలు.

స్తంభాలతో అందంగా చిత్రించబడిన దృశ్యం ఒకటి హాలులో కనిపిస్తోంది. హాలంతా ధూళితో, కాగితం ముక్కలతో నిండివుంది. ఒక టేబిలు, రెండు కుర్చీలు వున్నాయి. మరోవైపున ఒక బల్ల వుంది. టేబిలుమీద రంగుడబ్బాలు, కుంచెలు, సగం చిత్రించబడిన బొమ్మ వున్నాయి. శ్యామసుందరం తదేక దృష్టితో కుర్చీలో కూర్చుని బొమ్మను రంగులతో దిద్దుతున్నాడు. కుడివైపు నుంచి వెంకటప్పయ్య భుజం మీద హోల్డాలుతో ప్రవేశిస్తాడు. శ్యామసుందరం, తన ధోరణిలో తాను, చిత్రాన్ని పూర్తి చేసుకుంటున్నాడు.

వెం : శ్యామసుందరం!

శ్యా : (మెడతిప్పకుండా తన పని కానిస్తూ) ఉష్! మాట్లాడవద్దు. 'మూడ్' పోతే మళ్లా పావలా డబ్బులు ఖర్చుపెట్టాలి.

వెం : నేస్తా!

శ్యా : నువ్వెవరివైనా సరే! మాట్లాడకుండా కూర్చో వలసిందే

వెం : నేస్తా, వెంకటప్పయ్యను.

శ్యా : (తల పైకెత్తి వెంకటప్పయ్యను గుర్తించి) ఒహో! వెంకటప్పయ్యా? ఏమిటి యిలా దయ చేశావు? మన వూళ్లో అంతా క్షేమమేనా?— రా! కూర్చో! [కుంచె టేబిలుమీద పెట్టి లేస్తాడు.]

వెం : (హోల్డాలు బల్లమీద పెట్టి హాలంతా కలయ జూస్తూ) ఏమిటిరా యిదంతా? నువ్వు పట్నంలో స్టుడియో పెట్టేవని తెలిసింది. వెంటనే బయలు దేరి వచ్చాను.

శ్యా : ఎందుకు?

వెం : నాకోక వేషమైనా యిస్తావని. లేదా కనీసం నేపథ్యగాయకుడిగా అయినా పెట్టుకుంటావని. (చుట్టూ చూస్తూ) తీరా చూస్తే—యేమిటీ అఘోరం—యిలా వుంది?

శ్యా : (నవ్వుతూ) నేను పెట్టినది సినిమాస్టుడియో కాదురా వెంకటప్పయ్యా! ఫొటోస్టుడియో!

వెంక : (నిష్పృహతో) ఆశాసౌధాలు నిర్మించుకొని వచ్చాను. తోలిమెట్టు దగ్గరే. పరాజయమా?

శ్యామ : కళాకారుడికి పరాజయం, అర్ధాంగి లాంటిది. ఆప్యాయతతో దానిని స్వీకరించు.

వెంక : ఏడిచినట్లేవుంది. నువ్వు చిత్రకారుడవుకదా యీ ఫొటో స్టుడియో యేమిటిరా ఖర్మ!

శ్యామ : అలాదారికిరా! అసలు విషయం చెబుతాను. ఈ రోజులలో లలితకళలు దమ్మిడీకి కూడా మారవు. ఈనగ్న సత్యాన్ని నేను కాదు కనిపెట్టింది.

వెంక : అది కనిపెట్టిన మహానుభావు డెవరు?

శ్యామ : మా మేనమామ. నేనిక బొమ్మలు వెయ్యడానికి పనికిరానని ఆయన తేల్చేశాడు.

వెంక : నీ చిత్రాలకు అనేక బహుమతులు వచ్చాయి కదూ!

శ్యామ : అవునను కో. అయినా మా మామ ఒప్పుకో లేదు. రెండువేల రూపాయలు పెట్టుబడి పెట్టి యీ ఫోటో స్టుడియో పెట్టించాడు. దీనిమీద సుఖంగా బ్రతుకమన్నాడు.

వెంక : (సగంపూర్తి అయిన చిత్రం కేసి చూస్తూ) మరి నువ్వింకా చిత్రలేఖనం విడిచిపెట్టలేదు!

శ్యామ : (సీరియస్‌గా) కంఠంలో వూపిరి వున్నంత వరకూ విడిచి పెడతానటరా పోదరా! సెంట్రల్ జెయిల్‌లో పెట్టినా బొమ్మలు గీస్తాను.

వెంక : (అనుమానంగా చూస్తూ) నీకు మతి స్థిరంగా వుందా?

శ్యామ : లోల్దంత స్థిరంగావుంది. వుందికనకే మా మామని ఫలి కొటించాను. పగలు ఫోటోలు తీస్తున్నాను. రాత్రులు రహస్యంగా చిత్రాలు తయారు చేస్తున్నాను.

వెంక : (నిష్పృహతో) ఇదటరా నువ్వు చేస్తున్న పని? మన వూళ్ళో అందరికీ చెప్పేసివచ్చాను. నేను సినిమా కంపెనీలో చేరిపోయానని మనవాళ్ళంతా సంతోషించారు. టీపార్టీయిచ్చారు. పూలదండలు వేశారు. ఫోటోలు తీశారు. ఇప్పుడు యే మొహం పెట్టుకొని వెనక్కి వెళ్ళగలనురా?

శ్యామ : సినిమాకంపెనీమీద నీ కన్ను యెందుకు పడింది?

వెంక : నావంటి గాయకుడు రాణించాలంటే సినిమా రంగం ఒకటే శరణ్యం.

శ్యామ : వ్యవసాయం విడిచిపెట్టేశావా?

వెంక : నాహృదయం పురకలువేస్తూ — సంగీత తరంగాలపై తేలిపోతూవుంటే—వ్యవసాయం యెలా చెయ్యగలను? నీలాంటి ఒకచిత్రకారుణ్ణి తీసుకువెళ్ళి ఒక ఫేక్టరీలో కార్మికుడిగా వేస్తే యేంచేస్తావ్?

శ్యామ : మనకళ మనల్ని పోషించడానికి నిరాకరించి నప్పుడు యేపనైనా చెయ్యాలి. ఒక ప్రఖ్యాత రచయిత పగలంతా పకోడీలు అమ్ముకొని రాత్రులు అద్భుతమైన నవలలు రాసే వాడు.

వెంక : లాభంలేదు. మనలాంటి యువకులం సాహసించాలి.

శ్యామ : సాహసించి తీరాలి. అది నేనూ ఒప్పుకుంటాను. సరే దానికేం. కూర్చో. (యిద్దరూ కూర్చుంటారు.) మనవూరి విశేషాలు చెప్పు

వెంక : ఛ! ఛ! అదేం వూరుపోనియ్‌రా!

శ్యామ : మనవూరిమీద నీకు గౌరవం లేదా?

వెంక : నాకు ప్రాంతీయ దురభిమానం లేదని చెప్పు కోడానికి నేను చాలా గర్విస్తున్నాను.

శ్యామ : మన వూరిమీద నీకు గౌరవం పోవడానికి కారణం?

వెంక : కళలమీద, కళాకారుల మీదా గౌరవంలేని వూరు—అదికూడా—ఒక వూరేనా?

శ్యామ : నీ ఉద్దేశం పూర్తిగా చెప్పు.

వెంక : ఏం చెప్పన్రా? అనేకసాట కచేరీలు పెట్టాను. అబ్బే—విలువ వుంటేనా? నాటకం కంపెనీలను తీసుకువచ్చి నాటకాలు వేయించాను. ఎన్ని చేసినా ప్రయోజనం కనిపించలేదు. (సూటిగా) ఒరేయ్. నాకు కాస్తో కూస్తో ప్రతిభ వుందంటావా?

శ్యామ : అందుకు సందేహమా!

వెంక : ప్రస్తుతం వున్న నేపథ్య గాయకులకంటే నేనేమైనా తీసిపోతానా?

శ్యామ : ఎంతమాత్రం తీసిపోవు.

వెంక : అటువంటప్పుడు నాలో వున్న ప్రతిభను, కళా పిపాసను చంపుకొని అమారు మూలగ్రామంలో జీవచ్ఛవంలా బ్రతికమంటావా?

శ్యామ : కష్టమే.

వెంక : కనుకే సాహసించి యీ చీకటిదారిలో అడుగు పెట్టాను. వెళ్లగా, వెళ్ళగా కొంతకాలానికైనా వెలుగు కనిపించక పోతుందా అనే ఆశతో బయలు దేరాను.

శ్యామ : నువ్వు నేటి బాటసారివి. నేను నిన్నటి ప్రయాణీకుణ్ణి. అంతే తేడా.

వెంక : పోనీ యీ ఫోటో స్టుడియో వల్లనైనా— యేమైనా గిట్టుబాటు అవుతోందా?

శ్యామ : ఏమీ లేదు. మూణ్ణెల్లనుంచి యీ యింటికి అద్దెకూడా యివ్వలేకపోతున్నాను. ఇంటి

యజమాని రోజుకో పారివచ్చి పరామర్శించి పోతున్నాడు.

వెంక : ఈ రకంగా బండి యెంతకాలం నడుస్తుందిరా?

శ్యాము : (తేలిగ్గా) ఆఁ! దానికేముంది? బుర్రలో తెలివివున్నంతవరకూ నడుస్తుంది. పాతబకాయీలు అన్నీ తీర్చడానికి బ్రహ్మాండమైన ఉపాయం ఒకటి ఆలోచించాను.

వెంక : (ఉత్సాహంతో) ఓహో! అలాగా!

శ్యాము : అదేమిటో తెలుసా? యీ వూళ్ళో ఒక నాటకమండలివుంది.

వెంక : (వెంటనే) బాబ్బాబు! నన్ను కాస్త పరిచయం చెయ్యరా వాళ్ళకి.

శ్యాము : అలాగే చేస్తాను. చెప్పేది విను.—వాళ్ళు కూడా దివాలాస్థితిలో వున్నారు.

వెంక : (నిస్పృహతో) ఎక్కడికివెళ్ళినా ఒక్కలాగే యేడిసింది బ్రతుకు. కొనబోతే కొరవి: అమ్మబోతే అడవి.

శ్యాము : ఆ నాటకమండలి వాళ్ళుకూడా వూరినిండా అప్పులుచేసుకొని కూర్చున్నారు. ఆ సమయంలో నేను వాళ్ళని పట్టేశాను.

వెంక : అఘోరించినట్టేవుంది. డబ్బున్నవాడితో కలిస్తే యెవడైనా హర్షిస్తాడు. అంతేకాని దివాళా తీసిన వాళ్ళతో కలుస్తావట్రా! పోనీ నీ బ్రతుకేమైనా బాగుందా? జోగీ జోగీ రాచుకుంటే బూడిద రాలిందట!

శ్యాము : చెప్పేది పూర్తిగావిను. వాళ్ళూ నేనూ కలిసి ఒక ఒప్పందానికివచ్చాం. పగలు నేను యీ హాలును ఫోటోస్టుడియోగా ఉపయోగించుకోవడానికీ — రాత్రులు వాళ్ళు నాటకమండలి కార్యాలయంగా వాడుకోవడానికి నిశ్చయించుకున్నాం. యిందులోవున్న కీలకం యేమిటో తెలిసిందా?

వెంక : అది తెలియడంలేదు.

శ్యాము : ఈ యింటి అద్దె నాటకం కంపెనీవాళ్ళూ నేనూ చెరిసగం భరించుకోవాలి (ఏదో ఆకస్మికంగా స్ఫురణకు వచ్చినట్లు) అన్నట్లు వాళ్ళు వచ్చేరోజు (కేలండరుచూసి) హా! చచ్చితిమి! వాళ్ళు రావలసినరోజు యిదే!

వెంక : ఈరోజే వస్తారట్రా?

శ్యాము : (తొందరగా) యీరోజేనట్రాబాబూ! వాళ్ళు యిప్పుడే వస్తారు. (చుట్టూ చూసి) వాళ్ళు అడుగుపెట్టేసరికి యీ హాలు యింత అపరిశుభ్రంగా వుండడం మంచిదికాదు. ఒరేయ్ వెంకటప్పయ్యా! నువ్వు నాకు చిన్న సహాయం చెయ్యాలి.

వెంక: ఓ! తప్పకుండా చేస్తాను.

శ్యాము : (ఎడమవైపు వెళ్ళి రెండు చీపురుకట్టలు తీసుకువచ్చి ఒకటి వెంకటప్పయ్యకు యిస్తూ) నువ్వు ఆ మూలనుంచి తుడుచుకురా! నేను ఈ మూలనుంచి తుడుచుకు వస్తాను.

వెంక : (చీపురు తీసుకొని) ఆల్ రైట్, అదెంతపన్రా! (యిద్దరూ తొందరగా చొక్కాలు విప్పేసి టేబిలుమీద పారేస్తారు. బనీనులు ఒకసారి సర్దుకొని—ఫుల్ ఫాంట్సు మోకాళ్ళవరకూ మడతపెట్టి—యిద్దరూ చెరో వైపునుంచి హాలు తుడవడం ప్రారంభిస్తారు.)

వెంక : ధూళి పైకి లేవగొట్టకురా! నువ్వెక్కడున్నావో కనబడడంలేదు. (చీపురు క్రింద పారేసి నిలబడతాడు.)

శ్యాము : (తొందరగా) కానియ్‌రా బాబూ! యిక టైంలేదు.

[యిద్దరూహాలంతా తుడిచి చెత్తను ఒక మూలకు ఊడ్చుకు వెళతారు.]

వెంక : (కళ్ళలో పడిన ధూళి తుడుచుకుంటూ) యిల్లు తుడిచి శుభ్రం చెయ్యడానికి పని మనిషి లేదట్రా?

శ్యాము : పనిమనిషి ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసింది.—సరే దానికేం. నువ్వు తొందరగా ఆ డార్కు రూంలోకి వెళ్ళి చేతులు కడుక్కొనిరా.

వెంక : ఆ చీకటి గదిలో దేనిమీదైనా పడనుకదా?

శ్యాము : (చిరాగ్గా) అబ్బ! వెళ్ళి స్విచ్‌నొక్కరా. లైటు వెలుగుతుంది.

[శ్యామసుందరం టేబిలుమీదవున్న సామాన్లు అన్నీ తీసి ఒక మూల పెడుతూవుంటాడు. వెంకటప్పయ్య లోనికివెళ్ళి చేతులు శుభ్రం చేసుకు వస్తాడు. ఇద్దరూ తిరిగి చొక్కాలు వేసుకుం

టారు. ముందు టేబిలు, తరవాత బల్ల యిద్దరూ చెరోవైపూ పట్టుకొని ఒక్క ప్రక్కను పెడతారు. యిద్దరూ చెరో మూల నుంచి హాలు పరిశీలించి చూసి సంతృప్తి పడతారు.]

వెంక : ఈ పారి బాగుంది. ఏర్పాట్లన్నీ అయిపోయి నట్టేనా? యింకా యేమైనా మిగిలాయా?

శ్యామ : ఇంక ఒక్కటే యేర్పాటువుంది.—నీ దగ్గర యేమైనా చిల్లరుందా?

వెంక : ఏ మాత్రం కావాలి?

శ్యామ : ఒక ఐదు రూపాయలనోటు.

వెంక : (ఐదు రూపాయలనోటు తీసి యిస్తాడు.)

శ్యామ : (నోటు తీసుకొని) కాఫీకి ఆర్డరిచ్చి యిప్పుడే వస్తాను. నేను తిరిగి వచ్చేవరకూ నిన్ను యీ యింటికి యజమానిగా నియమిస్తున్నాను. (వెళుతూ వుంటాడు.)

వెంక : (ఆపు చేసి) అంటే? నే నేం చెయ్యాలి?

శ్యామ : అబ్బే! యేం లేదు. నేను తిరిగి వచ్చేలోగా యెవరైనా వస్తే వాళ్లకు అన్ని మర్యాదలూ చెయ్యి. యిప్పుడే—క్షణంలో వస్తాను.
[శ్యామసుందరం తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు. వెంకటప్పయ్య ఒంటరిగా హాల్లో అటూ యిటూ తిరుగుతూ వుంటాడు.—కుడి వైపునుంచి రత్నం వస్తాడు. లావుగా, పొడవుగా వున్నాడు.]

వెంక : (రత్నాన్ని సమీపించి) అయ్యా! దయచేసి తమరిక్కడ కూర్చోండి. (కుర్చీ చూపిస్తాడు.)

రత్నం : (కోపంతో) కూర్చోడం నుంచోడం జాన్తానై. ముందు వందరూపాయలూ అక్కడ పెట్టి కదులు.

వెంక : (వినయంతో) మీరు నన్ను యెవరో అనుకొని పొరబాటుపడుతున్నారు. నేను వెంకటప్పయ్యను.

రత్నం : అయ్యా! వెంకటప్పయ్యా! యీ పప్పులు మన దగ్గర వుడకవ్. ముందు వందరూపాయలూ అక్కడపెట్టు.

వెంక : మీరు చెప్పేదేమిటో నాకు బోధపడడం లేదు. నేను యీ వూరికి కొత్తవాణ్ణి.

రత్నం : మా పెద్దనాన్న కూడా సరిగా అదే చెప్పాడు. "ఒకేయ్ రత్నం! అది అసలే నాటకం కంపెనీ. రోజూ కొత్తవాళ్ళే కనిపిస్తూ వుంటారు. వొదిలెయ్యకు." అని మరీ చెప్పాడు.

వెంక : మీకు నాటకమండలివారు బాకీవున్నారా?

రత్నం : (హేళనగా) ఒహోహో యేం నాటకం ఆడుతున్నావయ్యా వెంకటప్పయ్యా?

వెంక : (కోపంతో) ఏమనొయ్యాయ్. కొంచెం మర్యాదగా మాట్లాడు. వెయ్యి రూపాయలు అప్పు అయినా పడతారు కాని వెక్కిరింపు పడరు.

రత్నం : అంత పౌరుషంవుంటే డబ్బుపారేసి మాటాడవయ్యా.!

వెంక : అరె! మళ్లా మొదటికొస్తాడు. నాకూ నాటకం కంపెనీకి సంబంధం లేదయ్యా అని చెబితే? అసలు నాటకం కంపెనీయే యింకా యిక్కడికి రాలేదు. వాళ్లకంటేముందు (చెయ్యి తిప్పుతూ) అప్పులాడవు—నువ్వొచ్చి కూర్చున్నావ్.

రత్నం : మరి మా పెద్దనాన్న చెప్పేడు నాటకం కంపెనీ యిక్కడ పెట్టేరని?

వెంక : నీకు ఓపికవుంటే వాళ్లు వచ్చేవరకూ కూర్చో. వాళ్లా యిప్పుడే రావచ్చు.

రత్నం : ఓ యస్! అలాగే కూర్చుంటాను. (కూర్చీలో కూర్చుని) చూడండి వెంకటప్పయ్యగారూ! నా గొప్ప నేను చెప్పుకోకూడదు గానీ— రానిబాకీలు యెక్కడవున్నా మా పెద్దనాన్న నన్నే పంపిస్తాడు.

వెంక : అలాగే కనిపిస్తోంది.

రత్నం : అంతేకాదు. కొమ్ములు తిరిగిన రౌడీలకు కూడా రత్నం పేరు చెబితే హడల్ !

వెంక : ఎవరావిడ ?

రత్నం : (కోపంతో) రత్నంఅంటే ఆడమనిషి కాదు. అది మన స్వంత పేరు !

వెంక : ఓహో ! అలాగా ! ఎవరో ఆడమనిషను కున్నాను. అది కాకపోయినా పెద్దపెద్ద రౌడీలంతా ఆడాళ్ల దగ్గరే జడుస్తూ వుంటారు.

రత్నం : (కోపంతో) చాల్లే! సంతోషించాం !

వెంక : మావూళ్లో కొండమ్మ అని ఒకావిడ వుంది. ఆవిడ సంతలో కూరగాయలు అమ్ముతుంది. ఆవిడ పెద్దపెద్ద రౌడీలను కూడా సిగపట్టుకొని యీడ్చి యీడ్చి తన్నుతుంది.

రత్నం : (కోపంతో) ఆరిన్నోకపారి యీ పూరు రమ్మను చూద్దాం.

వెంక : నువ్వేరా ఒకపారి తూపూరు.

రత్నం : ఏం ? భయమనుకున్నావా ?

[కుడివైపునుంచి నరేంద్రరావు, జగం మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు. జగం భుజాన్ని హార్మోనియం వుంది. నరేంద్రరావు చేతిలో ఆరిపోయిన పెట్రోమాక్సు లైటు ఒకటివుంది.]

నరేంద్రరావు : నటరాజుగారు యేమన్నారో తెలుసా? యీ కళా మండపంలో అడుగు పెట్టగానే ఆకాశజ్యోతి కనిపిస్తుందన్నారు.

జగం : (రత్నంకేసి వేలుపెట్టిచూపిస్తూ భయంతో) ఆకాశజ్యోతి కనిపించడంలేదు కాని తిన్నగా అప్పులవాడు మాత్రం కనిపిస్తున్నాడు.

నరేం : హా! హతోస్మి! (యిద్దరూ అమాంతంగా బల్లమీద కూలబడతారు.) ఒరేయ్ జగం! రెండున్నర శ్రుతిలో ఒకపాట లాగించు. (జగం హార్మోనియం వాయిస్తూవుంటే నరేంద్రరావు రోదనస్వరంలో పద్యంలోని మొదటి చరణం అందుకుంటాడు.) "అకటా! ఒక్కని పంచదాసియయి ......

[నరేంద్రరావు రాగాలాపన చేస్తూవుండగా రత్నం అమాంతంగా వాళ్ళ యిద్దరిముందూ దూకుతాడు.]

రత్నం : (సీరియస్‌గా) కట్టిపెటవయ్యా నాటకం. ముందు నా వందరూపాయలూ ఆక్కడపెట్టు.

[నరేంద్రరావు, జగం రత్నానికి చెరోవైపూ నిలబడతారు. రత్నాన్ని మాట్లాడనివ్వకుండా యిద్దరూ చకచకా మాట్లాడేస్తూ వుంటారు.]

నరేం : డబ్బుమాటకేంగాని వెధవడబ్బు! చూడు మిస్టర్ రత్నం! నీవంటి వొడ్డూ పొడవూవున్న మనిషి యిలా వృథాగా పాడైపోతూ వుండడం మాకు నచ్చలేదు.

జగం : నీ నిండు విగ్రహం నాటకరంగంలో అద్భుతంగా రాణిస్తుంది.

నరేం : ఒకపారి సరిగ్గా నీ అంత ఎత్తూ పొడవూ వున్న మనిషి...

జగం : (మధ్యలో అందుకొని) సరిగ్గా నా అంతయెత్తూ పొడవూ వున్న మనిషే!

నరేం : హైద్రాబాద్‌లో ఒక సినిమాహాలు గేటుదగ్గర రోజూ నిలబడుతూ వుండేవాడు.

జగం : అంటే గేటు కీపరన్నమాట.

రత్నం : (కోపంతో) ఏయ్! మర్యాదగా మాట్లాడు.

నరేం : అరే! చెప్పేది పూర్తిగా వినవయ్యాబాబూ!

జగం : ఇదంతా నీ మంచికోసమే చెబుతున్నది.

నరేం : ఇలావుండగా ఒకరోజున ఆ గేటు కీపర్ని ఒక సినిమా ప్రొడ్యూసర్ చూసేశాడు.

జగం : ఒరేయ్ నరేంద్రా! అతడు ప్రొడ్యూసరే కాదు డైరక్టర్ కూడాను.

నరేం : అవును. డైరక్టర్ కూడాను.

జగం : ఆ 'ప్రొడ్యూసర్ - కం - డైరక్టర్' ఆ గేటు కీపర్ని 'రావోయ్ నాతో' అన్నాడు.

నరేం : అతనుకూడా మొదట నీలాగే బిర్ర బిగిసేడు.

జగం : తరవాత వెళ్ళిపోయాడులే.

నరేం : అతనికి మొదట ఒక సినిమాలో మొద్దబ్బాయి వేషం యిచ్చారు. తరవాత సేనాని మాంత్రికుడి వేషం యిచ్చారు.

జగం : ఆ చిన్న గేటుకీపరు యీనాడు వెండి తెర పాలిట పెద్ద విలన్‌అయి కూర్చున్నాడు.

నరేం : చిత్రం ఒక్కంటికి ముప్పైవేలు పుచ్చుకుండి వసూలు చేస్తున్నాడు.

జగం : ఈ రకంగా ఎందుకు జరిగింది?

నరేం : కేవలం దేహసౌష్ఠవం వల్లనే.

జగం : నీవంటి అద్భుతమైన పర్సనాల్టీ వున్న మనిషి నాటకరంగంలో అమోఘంగా రాణిస్తాడు.

నరేం: నాటకరంగం అంటే ఆషామాషీ వ్యవహారం కాదు.

జగం: సినిమారంగానికి యిది మొదటి మెట్టు.

నరేం: కనుక—నీ శ్రేయస్సుకోరి—నిన్ను పెర్మనెంట్ విలన్‌గా బుక్ చేసేశాం. ఇక మాటాడకు.

జగం: (నరేంద్రుడిచేతిలోవున్న సంచి తీసుకొని తెరచి కాగితాలుయిస్తూ) యిదిగో నీపోర్షన్ మాట్లాడకుండా చదివెయ్.

రత్నం: (కొంచెం మెత్తబడి) ముందు డబ్బు యిచ్చేస్తే తరవాత వేషంసంగతి ఆలోచిస్తాను.

జగం: (తేలిగ్గా) అచ్చే డబ్బుకేముంది?

నరేం: రేపు మనం వేసేనాటకానికి ఐదువందల రూపాయలు తేలిగ్గా కలక్షనౌతుంది.

జగం: అది బాక్సాఫీసుహిట్ అయితీరుతుంది

నరేం: నువ్వే కేష్ పెట్టెదగ్గర కూర్చోవచ్చు.

జగం: వసూలయిన సొమ్ములోనుంచి వంద రూపాయలు నువ్వే పట్టుకుపో.

నరేం: (అమాంతంగా రత్నం గెడ్డం పట్టుకొని) బాబ్బాబు! ఇక నామాటకు యెదురు చెప్పకు) పోర్షన్ చదివెయ్.

జగం: నువ్వు పేరు తెమ్ముకో! మాకు పేరు తీసుకురా!

రత్నం: (మొహమాటపడుతూ) నేను వేషానికి నప్పుతానంటారా?

నరేం: అత్యద్భుతంగా నప్పుతావు.

జగం: ఇప్పుడే రిహార్సల్సులో నిన్ను టెస్ట్ చేస్తాం.

నరేం: వెంటనే రిజల్టు చెప్పేస్తాం.

జగం: మా నటరాజుగారు రాగానే రిహార్సల్సు మొదలు పెట్టేస్తాం.

వెంక: (యింతవరకూ ఆశ్చర్యంతో ముగురికేసీ చూస్తూ వున్నవాడు—యిప్పుడు కొంచెం వూపిరి పీల్చుకొని నరేంద్రరావును జగాన్ని సమీపిస్తాడు) అయ్యా! మీరు నాటక మండలివారని తెలుస్తోంది. మా శ్యామసుందరం అలా పైకి వెళ్లేడు. యిప్పుడే తిరిగి...

జగం: పైకి అనగా సినిమారంగంలోకి కాదుకదా?

నరేం: సరిగ్గా నాటకరంగం నెత్తిమీదే సినిమా రంగం వుంది.

వెంక: వూళ్లోకి వెళ్ళాడు. అతను తిరిగి వచ్చేవరకూ మీకేం కావలిసినా నన్ను అడగండి.

నరేం: ఇంతవరకూ 'మీకేం కావాలి?' అని అడిగిన వాడు ఒక్కడు లేడనుకోండి.

జగం: ఈనాటికైనా మీరు అడిగినందుకు సంతోషిస్తున్నాం.

నరేం: వెంటనే మూడు కప్పుల కాఫీ తెప్పించండి.

వెంక: మావాడు అందుకే వెళ్ళేడు వూళ్ళోకి.

జగం: ఈలోపున రెండు మంచినీళ్ల చుక్కలైనా యిప్పించండి.

[వెంకటప్పయ్య ఎడమవైపువెళ్ళి రెండు గ్లాసులతో మంచినీళ్ళు తీసుకవచ్చి యిద్దరికీ యిస్తాడు. ఇద్దరూ మంచినీళ్ళుతాగి—హాలంతా కలయతిరుగుతూ—పరిశీలించిచూస్తూ వుంటారు. రత్నం పోర్షన్ చదువుతూ వుంటాడు.]

నరేం: (ఒక రంగుడబ్బా పట్టుకొని) ఒరేయ్ జగం! యిందులో నీలిరంగువుంటే చూడ్డా! మనక్కావాలి.

జగం: (మూతలాగి చూసి) అబ్బే! మూతరావటం లేదురా. నువ్వు పట్టుకో. నేను మూత లాగుతాను.

నరేం: (టేబిలుమీద డబ్బాపెట్టి గట్టిగా రెండు చేతులతో పట్టుకొని) ఊఁ! యీసారి లాగు!

జగం: (మూత తియ్యడానికి ప్రయత్నిస్తూ) సరిగా పట్టుకోరా!

[జగం బలవంతంగా రంగుడబ్బామూత లాగేస్తాడు. డబ్బాలోవున్న నీలిరంగు యిద్దరిమీదా చెదిరిపడుతుంది.]

జగం: (కోపంతో) ఏడిచినట్టేవుంది. వెధవ పట్టుకోవడం నువ్వూను.

నరేం: 'టగ్గాఫ్ వార్' లాగినట్టు మూతలాగితే యేమౌతుంది?

జగం: (వెంకటప్పయ్యతో) ఏమండోయ్. ఒక కిరసనాయిలుసీసా, రెండు గుడ్డపేలికలూ అందుకోండి.

రత్నం: (చదువుతూ) "దురాత్ముడా! యెంత పని చేశావు?"

నరేం } జగం } (అటుతిరిగి) ఓహో పోర్షన్ చదువుతున్నావా? చదువమ్మా చదువు! బాగుపడే వాళ్ళ లక్షణం అదే.

[వెంకటప్పయ్య యెడమవైపు వెళతాడు. కుడివైపునుంచి నటరాజు, శ్యామసుందరం మాట్లాడుకుంటూ వస్తారు.]

నటరాజు: సరిగ్గా నా ఉద్దేశం అదే! మనం ఉభయులం కలిసిననాడు అద్భుతాలు చేసి చూపిస్తాం.

శ్యాము: మన కార్యక్రమంకూడా యిప్పుడే తయారు చేద్దాం.

నట: అబ్బే! అదెంతపని! (నరేంద్రరావును జగాన్ని చూసి) అదేమిటి? ఒంటినిండా రంగు జల్లుకున్నారెందుకు?

నరేం: (తొందరపడుతూ) ఏ......ఏంలేదండి-మూత లాగితే నా మీద పడింది.

జగం : (వెంటనే అందుకొని) పీజే డబ్బా వొదిలేశారండి.

నరేం : (కోపంతో) నువ్వు 'ఉడుం పట్టు' పట్టేలాగితే వొదిలెయ్యక ఛస్తానా?

జగం : అసలు నువ్వు పట్టుకొనడమే తప్పు.

వెంక : (ఎడమవైపునుంచి అకస్మికంగా ప్రవేశించి) అయ్యా! కిరసనాయిల్ లేదు.

శ్యామ : ఎందుకు?

వెంక : వారు కావాలన్నారు.

శ్యామ : (నటరాజుతో) నటరాజు గారూ! మీ మనుషులలో యెవరినైనా ఒకర్ని మైసూర్ కేఫ్‌కు పంపాలి.

నట : నరేంద్రరావు గారూ! మీ రోకసారి వెళ్ళి వస్తారా?

నరేం : నా వొంటినిండా రంగు వుంది సార్.

నట : జగం గారూ!

జగం : నాకూ అంతేనండి.

నట : మంచి పని చేసుకు కూర్చున్నారు. ఇప్పుడు యెవరు వెళతారు పైకి?

నరేం: దానికేం ఫర్వాలేదు లెండి. మన పెర్మనెంట్ విలన్ మిస్టర్ రత్నం వున్నాడు.

జగం: రత్నం! బాబ్బాబు! మా పరువు నిలబెట్టు.

రత్నం : అదెంత పని! వెళ్ళొస్తాను.

శ్యామ : (కాగితం జేబులోంచి తీసియిస్తూ) యీ చీటి చూపిస్తే పెద్ద ఫ్లాస్కుతో కాఫీ యిస్తారు. తీసుకురా.

[రత్నం కుడివైపు నిష్క్రమిస్తాడు. శ్యామసుందరం నటరాజు చెరో కుర్చీమీద కూర్చుంటారు. నరేంద్రరావు, జగం, వెంకటప్పయ్య వరసగా బల్లమీద కూర్చుంటారు.]

నట : ఇకముందు మనం చెయ్యవలసిన పని యేమిటంటే...

శ్యామ : (మధ్యలో అందుకొని) ఒక ముఖ్యవిషయం మరిచిపోయాను. (వెంకటప్పయ్యను చూపిస్తూ) యితను నా బాల్య స్నేహితుడు వెంకటప్పయ్య. గొప్ప గాయకుడు.

[వెంకటప్పయ్య లేచి నటరాజుకు నమస్కరిస్తాడు.]

నట : (తిరిగి నమస్కరించి) చాలా సంతోషం! వెంకటప్పయ్య గారూ! మీరు కూడా మాతో సహకరిస్తే మేం అద్భుతాలు సాధిస్తాం. మీరు ఈ వూళ్ళోనే వుంటారా?

వెంక : కొన్నాళ్ళపాటు వుందామనుకుంటున్నానండి.

నట : తప్పకుండా వుండండి. మీరు యిదివరకు నాటకాలలో వేషాలు వేశారా?

వెంక : ఆఁ! వేశానండి.

శ్యామ : మేం హైస్కూల్లో చదివేటప్పుడు ప్రతి వార్షికోత్సవానికి వీడు నాటకం వేస్తూనే వుండేవాడు. చాలా బాగా పాడతాడు. ఒకసారి వింటే మీకే తెలుస్తుంది.

నట : యేదో! ఒక పద్యం చదవండి చూద్దాం.

వెంక : (ఒకసారి గొంతు సవరించుకొని) చిలకమర్తి వారినాటకం లోనుంచి ఒకపద్యం చదువుతాను. (రాగంతీసి పద్యం చదువుతూవుంటాడు. జగం హార్మోనియం వాయిస్తూ వుంటాడు.)

"అల్లుడా రమ్మని ఆదరమ్మున బిల్వ
బంపు మామను బట్టి చంపగలమే..."

[బిగ్గరగా రాగంతీస్తూవుండగా శ్యామసుందరం అకస్మికంగా లేచి అతనిముందుకు తొందరగా వస్తాడు.]

శ్యామ : ఒకేయ్‌బాబూ! అంతగట్టిగా రాగంతీస్తే మనల్ని యిల్లు ఖాళీచేయించేస్తారు. ఫస్టు ఫ్లోర్ లో కుటుంబాలువున్నాయి.

వెంక : యీపద్యం యింతకంటె మెల్లిగా చదవడానికి వీల్లేదు.

జగం : అయితే మరోపద్యం చదవండి.

వెంక : (ఆలోచించి) పానుగంటివారి నాటకంలో నుంచి ఒకపద్యం చదువుతాను. (మొదట నాటక ఫక్కీలో వచనం చదువుతాడు.) ఓ! కాల మహిమ! (జగానికి హార్మోనియం చూపించి సైగచేసి—నెమ్మదిగా పద్యం ప్రారంభిస్తాడు.)

"మొద్దువటు డొక్క పతిలేక ముత్తుకొనగ
వృద్ధునకు నల్వురిల్లాండ్రు వేశ్యకొసరు
నీతిమంతుడు గతిలేక నిందనొంద
బానిసీనికి ద్రోహికి బ్రహ్మరథము."

[అందరూ చప్పట్లుకొడతారు.]

నట : (ప్రశంసిస్తూ) చాలాచక్కగా చదివారు.

నరేం : మీకంఠం చాలాబాగుంది.

జగం : మానాటకం కంపెనీకి నేపథ్యగాయకుడు లేక మేం చాలాయిబ్బంది పడుతున్నాం.

నట : నేటినుంచి సంగీతశాఖ మీకు అప్పగిస్తున్నాం. (కుడివైపునుంచి ఫ్లాస్కు తీసుకొని రత్నం వస్తాడు. శ్యామసుందరం ఫ్లాస్కు అందుకొని, వెంకటప్పయ్యనుకూడా రమ్మని సైగచేస్తాడు. ఇద్దరూ ఫ్లాస్కుతో యెడమవైపు వెళ్ళి పోతారు. వెంకటప్పయ్య గ్లాసుతో కాఫీతీసుకొనివచ్చి ఒక్కొక్కరికీ యిచ్చి ఎడమవైపు వెళుతూవుంటాడు. తరవాత వెంకటప్పయ్య, శ్యాం చెరోగ్లాసుతో కాఫీ తెచ్చుకొని కూర్చుంటారు.)

శ్యాం : ఇది మన పట్టణచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలసిన రోజు.

నట : (లేచినిలబడి) నేను యిప్పుడు నాటక రంగం గురించి, మన నాటకమండలి గురించి కొన్ని మాటలు చెప్పవలసివుంది. మన నాటకమండలి స్థాపించి పది సంవత్సరాలైనది.

నరేం : (మధ్యలో అందుకొని) అయితేమాత్రం యేం ప్రయోజనమండి? ఒక్క బహుమతైనా సంపాదించలేకపోయాం.

జగం : మనల్ని అందరూ వేళాకోళం చేస్తున్నారండి.

నట : అందుకు కారణం—మన నటులలో స్థిరత్వం లేక పోవడమే. యివేళ వచ్చిన నటుడు రేపు కనిపించడు.

జగం : (మధ్యలో అందుకొని) కనీసం ఒక నాటకంలో వేషం వేస్తేచాలు, ఉత్తమ నటుడని మీరు పొగుడుతారు.

నరేం : అతిగాడు వెంటనే నెత్తెక్కి కూర్చుంటాడు.

జగం : ఇకవాణ్ణి అందుకోవడం— ధస్తే— మనతరం కాదు.

నట : మీరు అపార్థం చేసుకుంటున్నారు. ప్రోత్సహించడం అవసరమని— నేను కొందర్ని పొగుడుతున్న మాట వాస్తవమే,—సరే, యిక నా ఉపన్యాసం కొనసాగిస్తాను—అసలైన యిబ్బందులను మనం యెదుర్కొవలసివచ్చింది. మనకు హీరోయిన్ గా నటిస్తూ వచ్చిన సుందరమ్మ...

నరేం : (మధ్యలో అందుకొని) ఆవిడ పేరు యిప్పుడు సుందరమ్మ కాదండి.

జగం : మిస్. తారాకుమారి అయి మన నెత్తిమీద కూర్చుందిప్పుడు.

నట : ఆవిడ సినిమారంగంలోకి వెళ్ళి పోయింది.

నరేం : ఆవిడ స్వయంగా వెళ్ళి పోలేదు సార్. నరసింహంగాడు ఆవిణ్ణి తీసుకుపోయాడు.

నట : సరే, యేదో విధంగా ఆవిడ వెళ్ళిపోవడం జరిగింది. అప్పటినుంచీ మనకు స్త్రీపాత్రధారిణి లేకపోవడం పెద్ద లోటుగా వుంది.

జగం : అంతా యింతా లోటు కాదు.

నరేం : ఆడవాళ్ళు లేకపోతే అసలు ఉత్సాహమే చచ్చిపోతుంది. 'మహాషా' యేమన్నాడో తెలుసా? సైనిక దళంలో బ్యాండును తీసెయ్యమన్నాడు. కత్తులు, తుపాకులు అన్నీ తీసి పారేసి—ఒకే ఒక్క సుందరాంగిని—వుంచితే చాలన్నాడు. సైనికులు 'వండర్స్' చేసి చూపిస్తారని చెప్పాడు.

జగం : (ప్రశంసిస్తూ) ఓహోహో! మహానుభావుడు,! ఏం మాట చెప్పేడ్రా!!

నట : ఇక మన భవిష్యత్కార్యక్రమం గురించి రెండుమాటలు చెప్పి ముగిస్తాను. సుప్రసిద్ధ చిత్రలేఖకులైన శ్రీ శ్యామసుందరంగారితో మనకిప్పుడు పరిచయం కలిగింది. వారిని మనం సద్వినియోగం చేసుకోవలసి వుంది. కనక నేటి నుంచి శ్యామసుందరం గారిని మన నాటక మండలికి ఆర్టు డైరక్టరుగా నియమిస్తున్నాను.

నరేం, జగం : (చప్పట్లు కొట్టి) అద్భుతమైన ఆలోచన! కళాదర్శకులుగా వుండతగినవారు.

నట : ఇక గాయక శిరోమణి వెంకటప్పయ్యగారు వున్నారు. వారి కంఠ మాధుర్యాన్ని మీరంతా చవిచూసే వున్నారు. నేటి నుంచి వారు సంగీత దర్శకులుగాను, నేపథ్య గాయకులుగాను వుంటారు.

[నరేంద్రరావు, జగం, రత్నం చప్పట్లు కొడతారు.]

జగం : నాకు ఈసారి అశాలేఖ కనిపిస్తోంది.

నరేం : నాకు బ్రహ్మాండమైన ఆశాజ్యోతి కనిపిస్తోంది.

నట : మరో విషయం కూడా చెబుతున్నాను. ఏ నటుడైనా నాటకం రోజున రాలేకపోవచ్చు. మన మండలి నిబంధనల ప్రకారం కళాశాఖలను నిర్వహిస్తున్నవారు ఆ వేషం వెయ్యడానికి సిద్ధంగా వుండాలి

వెంక : నే నందుకు పూర్తిగా అంగీకరిస్తున్నాను.

శ్యామ : నేనెప్పుడూ నాటకంలో వేషం వెయ్యలేదు.

నరేం : మీకేమీ భయంలేదు. ఒకసారి ఏం జరిగిందో తెలుసా? ధృతరాష్ట్రుడిపాత్రధారి దగాచేశాడు.

జగం : అప్పుడు మా నటరాజగారు యేం చేశారో తెలిసిందా?

నరేం : చుట్టూ చూశారు.

జగం : ఖాళీగా ఒక మనిషికూడా కనపడలేదు.

నరేం : తెర యెత్తే సుబ్బయ్యగాణ్ణి పట్టుకున్నారు.

జగం : వాడు 'హాలో లక్ష్మణా!' అని మొత్తుకున్నాడు.

నరేం : మేం ఒప్పుకోలేదు. తెరలెత్తే సుబ్బయ్యను క్షణంలో ధృతరాష్ట్రుడుగా మార్చేశాం.

నట : ఇక మనం ఈ శుభముహూర్తంలోనే రిహార్సల్సు కూడా ప్రారంభిద్దాం.

నరేం : అదే మేమూ అనుకుంటున్నాముండి.

నట : అన్నీ సర్దండి.

వెంక : మనం ఇప్పుడు వెయ్యబోయే నాటకం ఏమిటో నాటక రచయిత యెవరో ముందు చెప్పండి.

జగం : మనం వేసే నాటకం పేరు "చీకటి దారి."

నరేం : విషాదంలోనుంచి వినోదాన్ని సృష్టించే దినకరరావుగారి రచన ఇది.

నట : ఇక కానివ్వండి.

జగం : ముందు పాత్రలను, పాత్రధారులను కేటాయించండి.

నట : నరేంద్రరావు హీరో, ప్రస్తుతం నాయిక పాత్రధారిణి లేదు. రెండు రోజుల్లో యెక్కడైనా కిరాయికి కుదుర్చుకువద్దాం.

నరేం : ఆ సీన్ వదిలేసి తరవాతి సీన్ రిహార్సల్సు చేద్దాం.

జగం : శ్యామసుందరంగారూ! ఒక బ్లూలైట్ వుంచి మిగిలిన దీపాలు ఆరిపెయ్యండి.

(జగం ఒక మూల కూర్చుని హార్మోనియం వాయిస్తూ వుంటాడు. రత్నం, నటరాజు కుడివైపు—శ్యామసుందరం, నరేంద్రరావు, వెంకటప్పయ్య ఎడమవైపు వెళతారు.)

నరేం : (ఎడమ చివర కనిపించి) ఒరేయ్ జగం! ప్రేయసీ ప్రియుల మధ్య డ్యూయెట్‌తో రంగం ప్రారంభమవుతుంది. ఊఁ! లాగించు. (లోనికి వెళ్లిపోతాడు. హాలులో దీపాలన్నీ ఒక్కసారి ఆరిపోతాయి. నీలికాంతి హాలులో ప్రసరిస్తుంది)

నేపథ్యంలో : (ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచి) అరణ్యాల చిమ్మచీకటిలో పయనించే ఓ మనిషీ!— అయిదు నిముషాలు ఆగు. నీముందేమున్నదో చూడు. వెర్రివాడా! యెంతకాలం యీ స్వప్నసీమలో విహరిస్తావు? నీ జీవితం కాలసర్పంలా నీమీదే యెదురు తిరిగింది. నీవు యెక్కడో వున్న శిఖరంనుంచి జారిపడక తప్పదు. వెంటనే జీవితంతో రాజీపడు. నువ్వు నిర్మించుకున్న స్వప్న సౌధంలోనుంచి బయటపడరా! (క్షణం ఆగి) రావూ?....రావూ?...సరే? ఫలితం నువ్వే అనుభవిస్తావు.

[అవ్యక్తంగా ఒక్కసారి యెడమవైపునుంచి యుగళ గీతం వినిపిస్తుంది.]

నేపథ్యంలో : (పాట) నీకూ నీవారులేరు నాకూ నావారు లేరు

ఏటిఒడ్డునా యిల్లు కడదాం పదరా,
చల్ మోహనరంగా
ఏరువస్తే యెగిరిపోదాం పదరా!
నీకు నాకు జోడు అయితే
మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదాం పదరా ||చల్||

[కుడివైపునుంచి తొందరగా రత్నం ప్రవేశిస్తాడు. అంటించిన బొద్దుమీసం సవరించుకుంటూ వుంటాడు.]

రత్నం : (వస్తూనే బిగ్గరగా) దుర్మార్గుడా! యెంత పని చేశావు!

నరేం : (అమాంతంగా ఎడమవైపునుంచి వచ్చి) తప్పు నాదే, క్షమించండి.

రత్నం : నాకళ్లు మూద్దామనుకున్నావా?

నరేం: (బాధతో) లేదు... లేదు...

రత్నం: నా కూతుర్ని మాయచేసి—నా ఆస్తి కాజేద్దామని చూస్తున్నావా?

నరేం: (కోపంతో) ప్రేమకూ ఆస్తికీ సంబంధం లేదు.

రత్నం: ఈ యింటిలో అడుగు పెట్టవద్దని నీకన్ని సార్లు చెప్పేను?

నరేం: అవును. చెప్పేరు.

రత్నం: ఇప్పుడు నువ్వు రావడానికి కారణం?

నరేం: నా పవిత్రమైన ప్రేమను తెలియబరచడానికి.

రత్నం: (సమాధానంగా) నరేంద్రా! వృథాగా చెడు దారిని పడకు. నా మర్యాదను నాశనం చెయ్యకు. ఈవూరు విడిచిపెట్టి యెక్కడి కయినా వెళ్ళిపో! (జేబులోంచి పంచితీసి యిస్తూ) యిదిగో! ఐదువందల రూపాయలు, యీ డబ్బుతీసుకొని వెంటనే వెళ్ళిపో.

నరేం: (దెబ్బ తిన్నట్లు) ఆ! యేమంటున్నారూ! నే నంతటి చౌకబారు మనిషి ననుకున్నారా? (దృఢ నిశ్చయంతో) అమ్మజాలను. వెలలేని నా ప్రేమను అమ్మజాలను.

రత్నం: (కోపావేశంతో పంచి తిరిగి జేబులో పెట్టుకుని) పో! ముందు నా కొంపలోంచి బయటకు పో! యీ గుమ్మంలో తిరిగి అడుగుపెట్టేవా—యిక దండోపాయం తప్పదు. జ్ఞాపకం వుంచుకో!

[రత్నం కుడివైపు నిష్క్రమిస్తాడు. నరేంద్రరావు తల రెండు చేతులతో పట్టుకొని బల్లమీద కూలబడతాడు. నేపథ్యంలోనుంచి "హా! హతవిధీ..." అని బిగ్గరగా రాగం వినిపించి ఆగిపోతుంది. ఎడమవైపునుంచి శ్యాం ప్రవేశిస్తాడు. అతని చేతిలో కాగితాలు వుంటాయి. మధ్య మధ్య పోర్షన్ చూస్తూవుంటాడు.]

శ్యాం: నరేంద్రా! అలా కూలబడి పోయావేం?

నరేం: నా స్వప్న సౌధాలు నిలువునా కూలిపోయాయి.

శ్యాం: లాటరీలో డబ్బు పోయిందా?

నరేం: లేదు.

శ్యాం: గుఱ్ఱప్పందాలలో ఓడిపోయావా?

నరేం: ఊహుఁ అది కాదు.

శ్యాం: (బతిమాలుతూ) విచారించకురా! నీ ప్రాణమిత్రుడికి కారణం చెప్పు.

నరేం: (చెప్పలేక చెప్పలేక) ఇం...ది...ర.

శ్యాం: (ఆత్రుతతో) యేం? ఇందిర కేమయ్యింది?

నరేం: (విషాదంతో) వాళ్ళ నాన్న నన్ను రావద్దన్నాడు.

శ్యాం: అదేం?

నరేం: (ఆవేశంతో) ఆమెతో మాట్లాడవద్దన్నాడు. నా ప్రేమను చంపుకోమన్నాడు. మళ్లా మాటాడితే ఐదు వందలకు అమ్ముకోమన్నాడు.

శ్యాం: (ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిచేసి) ఐదు వందల రూపాయలనే!

నరేం: అవును

శ్యాం: మరి నువ్వు తీసుకోలేదా?

నరేం: (కోపంతో) నువ్వుకూడా నా ప్రేమకు విలువ కడుతున్నావా?

శ్యాం: నామాట విను. డబ్బు తీసుకో. బాగుపడు. ఈ రోజులలో డబ్బుకు వున్న విలువా గౌరవం దేనికీ లేవు.

నరేం: (నిస్పృహతో) శ్యాం! నీ దారిని నువ్వు వెళ్లిపో! నన్ను వృథాగా బాధపెట్టకు. ఆశారేఖ నా కళ్ళకు మిరుమిట్లు గొల్పి మాయమయ్యింది. యీ చీకటిదారిలో—శాపగ్రస్తుడిలా—ఒంటరిగా మిగిలాను.

శ్యాం: భయపడకు. లేచి ధైర్యంగా ముందుకు నడు.

నరేం: ఈ ఘోరవిషాదాన్ని నేను భరించలేను. యీ భయంకరమైన యెడబాటు తలచుకుంటే... (మాట్లాడలేక) అబ్బ!...రిక్షాక్రింద పడిచావడమొకటే దారి.

శ్యాం: (వెంటనే) కట్! కట్! (నేపథ్యంలోకి చూస్తూ) అయ్యా, నటరాజుగారూ! అచ్చు తప్పు!

నట: (కుడివైపునుంచి తొందరగా ప్రవేశించి) యేమిటి తప్పు?

శ్యాం: (నరేంద్రుణ్ణిచూపించి) ఇతగాడు రిక్షాక్రింద పడిచస్తానంటున్నాడు. మనిషి రిక్షాక్రింద పడి యెంత కొట్టుకున్నా చావడు. యే కాలో, చెయ్యో కొట్టుకుపోవచ్చు.

నట: అవును. అది తప్పే! (నరేంద్రరావుతో) యేదీ, మీరు రాసుకున్న పోర్షన్ చూపించండి.

నరేం: (జేబులోంచి కాగితాలుతీసి) దీనిలో అక్కడి మాట చిరిగిపోయింది సార్ "...క్రిందపడి" అని వుంది. ఆ ఖాళీ నేను స్వయంగా పూర్తి చేసుకున్నాను.

జగం: ఖాళీ పూర్తి చెయ్యడానికి యిదేమైనా పజిల్ అనుకున్నావట్రా పోదరా!

శ్యాం: (నటరాజుతో) పుస్తకం చూడండి.

నట: (పుస్తకం తెరిచి) "రైలు క్రిందపడి చావడ మొక్కటే దారి" అని వుంది. నరేంద్రరావుగారూ! అక్కడ తప్పుదిద్దుకోండి. స్వంత కవిత్వం పెట్టవద్దయ్యా మహానుభావా అని మీ కనేకసార్లు చెప్పేను.

శ్యాం: అటువంటి పనిచేస్తే అతుకు వేసినట్లు పబ్లిగ్గా తెలుస్తూనే వుంటుంది.

నట: ఊఁ! యిక కంటిన్యూ చెయ్యండి. (కుడివైపు వెళ్ళిపోతాడు)

నరేం: (తిరిగి విషాదంతో బల్లమీద కూలబడి) యీ భయంకరమైన పొరపాటు తలచుకుంటే!... (దుఃఖంతో) అబ్బ!... రైలు క్రిందపడి చావడ మొక్కటేదారి.

శ్యాం: నరేంద్రా! నీలోని నిస్పృహను పారద్రోలు. నీ చుట్టూవున్న రమణీయమైన ప్రకృతిని చూసి సంతోషించు. "బ్రతుకు కలిగె నేని భార్య కలుగు" అన్నాడు మహాకవి.

నరేం: వీల్లేదు. ఇందిర నా జీవితానికి జ్యోతి. ఆమెను మరువలేను.

శ్యాం: ఛీ! విచారించకు నాతో రా! నేటి నవనాగరికతా ప్రపంచంలో డబ్బులేని మనిషి జీవచ్ఛవం. డబ్బుతో ఆనందాన్ని, శాంతినీ అన్నిటినీ కొనుక్కోవచ్చు... నాతో రా! ఇందిర తండ్రిని కలుసుకుందాం.

నరేం: (ఆశ్చర్యంతో) ఎందుకు?

శ్యాం: ఐదువందల రూపాయలకోసం.

నరేం: (కోపంతో) నీ ఉద్దేశం?

శ్యాం: (రహస్యంగా) వనితా విత్తం రెండూ దక్కే ఉపాయం నేను చెబుతాను. మాట్లాడకుండా నాతో రా!

నరేం: (సంతోషంతో) నిజమేనా?

శ్యాం: (విసుగ్గా) మాట్లాడకు. రా! నాతో!

(ముందు శ్యాం, వెనుక నరేంద్రుడు అడుగులలో అడుగులు వేస్తూ మెల్లిగా ముందుకు నడుస్తూ వుంటారు. రత్నం కుడివైపునుంచి ఆకస్మికంగా వస్తాడు)

రత్నం: (వస్తూనే బిగ్గరగా) ఎవరక్కడ?

నరేం: (భయంతో శ్యాంను గట్టిగా పట్టుకొని) బాబోయ్, వస్తున్నాడ్రా!

శ్యాం: మరేం భయంలేదు. ధైర్యంగా జవాబు చెప్పు.

నరేం: (జడుస్తూ జడుస్తూ రత్నం ముందుకువచ్చి) నేను... నే నే...

రత్నం: (బిగ్గరగా) ఎందుకు వచ్చావ్?

నరేం: (వెనక్కి దూకి) వి...వీడేనండి.

రత్నం: (ముందుకువచ్చి) నిన్ను యీవూరు వదిలిపెట్టి పొమ్మనలేదా?

శ్యాం: (ముందుకువచ్చి) అవును. వీరు పొమ్మన్నారు. వూరు వదిలిపెట్టిపోవడం తేలిక కాదు. (నరేంద్రుణ్ణి చూపిస్తూ) యీ...నా స్నేహితుడు వూళ్ళోవున్న అప్పులన్నీ తీర్చుకోవాలి. అందుకు డబ్బు కావాలి. దూరంగా పోవాలంటే ట్రైనెక్కాలి. ట్రైన్ యెక్కేందుకు టిక్కెట్ కావాలి. టిక్కెట్ కావాలంటే డబ్బుకావాలి.

రత్నం: నేను మొదటే డబ్బుయివ్వబోయాను. అతను నిరాకరించాడు. ఇప్పుడైనా మించిపోయింది లేదు, డబ్బుయివ్వడానికి నేను సిద్ధంగా వున్నాను.

[జేబులోంచి సంచితీసి నరేంద్రరావుతో) ఒక షరతు!

జోగయ్య: (నేపథ్యంలో బిగ్గరగా) వీల్లేదు. డబ్బు వసూలు చెయ్యనిదే నేను కదల్ను.

రత్నం: నరేంద్రా! నువ్వీవూరు విడిచి వెంటనే పోవాలి. యిదిగో! ఐదువందలు.

[రత్నం నరేంద్రరావుకు సంచి యివ్వబోతూ వుంటాడు. కుడివైపునుంచి ధూకుడుగా జోగయ్య వస్తాడు. వయస్సు 50 సంవత్సరాలు. అతని వెనుక నటరాజు వస్తాడు.[

జోగయ్య: (ప్రవేశిస్తూనే కోపంతో) ఒకటే రెండూ వాయిదాలా? సంవత్సరంనుంచి తిరగలేక ప్రాణాలు పోతున్నై.

రత్నం: (జోగయ్యను చూడగానే హడలిపోయి చేతిలోని సంచి (క్రింద పడిలేసి) పె... పెదనాన్నా...

జోగ: (రత్నాన్ని గుర్తించి) హరి దౌర్భాగ్యుడా! బాకీ పనులు చేసుకు రమ్మంటే యిక్కడ వేషం కట్టేవా? (మీదికివెళ్ళి) ముందా వేషం తీసెయ్.

రత్నం: (వేషం తీసేసి) పెదనాన్నా... (యేదో చెప్పబోయాడు.)

జోగ: నోర్ముయ్. (క్రిందవున్న సంచి చూపిస్తూ) తియ్. ఆ సంచిమూతి తియ్. నువ్వు పనులు చేసిన డబ్బు అదేనా?

రత్నం: (సంచితీసి భయంతో) కా... కాదు.

నట: జోగయ్యగారూ! మీరు తొందర పడకండి. మేం పది రోజుల్లో నాటకం వేస్తున్నాం.

నరేం: (ముందుకువచ్చి) సదరు నాటకం వల్ల వచ్చిన వికరాదాయంతో...

జగం: (హార్మోనియం భుజానికి తగిలించుకొని అమాంతంగా ముందుకు వచ్చి) పాత బకాయిలన్నీ తీర్చేస్తున్నాం.

నట: దయచేసి మరో పదిరోజులు ఓపికపట్టండి.

జోగ: ఆ రోజులూ—ఆ మర్యాదలూ—ఆ వాయిదాలు అన్నీ దాటిపోయాయి. యిక మాట్లాడకుండా వంద రూపాయలూ అక్కడ పెట్టండి.

నరేం: వందరూపాయలు కాదుకదా కప్పు కాఫీకి కూడా మా దగ్గర డబ్బులేదు.

జగం: ఒక్క వాయిదాకు ఒప్పుకోండి.

జోగ: నేను వచ్చేముందు ఏనువందలంటున్నా రేమిటి?

రత్నం: (తన చేతిలోని సంచియిస్తూ) యిదిగో పెదనాన్నా!

నరేం: (జోగయ్య సంచి తీసుకుంటూవుండగా అతనికి అడ్డువచ్చి) బాబ్బాబు! యీ సంచి వదిలెయ్యండి.

జగం: మీరీ సంచి పట్టుకుపోతే మా నాటకం అంతా తిరగబడి పోతుంది.

జోగ: (సంచి లాక్కుని) ఓహో! డబ్బు దాచుకొని నన్ను తిప్పుతున్నారన్నమాట!

నరేం: అమ్మమ్మ! ఎంతమాట! ఎంతమాట!

జగం: బాబ్బాబు! అందులో రొంతో డబ్బు లేదుసార్.

నరేం: అది నాటకంకోసం తయారుచేసిన నయాపైసల సంచిసార్!

జగం: ఆ నయాపైసలన్నీ కలిపి టోటల్ ఐదణాలుసార్.

నట: (ఒక నిట్టూర్పు విడిచి) మా దగ్గర డబ్బువుంటే మిమ్మల్ని యిలా రొంగుకు తిప్పుతాం చెప్పండి?

జోగ: (సంచి విడిచిపెట్టి) మీ కెన్ని చెప్పండి. లాభంలేదు. తిరిగి తిరిగి అలిసిపోయాం. మీరు తల తాకట్టు పెట్టయినా నా డబ్బు నాకు తక్షణం తెచ్చి యివ్వాలి.

నరేం: ఒరేయ్ జగం! తల తాకట్టు పెట్టడం అంటే నా కిప్పుడు ఒకటి జ్ఞాపకం వచ్చింది. (క్షణం ఆగుతాడు.)

జగం: చెప్పెయ్. యింకెందుకు సస్పెన్సు?

నరేం: హరిశ్చంద్ర మహారాజు అంతటివాడే అప్పులు తీర్చడానికి పెళ్ళాం బిడ్డల్ని అమ్మేశాడు.

జగం: అంతేకాదు. తననుతాను తెగనమ్ముకున్నాడు.

నరేం: కనుక అప్పులు తీర్చడానికి మనుషుల్ని అమ్మడం మన ప్రాచీన సంప్రదాయం.

జగం: అవును. అది నేనూ ఒప్పుకున్నాను.

నరేం: కనుక మనం బాకీ తీర్చేవరకూ నువ్వు జోగయ్యగారితో వెళ్ళరా.

జోగ: (కోపంతో) ఎక్కడి మనుషులయ్యా మీరు? గుక్క తిప్పుకోకుండా మాట్లాడేస్తున్నారు. ఇదేం వెక్కిరింతలనుకున్నారా? వ్యవహారం అనుకున్నారా?

నట: (ప్రార్థనా పూర్వకంగా) జోగయ్యగారూ! యీ ఒక్క సారికీ మా మర్యాద నిలబెట్టండి.

జోగ: వీల్లేదు. డబ్బిచ్చేవరకూ యేదైనా వస్తువు తాకట్టు పెట్టండి. అప్పుడు మా చుట్టూ మీరే తిరగవచ్చు.

నట: మా దగ్గర ప్రస్తుతం ఒక పెట్రోమాక్సులైటు మాత్రం వుంది.

జగం: (వెంటనే పెట్రోమాక్సులైట్ తీసుకువచ్చి) కావాలంటే యిది మీరు పట్టుకుపోవచ్చు.

నరేం: గాలి కొట్టేటప్పుడు కొంచెం జాగ్రత్త సార్! మంట రాగలదు!

జోగ: ఇది ఒకటే చాలదు. హార్మోనీపెట్టెకూడా యివ్వండి.

జగం: ఇవ్వలేను—యివ్వలేను.

నరేం: అది లేకపోతే (జగాన్ని చూపిస్తూ) యీ జగమేమాయ!

జగం: (హార్మోనియమును గట్టిగా పట్టుకొని) ఇది నాకు అర్ధాంగివంటిది.

జోగ: నటరాజుగారూ! మాట్లాడరేం? ఇది కూడా యిస్తే మేం వెళ్ళిపోతాం. మీరు డబ్బుయిచ్చి తీసుకు వెళ్ళొచ్చు.

నట: (బరువుగా) సరే! అలాగే కానివ్వండి.

జోగ: (జగంతో) లేవయ్యా! ఆ హార్మోనీపెట్టె యిలాగియ్యి.

జగం: మాంత్రికుడి పంచప్రాణాలు ఒక చిలుకలో వున్నాయట!

నరేం: అలాగే వీడి ప్రాణం హార్మోనియంలోవుంది.

జగం: (బతిమాలుతూ) బాబ్బాబు! దీన్ని నానుంచి దూరం చెయ్యకండి.

జోగ: ఓహోహో! వేళాకోళంగా వుందీ? (రత్నంతో) పోత విగ్రహంలా అలా చూస్తావేరా? లాక్కో! ఆ హార్మోనీపెట్టె లాక్కురా!

రత్నం: (ముందుకువచ్చి) ఏమయ్యోయ్! అది మర్యాదగా అక్కడ పెడతావా? నన్ను పెట్టించమంటావా? (లాక్కో చేతులు పైకెత్తుతాడు.)

జగం: (బిగ్గరగా) అయ్యా! వెంకటప్పయ్యా! నేపథ్యంలోంచి యివతలకు రావయ్యా!

నరేం: కొంపలు మునుగుతుంటే లోపలి నుంచి కదలవేమయ్యా?

వెంక: (ప్రవేశించి) ఏ పాటపాడమని సెలవు?

జగం: అరున్నరలో...ఛీ! (హార్మోనియంవాయిస్తూ వుంటాడు.)

జోగ: (రత్నాన్ని వీపుమీద ఒకటి చరచి) తాటి చెట్టులా నిలబడి పోయావేం! అది వూడదీసుకురా!

రత్నం: (ఒక్క దూకుదూకి జగం చేతిలోని హార్మోనియం లాక్కుంటాడు.)

జోగ: (రత్నంతో) ఆ రెండూ పట్టుకురా!—నటరాజుగారూ! మీకు డబ్బు అందగానే వచ్చి యీ రెండువస్తువులూ విడిపించుకు పోవచ్చు. మరి వస్తాను.

[ముందు జోగయ్య; వెనుక హార్మోనియం, పెట్రోమాక్సు లైటు చెరో చేత్తో పట్టుకొని రత్నం కుడివైపు నిష్క్రమిస్తారు.]

జగం: (విచారంతో) ఈ అవమానం భరించలేను.

నరేం: విచారించకురా సోదరా!

జగం: విచారించక చేసేదేముంది!

నరేం: కష్టాలు అనుభవించిన వాళ్ళకు మంచిరోజులు తప్పకుండా వస్తాయి.

జగం: (నిస్పృహతో) లేదు. నాకా నమ్మకం లేదు.

నరేం: నిరుత్సాహపడకు. నీ లాంటి ఒక చిన్న హార్మోనిస్టు యీనాడు పెద్దసినిమా ప్రొడ్యూసర్ అయి వూరుకున్నాడు. అంతటితో ఆగక ఒక బాక్సా

నీకు హీరోయిన్‌వు భర్తఅయి కూర్చున్నా డిప్పుడు!!

వెంక: అదృష్టమండీ! అదృష్టం!

శ్యాం: విచారించకండి జగంగారూ!

నట : త్వరలో నే విడిపించుకు వద్దాం.

జగం: (నిరుత్సాహంతో) లాభంలేదు. నేను యిక యిక్కడ వుండడంవల్ల ప్రయోజనంలేదు. నటరాజుగారూ యిక నాకు సెలవ్. (ముందుకు నడుస్తూవుంటాడు.)

నట : నా మాట వినండి.

నరేం: (అతనికి అడ్డువచ్చి ఒరేబాబూ! వెళ్ళకురా! నువ్వు లేని యీ నాటకమండలిలో ఒకక్షణం కూడా వుండలేను.

జగం: వీల్లేదు. తప్పుకో.

[జగం కుడివైపు నిష్క్రమిస్తాడు.]

శ్యాం: పాపం! చాలా నిరుత్సాహపడ్డాడు కుర్రాడు.

వెంక: మంచి హార్మోనిస్టును మనం కోల్పోయాం.

నరేం: (విచారంతో) జగం నేనూ కలసి జంటగా యెన్నో కలలు కన్నాం. రకరకాల ఆశలు పెట్టుకున్నాం. గాలిలో మేడలు కట్టుకున్నాం. మా గాలిమేడలు కూలిపోయాయి.

వెంక: విచారించకండి.

నరేం: విచారం! చివరకు మిగిలింది విచారం ఒక్కటే. నాజీవిత సర్వస్వం నాటకరంగం కోసం ధార పోశాను. ఆస్తిని పోగొట్టుకున్నాను. ఉద్యోగం విడిచిపెట్టాను. బ్రహ్మచారిగా దుర్భరమైన జీవితాన్ని సాగించాను. ఫలితం కనిపించలేదు. నా ప్రాణస్నేహితుణ్ణి కూడా యిప్పుడు పోగొట్టుకున్నాను. యిక నేను యిక్కడ వుండడం యెందుకు? నటరాజుగారూ! నాకు కూడా సెలవు యిప్పించండి.

నట : ఇప్పుడు యెక్కడికి వెళతారు?

నరేం : ప్రపంచంమీదికి.

వెంక : ఆగండి. ఖాళీచేతులతో యెలా వెళతారు!

నరేం : నాకు యీ విశాల విశ్వంలో మిగిలినఆస్తి (తన రెండుచేతులూ పైకెత్తి చూపిస్తూ) నా—యీ రెండుచేతులే. కష్టపడి పనిచేసి జీవితం గడుపుతాను. నేటితో యీ కళారంగం నుంచి విరమించుకుంటున్నాను.

నట : తొందరపడకండి.

నరేం : లాభంలేదు. యిక యీ దారిలో ప్రయాణం చెయ్యడం నాతరంకాదు. ఇక నాకు సెలవ్.

[కుడివైపు నిష్క్రమిస్తాడు]

శ్యాం : (నటరాజుతో) వున్న నటులు యిద్దరు కూడా వెళ్ళిపోయారు.

నట : ఫర్వాలేదు. రేపు కొత్తనటుల్ని తీసుకువస్తాను (లేచి) శ్యామసుందరంగారూ! యిక పోయి వస్తాను. రేపు కలుసుకుందాం.

[నటరాజు కుడివైపు నిష్క్రమిస్తాడు.]

వెంక : (హోల్డాలు భుజంమీద వేసుకొని) శ్యాం నేను కూడా పోయివస్తాను.

శ్యాం : (ఆశ్చర్యంతో) ఎక్కడికి?

వెంక : మనవూరు!

శ్యాం : వెళ్ళనన్నావ్?

వెంక : ఇక్కడ అవకష్టాలుపడి బ్రతికేకంటే మని దున్నూరు బ్రతకడమే మంచిదని తోచింది. రోజులు మారేవరకూ కోరికలను హృదయాంతరాళంలో భద్రంగా దాచుకోవాలి. అంతకంటే చేసేదేమీ లేదు. వస్తాను. (ముందుకు వెళుతూ వుంటాడు.)

శ్యాం : రేపుఉదయం వెళ్ళవచ్చు. యిప్పటికి ఆగరా!

వెంక : ఈ చోటు యెంత వేగం విడిచిపెడితే అంత మంచిది. యిక పోయివస్తాను.

[వెంకటప్పయ్య కుడివైపు నిష్క్రమిస్తాడు.]

శ్యాం : (చుట్టూ చూసి ఒకనిట్టూర్పు విడిచి) ఈ స్వప్నసీమలో చివరకు మిగిలినవాణ్ణి నే నేనా!!

[సన్నగా యీలపాట పాడుతూ రంగుడబ్బాలు, కుంచెలు టేబిలుమీద పెడతాడు. సగం వేసిన చిత్రాన్ని చేత్తో పట్టుకొని ఒకసారి పరిశీలనగా చూచి — కుర్చీలో కూర్చుని — కుంచెతో చిత్రాన్ని దిద్దుతూవుంటాడు — తెర.]

# నవభారత విద్యారంగము

శ్రీ వై. కె. బ్రహ్మానందం

మన దేశానికి స్వాతంత్ర్యము వచ్చిన ఈ పదేళ్ళ నుంచీ ఆర్థిక, పారిశ్రామిక రంగాలలోవలె, విద్యా రంగములో కూడ నిర్దిష్ట లక్ష్యములతో పునర్నిర్మాణము జరుగుచున్నది. దీనిని పరీక్షించినట్లయితే, మన విద్యా విధానములో వ్యక్తమగుచున్న నూతనలక్ష్యములు, దృక్పథము, తదభిముఖముగా సాగుపురోగమనము తెలుస్తుంది. స్వరాజ్యమును సౌరాజ్యముగ చేయు కృషిలో, విద్యావిధానమునకు కూడ ప్రముఖస్థానము కలదు. దానిని గుర్తించియే ప్రభుత్వము, స్వతంత్రభారత విద్యా ప్రతిపత్తిని స్థాపించుటకు, అనేక ఉన్నతాధికార సంఘములను నియమించినది. ఆ సంఘములు చేసిన సూచనల నమలుపరచుటకు, మరికొన్ని ఉపసంఘములు నియమింపబడినవి. అట్లే ప్రముఖ విద్యావేత్తల నాయకత్వమున, కొన్ని బృందములు, విదేశములలో విద్యా పద్ధతులను పరిశీలించుటకు పోయివచ్చినవి. సాంకేతిక, సాధారణ విద్యలలో, ప్రత్యేకప్రావీణ్యతా సంపాదనకై చాలామంది ఉపాధ్యాయులను విదేశములకు పంపించినది.

నవభారతము, తన విద్యాలక్ష్యముల నీవిధముగా నిర్ణయించుకొన్నది. నిర్బంధ ప్రాథమిక విద్యా విధానముద్వారా, దేశములోని నిరక్షరాస్యతను ఒక నిర్ణీత సమయములోపల నిర్మూలించుట, సెకండరీ, కాలేజి చదువులకు ప్రత్యక్ష ప్రయోజనములను కల్పించి, కాలేజి చదువులలో జరుగుచున్న ధన, కాల, శక్తి, యుక్తుల దుర్వ్యయమును తగ్గించుట, విద్యాభ్యాసములో నాయకత్వమునకు తగిన శిక్షణ నొసంగుట, విద్యాసంస్థలన్నింటిలోను నంతర్వాహినిగా జాతీయలక్ష్యమును నిబంధించుట, సర్వమత సమ్మతము ప్రభుత్వవిధానమున కనుకూలముగా పాఠశాలలో మత సహన వాతావరణమును కల్పించుట, ప్రజాస్వామ్య ప్రయోగ విజయమునకై సత్వర శిక్షణపై కేంద్రీకరణము, మున్నగునవి ప్రధానలక్ష్యములు. అర్థవంతమైనవిద్య, సాంఘికప్రయోజన మన్నవి నేటి విద్యావిధానమునకు సంరక్షకములు.

నేడు మనము ప్రణాళికాయుగములో ప్రయాణము చేయుచున్నాము. ప్రజాసహకారముతో నీ ప్రణాళికా పరంపర విజయమును ప్రభుత్వము వాంఛించుచున్నది. ఈ ప్రణాళికా ప్రభావము విద్యారంగముపై విస్తృతముగా ప్రసరించుచున్నది. జాతీయ ప్రణాళికా మండలిలో విద్యాశాఖ కలదు. దీనికి డాక్టర్ జె. సి. ఘోష్ అధ్యక్షుడు. రెండవ పంచవర్ష ప్రణాళిక దిగ్విజయమగుటకు పదివేలమంది ఇంజనీర్లు కావలెనని ఒక అంచనా వేసిరి. మన ప్రాజక్టులు కొనసాగుటకు కావలసిన ధనము, యంత్ర సామగ్రి, సాంకేతిక విద్యా ప్రవీణులు, మనదేశము కర్మాగారములు, విద్యాసంస్థలనుండియే వరుసగా నావిర్భవింపవలెనని ప్రభుత్వము పట్టుదలతో నున్నది. దీనినిబట్టి, సాధారణవిద్యకంటె, సాంకేతిక విద్య కెక్కువవిలువ నేడున్నదని స్పష్టమగుచున్నది. కేవల సాంకేతిక విద్యను మాత్రమే బోధించినచో అది పాక్షికవిద్య యగును. ఇటీవల కొన్ని ప్రాజక్టులలో జరుగు పనిని పరీక్షింపగా, అక్కడ అమిత ధనవ్యయము, అధికారులలో పాక్షికప్రవృత్తి, బాధ్యతారాహిత్యము బయటపడినవి. సాంకేతిక విద్యతోబాటు సాహిత్యచరిత్రలను బోధించిననే కాని ఆలోపము తీరదని డాక్టర్ జాన్ మత్తయి ఆ సందర్భములో చెప్పెను. ఉన్నత సాంకేతిక విద్యలో బోధనాభాషగా ఇంగ్లీషే ఉండవలెనని మన ప్రధాని నిర్ణయించి, భాషా వివాదముల కవకాశము లేకుండ చేసెను. లఘు పరిశ్రమలు అభివృద్ధి యగుటకై, సెకండరీ విద్య పూర్తికాగానే విద్యార్థులను వారివారి యభిరుచుల ననుసరించి ఆయా వృత్తి విద్యలలోనికి ఆకర్షింపవలెను. లేనిచో అనేకులు నిర్లక్ష్యముగా కాలేజిచదువుల కెగబడుదురు. వృత్తి విద్యా సహాయక సంస్థలు, వాని కనుబంధముగా

మనః తత్త్వ పరిశోధనా శాఖలు మనదేశములో బాగా అభివృద్ధి పొందలేదు. ఇట్టివి జర్మనీదేశములో ప్రసిద్ధి కెక్కినవి. మనకు కావలసిన ఇంజనీర్లను విదేశముల నుండి తెప్పించుకొనుచుండగా, దేశములో తయారగు ఇంజనీర్లు మాత్రము తగిన ఉద్యోగములు లేక నిరుద్యోగులుగా నున్నారని, ఈ పరిస్థితి చాలా చిత్రముగా నున్నదని శ్రీహూగా రచేకపార్లు చెప్పిరి. అనగా దేశీయావసరములకు తగినట్లుగా సాంకేతిక విద్యా విధానము లేదని తెలియుచున్నది. ఇటీవల మన రాష్ట్రములో సాధారణ విద్యనుండి, సాంకేతిక విద్యను విడదీసి దాని కొక ప్రత్యేక శాఖను ఏర్పరిచిరి. దేశములో ధనాభావము, విదేశములనుండి వచ్చునట్టి సహాయమును కృశించు సూచనలవలన పొదుపు టుద్యమము బయలుదేరి, విద్యకై ప్లానింగు కమిషను వారు మొదట నిర్ణయించిన మొత్తములో కొంత తగ్గింపబడెను. ఈకోతను సమర్థించుచు సి. డి. దేశముఖ్, ఉన్నంతలో సత్ఫలితముల సాధించుటకై విద్యా సంస్థలు కృషిచేయవలెనని చెప్పెను.

ఇక నేటి విద్యారంగములో ప్రజాస్వామ్య లక్షణము లెట్లు చొచ్చుకొని పోవుచున్నవో పరిశీలించెదను. వ్యక్తిత్వముయొక్క సంపూర్ణ వికాసమే విద్యా లక్ష్యము. నియంతృత్వ దేశములలో వ్యక్తి వికాసము కంటె సమాజాభివృద్ధికి ఎక్కువ ప్రాముఖ్యము కలదు. ఇందు సమాజ మొక పెద్దయంత్రము. వ్యక్తులందలి భాగములు. ప్రజాస్వామ్యములో సమాజ మొక వృక్షము. వ్యక్తులు దాని ఫలములు, పుష్పములు. విద్యపై సర్వాధికారము తన గుప్పిటిలో నుంచుకొని, సమష్టి లక్ష్యమునకై వ్యక్తి అస్తిత్వమును, త్యజించును. హిట్లరు అధికారములోనికి వచ్చిన వెంటనే చేసిన మొదటిపని, అప్పటివరకు స్కూళ్ళలో నున్న పాఠ్యగ్రంథములను తగులబెట్టించి, క్రొత్తవానిని వ్రాయించెను. నేడు రష్యాలో, పిల్లల రక్షణ బాధ్యతను, శైశవదశ నుండియే తన యాధీనములో నుంచుకొని ప్రభుత్వము పోషించు చున్నది. అట్లైనచో, వారిని నిర్దిష్ట సమాజ జీవితము కొఱకు తయారుచేయవచ్చును. ప్రజాస్వామ్యములో వ్యక్తి వికాసము సాంఘికాభివృద్ధి అను రెండు ఆదర్శములకు సంఘర్షణను నివారించును. పరస్పర సహకారమునకై ప్రయత్నము జరుగును. భూమి తన చుట్టు తాను తిరుగుచు, సూర్యుని చుట్టు ఏవిధముగా భ్రమించునో, అట్లే ఇచట వ్యక్తి తన శక్తియుక్తులను పోషించుకొనుచు సంఘశ్రేయమునకై పాటుపడును. తల్లిదండ్రుల సహకారముతో పిల్లల రక్షణ బాధ్యతను ప్రజాప్రభుత్వము నిర్వహించును. నియంతృత్వములో నిర్బంధము ప్రజాస్వామ్యములో పరస్పర సహకార మున్నవి ప్రధాన లక్షణములు. వైయక్తిక భావములను మన్నించుచు. సమష్టి క్షేమమునకు, వ్యక్తులు ఐచ్ఛికముగా తోడ్పడునట్లు చూచును.

బాలురలో ప్రజాస్వామ్య బీజములు నాటుటకు, సెకండరీ విద్యాదశయే తగినదని విద్యావేత్తల నిర్ణయము. దానిననుసరించియే పాఠశాలలలో స్వయం ప్రభుత్వము (Self Governm:nt) లు, నమూనా శాసనసభల నిర్వహణము, పాఠశాలా నిర్వహణలో ఉచితమైన భాగస్వామ్యముల నేర్పరిచిరి. జాతీయ లక్ష్యసిద్ధికై (Nationalism in education) హైస్కూళ్లలో A. C. C. కాలేజీలలో N. C. C. కలవు. పాఠ్యప్రణాళికలో అనేకశాఖ లేర్పరిచి, విద్యార్థులు వారివారి యభిరుచుల ననుసరించి, ఒక్కొక్కదానిని ప్రత్యేకము చదువు అవకాశములు నేడు విరివిగా నున్నవి. ఇది ప్రణాళికలోని వైవిధ్యము, ఔదార్యములను సూచించును. (variety and flexibility in Curriculum) బాలబాలికలకు ప్రత్యేక పాఠశాల లున్నచో, సహవిద్యలోని లోపములు తొలగునని ప్రజాస్వామికుల యభిప్రాయము. రష్యాలో సహవిద్య (Co-education) ప్రోత్సహింపబడుట కొక కారణముకలదు. యౌవనోద్రేకము లణగుట బాలబాలికలు కలసిమెలసి యుండినచో సాధ్యమని వారి సిద్ధాంతము. మరియు యుక్తవయస్సులోని ఉద్రేకమును, ప్రణాళికలో అనేక శారీరక కార్యక్రమముల చేర్పరిచి, వానిలో పాల్గొనునట్లు చేసి, వారి మనోజన్యమైన అధికశక్తి మార్గము చేర్పరచెదరు. కాని సహవిద్యలో బాలికల బహుముఖ వికాసమునకు బాలుర వ్యక్తిత్వ మాటంకముగా నుండుట అనుభవముద్వారా తెలిసిన విషయము. మన పాఠ్యప్రణాళికలలో, పుస్తక విద్యకు, శరీర పరిశ్రమకు సమానమైన అవకాశములు కలవు. బోధనాపద్ధతులలో వ్యక్తిపద్ధతి, సమష్టి ప్రయోగములు, చర్చలు (Dalton plan, projects method and debates) ప్రజాస్వామ్యమునకు పునాదియగు

వాక్స్వాతంత్ర్యము, భావ సమన్వయమునకు దారి తీయును. ప్రజాస్వామ్యమన్న దొక జీవిత విధానము. విద్యాప్రయోజనము, వ్యక్తిని జీవితనిర్వహణ సమర్థునిగా జేయుట అను రెండు విషయములు జ్ఞప్తియందుంచుకొన్నచో, పైన వివరించిన పద్ధతుల లోని సామంజస్యము బోధపడును.

ప్రజాప్రభుత్వ విజయము దేశములోని విద్యా శాతముపై ఆధారపడి యుండును. లేనిచో అది విఫలమై, యందుండి నియంతృత్వ మావిర్భవించును. నిర్బంధ ప్రాథమిక విద్యావ్యాప్తితోపాటు, సాంఘిక విద్యకుకూడా ప్రాముఖ్య మిచ్చుట కదే కారణము. వయోజన విద్య అను పదముకంటె, సాంఘిక విద్య (Social education) అన్న ప్రయోగము, తల్లక్ష్యము యొక్క వైశాల్యమును తెల్పును. నిరక్షరాస్యులగు వయోజనులకు చదువుట, వ్రాయుట నేర్పుట, గ్రామీణులకు వారి వారి వృత్తి విద్యలలోని విశేషముల నెరింగించుట, గ్రామములలో మూఢాచారములు, అస్పృశ్యత, మద్యపానములను నిరోధించుట, అంటువ్యాధుల నెదుర్కొను పద్ధతులను బోధించుట, క్రూరవినోద కార్యక్రమములను నిరసించుట, ప్రాథమిక ఆరోగ్య నియమములను తెల్పుట, పురుషులతోబాటు స్త్రీలకును నిత్యజీవితమును సుఖవంతము చేసికొను సాధనముల నిచ్చుట, గ్రామములలో విజ్ఞాన వినోదవికాసముల నెద జల్లుటయే సాంఘిక విద్యాలక్ష్యములు. నిరక్షరాస్యున కక్షరజ్ఞానము కల్పించు టనగా, విజ్ఞాన సుసన్న భాండాగారమును తెరచు తాళపుచెవిని వాని చేతి కిచ్చుటయే యని రస్కిన్ వర్ణించెను. సాంఘిక విద్యాప్రచారమునకు దృశ్య విద్యాబోధన శక్తిమంత మైనది. డెన్మార్కులో నిట్టి వయోజనవిద్య అపూర్వ ప్రాయముగా ఫలించినది. మనరాష్ట్రములో వయోజన విద్య విఫలమైనదని, కనుక ఆ కార్యక్రమమును తమ శాఖనుండి సాంఘికాభ్యుదయ శాఖకు మార్చుచున్నా మని మనరాష్ట్ర విద్యామంత్రి అసెంబ్లీలో చెప్పెను.

ఇంతవరకు, నూతనసిద్ధాంతముల ననుసరించి, విద్యాలయములలో, విషయవిధానములు (Content and Method) ఎట్లు పునర్నిర్మాణములో నున్నవో పరిశీలించితిమి. ఇక, విద్యారంగములో కొన్ని నూతన ప్రయోగములు జరుపుటద్వారా, ప్రపంచ విద్యావృత్తిమును, భారతదేశ మెట్లు విస్తృతము చేయుచున్నదో గ్రహించెదము. భారతదేశమువంటి వ్యవసాయిక దేశంలో, గ్రామీణ విశ్వవిద్యాలయము లవసరమని (Rural Universities) రెండేండ్ల క్రిందట, మనదేశంలో పర్యటించిన అమెరికా నిపుణుల సంఘం సూచించింది. వ్యవసాయం, పశుపోషణ, గృహ నిర్వహణ మొదలగు అంశములకు ప్రాధాన్య మిచ్చుటయే ఇట్టిసంస్థల యాశయము. ఇట్టివానిని స్థాపించుటకు అనుకూలమైన పరిస్థితు లన్నీ ఆంధ్రప్రదేశ్ లో నే కలవనీ కూడా ఆ సంఘం సూచించటంవల్ల, మన రాష్ట్రప్రభుత్వం ఈ సమస్యను కూలంకషంగా చర్చించి, అట్టి విశ్వవిద్యాలయమును స్థాపింపతగిన స్థలమును సూచింపుమని, శ్రీ బెజవాడ రామచంద్రా రెడ్డిగారి యధ్యక్షతన నొకసంఘాన్ని ఏర్పరిచింది. యూనివర్సిటీ కమిషన్ రిపోర్టుకూడా ఈ సమస్యను గురించి సుదీర్ఘంగా చర్చించినది. కమ్యూనిటీ ప్రాజక్టులలోను, భారత సేవక సమాజములోను పనిచేయుటకు తగిన శిక్షణనిచ్చుటకై, ప్రభుత్వం, దేశంలో పది సంస్థల నెన్నుకొని, అక్కడ గ్రామీణ ఉన్నతవిద్యాప్రయోగములను (experiments in rural higher-education) జరుప నిశ్చయించింది. తెలివితేటలుండీ, ధనాభావముచే పైచదువులకు పోలేని విద్యార్థుల నెన్నుకొని, వారికి ఉచిత భోజన విద్యాసౌకర్యములను కల్పించి, ఇట్టి శిక్షణనీయ సంకల్పించిరి. శిక్షణకాలము నాలుగుసంవత్సరములు. తమిళనాడులో రామకృష్ణమిషన్ విద్యాలయము, వార్ధా, శాంతినికేతనములలో 1957 నుండి ఈ విద్యా విధానములను ప్రారంభించిరి. ప్రస్తుత విశ్వవిద్యాలయ విద్యలో సమాంతరముగ, నీప్రయోగములు జరుప వలెనని ఆశయము.

1957 డిసెంబరు 6 వ తేదీన, హైదరాబాదులో పాలక సిబ్బంది శిక్షణ కళాశాలను (Administrative staff college) ప్రభుత్వము ఆరంభించెను. ఇటువంటి కళాశాల ఆసియాలో నే యపూర్వమైనది. ఇంగ్లండులో హెన్లీ ఆన్ థేమ్సులో నున్న పాలకసిబ్బంది శిక్షణ కళాశాల పద్ధతిలో నిది పనిచేయును. జనరల్ నగేశ్ దీనికి ప్రిన్సిపాలు. ఈయన ఇంగ్లాండు వెళ్ళి, అట్టికళాశాలను వివిధ విధానములో మూడుమాసములు శిక్షణ పొందివచ్చెను. అధికారపూరితమైన మన స్తత్వము గల వారిని క్రమముగా ప్రజాస్వామిక ప్రభుత్వమున కను

గుణముగా వ్యవహరించునట్లు శిక్షణయొసంగుటయే ఈ సంస్థ ప్రధానలక్ష్యమని డాక్టర్ జాన్ మత్తయ్ తన ప్రారంభోపన్యాసములో స్పష్టము చేసెను.

తమిళ్ నాడులో, గాంధీగ్రామములో, పది సంవత్సరములనుండి ప్రాతిపదికవిద్య సాధారణముగా (Basic educatien) వివిధ ప్రయోగములు జరుపుచున్నారు. ఈమధ్య ప్రధాని నెహ్రూ దీనిని దర్శించి, ఇందు జరుగుచున్న విద్యాకృషిని ప్రశంసించెను. భారతీయ వాతావరణమును, వ్యక్తిత్వమును నిరూపించు విద్యగా, గాంధీజీ ఆధారవిద్యను సృష్టించెను. దీని నన్ని దశలలో లోను వ్యాపింపచేయవలెనని డాక్టర్ శ్రీ మాలీ, వినోబాభావే మొదలగు గాంధీయ విద్యావేత్తలు దీక్షతో పనిచేయుచున్నారు. ప్రభుత్వముకూడా ఇందలి ప్రధానసూత్రము నంగీకరించినది. కాని ప్రయోగదశలో సాధారణ విద్యకును, ప్రాతిపదిక విద్యకును ఘర్షణ కలుగుచున్నది

నేటి దేశావసరముల కనువుగా, ప్రాథమిక, సెకండరీ, యూనివర్సిటీ వ్యవస్థలు నేడు పునర్నిర్మింపబడుచున్నవి. నిరక్షరాస్యతా నిర్మూలన, విద్యా వ్యయ నివారణ (Stagnation and wastage) బాలుర ఆరోగ్యాభివృద్ధి ప్రాథమిక విద్యాలక్ష్యములు. ఈ సమస్యలపై శ్రద్ధవహించుటకు నిన్న మొన్ననే అఖిలభారత ప్రాథమిక విద్యాసంఘము నియమింపబడెను. హైస్కూలు విద్యను సుసంఘటితముగా జేయుటకై 7వ ఫారమును ప్రవేశపెట్టి, అందుండి వివిధ వృత్తివిద్యలకు, సాంకేతికశాఖలకు మార్గముల నేర్పరుచుచున్నారు. దానివలన కళాశాలలలో అనవసర భారము తగ్గును. 'ఆలిండియా కౌన్సిల్ ఫర్ సెకండరీ ఎడ్యుకేషన్', (All India Council for Secondary education) వారు విద్యావిషయములు, బోధనావిధానములు, పరీక్షాపద్ధతులనుగూర్చి దేశమంతటను, విదేశీ నిపుణుల సహాయముతో అనేక పరిశోధనలు సాగించుచున్నారు. యూనివర్సిటీ విద్యనుగురించి, యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్ శ్రద్ధవహించుచున్నది. యాంత్రికశక్తి నధిగమించెడి వ్యక్తివికాసము, మానసిక స్వాతంత్ర్యము, ప్రాచీన సంస్కృతీ ప్రచారము, సత్యపరిశోధనాసక్తి, సాంఘిక వ్యాఖ్యానము, సంక్షేమ ప్రభుత్వములపై దృష్టిని సారించుటయే విశ్వవిద్యాలయముల లక్ష్యములని సి. డి. దేశముఖ్ ప్రబోధించుచున్నాడు. స్త్రీ విద్యనుగురించి కూలంకషముగా చర్చించి, హైస్కూలు, కాలేజి దశలలో స్త్రీలకెట్టి విద్యావిధానము శ్రేయోదాయకమగునో సూచించుటకై కేంద్ర ప్రభుత్వము త్వరలో ఒక సంఘమును స్థాపింపనున్నది.

ఈ నూతన కార్యక్రమము లన్ని నిర్విఘ్నముగా నెరవేరుటకు ప్రభుత్వముతో సమాజ మన్నివిధముల సహకరింపవలెను. విద్యారంగములో నితర దేశములనుండి స్వీకరింపతగిన అంశము లున్నచో, అట్టి వానిని స్వాయత్తము చేసికొనుటకు సంకోచింపరాదు. సంఘములో, ఉపాధ్యాయున కత్యధిక గౌరవము నిచ్చు దేశము జపాను. నిరక్షరాస్యతా నిర్మూలనలో నైనా అమిత వేగములో దీక్షతో కృషి చేసినది. ఉపాధ్యాయులతో తల్లిదండ్రుల సహకారము స్కాట్లండులో నానిర్మ ప్రాయముగా నున్నది. అమెరికా, ఇంగ్లండులలో విద్యాభివృద్ధికి ప్రభుత్వముకంటె, ప్రైవేటు సంస్థలే పనిచేయుచున్నవి. మనదేశములో విద్య, రాష్ట్రీయ సమస్య యగుటవలన వివిధ రాష్ట్రములలో జరుగు కార్యక్రమములను సమన్వయపరచు బాధ్యత కేంద్ర ప్రభుత్వముపైనున్నది. విద్యారంగములో కేరళ రాష్ట్ర వైఖరి కొందరికి ఆందోళన కలిగించుచున్నది. బోధనభాషా నిర్ణయము, పాఠ్య గ్రంథ ప్రచురణము, ప్రాతిపదిక విద్యలలో ఒక్కొక్క రాష్ట్ర మొక్కొక్కరీతిగా నున్నది. విద్యను రాష్ట్రములనుండి కేంద్రము స్వీకరించుట సమంజసమని కొందరు మేధావంతుల యభిప్రాయము. ఈ సమస్య లన్నింటిని గూర్చి ఆలోచింపవలసిన బాధ్యత, తరతమ భేదములతో అందరిపై నున్నది. పత్రికలు వీనికి తగిన ప్రచార మీయవలెను శ్రేయోరాజ్యస్థాపన దేశములోని విద్యాశాతముపై ఆధారపడియున్నది.

# అమ్మ తప్పు చేసింది!

శ్రీ మిక్కిలి సుందరరావు

ఆ వేళ ఊరిబయట కొలనులో మెల్లగా కదలుతున్న అలలమీద నాట్యం చేస్తూ నవ్వులు కురిపిస్తున్న తామర కన్నెల వాలుచూపుల్లో చిక్కుపడిన సూర్యకాంతులు ప్రపంచాన్ని జాలిగా చూశాయి.

నది మీదుగా వీచే వసంత సమీరాలు సూర్యుని జాలిచూపులతో కలిసి మానవాళికి హాయిని చేకూర్చుతూ మందగమనంతో ముందుకు సాగిపోతూ సమస్త జీవుల ప్రశంసల నందుకుంటున్నాయి.

వాతావరణ ప్రశాంతతవలన పట్టణంలోని ప్రతి పనీ యెంతో ఉత్సాహకరంగా కొనసాగిపోతూంది.

ప్రతివ్యక్తీ ఒకరికొకరు 'అబ్బ, యివ్వాళ యెంత హాయిగా వుందండి. యీ సంవత్సరానికి యివ్వాళే ననుకుంటాను యింతహాయిగా వుండడం' అని అనుకుంటున్నారు.

ఆ వేళ ఆఫీసు పనులన్నీ తృప్తికరంగా వున్నందువలన ముకుందరావుగారు తన వామహస్తం మీద మెరిసిపడే ఖరీదుగల గడియారాన్ని ఒక్కసారి నిశ్చింతగా చూసుకుని కుర్చీమీద నుండి లేచి 'టేబుల్ బెల్' మ్రోగించారు.

గణగణ మను శబ్దం విని, ఆఫీసు మూలని బీడీ కాలుస్తున్న వెంకన్న చివరకు తన కపాలం అంటుకునేంతగా లాగి, దాన్ని విసిరి దూరంగా వేసి, రెండంగల్లో ముకుందరావుగారి సముఖంలో అతి వినయంగా నిలబడ్డాడు.

ముకుందరావుగారు అతని అమాయకత్వానికి తనలో నవ్వుకుని "వెంకన్నా, ప్రకాశరావుగారిని పిలువు" అన్నారు.

మరుక్షణంలోనే ప్రకాశరావు వచ్చి ముకుందరావుగారికి నమస్కరించి నిలుచున్నాడు.

"ప్రకాశరావుగారూ, ఐదున్నరయ్యింది. ఇంకా గుమాస్తాలు యిళ్ళకు పోలేదు. వాళ్ళకు మాత్రం యిళ్ళవద్ద పనులు లేకుండా వుంటాయా? ప్రతిదినం వాళ్ళు ఖచ్చితంగా ఆఫీసు ఐదుగంటలకే వదిలేలాగ చూడు" అన్నారు.

హెడ్ గుమాస్తా ప్రకాశరావు ఆయన మాటలు శ్రద్ధగా ఆలకించి "నేను వెళ్ళమంటున్నాను. కాని వాళ్లే పని కానిదే వెళ్లడంలేదు." అన్నాడు.

"ఎందుచేత?" అన్నారు ముకుందరావు.

"మీరు యీ ఆఫీసుకు వచ్చినప్పటినుండి పనులు పూర్తిగా మారిపోయాయి. ప్రతి గుమాస్తాకు మీయెడల అభిమానం, గౌరవం యేర్పడ్డాయి. గుమాస్తాలంతా తమ పనిని ఎంతో ఓపికతోను సహనంతోను నిర్వర్తించుకుపోతున్నారు. దానికి కారణం మీరు వారియందు చూపుతున్న దయ, ప్రత్యేకమైన అభిమానం" అన్నాడు ప్రకాశరావు.

ముకుందరావుగారు ఒక్కసారి తనమంచితనాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని నవ్వుతూ "అలాగా—" అన్నారు.

"ఇదివరకు యీ ఆఫీసులోని పనులు చాలా విచిత్రంగా వుండేవి. ఎవరికైనా తమ పని యీ ఆఫీసు ద్వారా కావలసివస్తే, వాళ్ళు యిక్కడ కొన్ని రోజులు పడిగాపులు పడితేగాని ఆపని అయ్యేదికాదు. గుమాస్తాలు యెవరి కుర్చీలలో వాళ్ళు కూర్చొని, ఒక మూలకు తల ఆనించి యెదురు బల్లమీద కాళ్ళు వేసి కునుకు తీసేవారు. మీవలన యీ ఆఫీసు అన్ని విధాలా అభివృద్ధి పొందిందనే చెప్పాలి—మాకే కాకుండా ప్రజలకు కూడా మీయెడల అభిమానము, గౌరవము యేర్పడ్డాయి." అన్నాడు ప్రకాశరావు.

"ప్రకాశరావుగారూ, పరులకు నీతులు చెప్పేకంటే తనకు తాను మంచిగా వుంటూ, తన బాధ్యత తాను నెరవేర్చగలిగితే యీ ప్రపంచమే బాగుపడుతుందంటాను. నేనుమాత్రం యితరులకు చేస్తున్న మేలు యేముందండి, నామీద అభిమానంకొద్దీ అలా అనుకుంటారు గాని—"

"అలా అనకండి. ఇంతకాలంనుండి యెంతో మంది ఆఫీసర్లను చూశాను. మీరు యువకులైనా, పెద్ద అనుభవం లేకపోయినా..."

"సరే నేను వస్తాను ప్రకాశరావుగారూ."

ముకుందరావుగారు ఆఫీసు ఆవరణ దాటేసరికి "బాబూ, పేదవాడికి ధర్మం చేసి పుణ్యం కట్టుకోండి" అంటున్న పేదవాడు కనపించాడు.

సరియైనపోషణలేక వడిలిపోయిన అతనిశరీరాన్ని అతని కన్నుల్లో కనుపించే దీనత్వాన్ని చూసేసరికి ముకుందరావుగారి హృదయం జాలితో తడిసిపోయింది.

కాని తనజేబులో చిల్లరవున్నట్లు ఆయనకు జ్ఞాపకం లేదు. పోనీ చిల్లరకోసం జేబులో చెయ్యి పెట్టడం అతడు చూసి సంతోషపడవచ్చు, తరువాత చిల్లర లేదని చెప్పి అతనికి నిరాశకలిగించడం అంత భావ్యమైన పని కాదు. జేబులో తీరా చెయ్యి పెట్టిన తరువాత ధర్మం చెయ్యకపోవడం కూడా అంత భావ్యమైన పని కాదని, అనుకుంటూనే ఆయన కొంచెం ముందుకు సాగి, బజారులో అటువైపు మలుపు తిరిగి వస్తున్న ఒక స్త్రీని చూసి స్తంభించిపోయాడు. మళ్లీ సాలోచనగా చూసి తను మొదట అనుకున్న 'ఆమె' కాకపోవడంచేత కొంతవరకు సమాధానపడ్డాడు.

చాలాసేపటివరకూ ఆ బిచ్చగాని ఆకారమూ, ఆ స్త్రీని చూసినప్పుడు తనకు అకస్మాత్తుగా మనసులో మెరిసిన మరియొక స్త్రీ మూర్తి చిత్రము లీలగా తనయెదుట చాలాసేపటివరకు కనుపించాయి. ఈ రెండు సమస్యలనుగురించి అతడు చాలాసేపు మథనపడవలసివచ్చింది.

ముకుందరావుగారు ఆఫీసునుండి యింటికివచ్చే సరికి ప్రొద్దుపోయింది. ఇప్పటికి ఆయన మనసులో శాంతిభద్రతలు నెలకొన్నాయి.

ఇంటిముందు పూలతోటలో మల్లెపందిరి ప్రక్క మలయపవనాలకోసం మంచం వేసుకుని కూర్చున్న విమలాదేవి, తెల్లనివెన్నెల్లో దేవతామూర్తివలె కన్నులు పారించి ఆయన రాకకు యెదురుతెన్నులు చూస్తోంది.

చల్లనిగాలులు హృదయానికి ఉల్లాసాన్ని చేకూర్చే యీ అతినిర్మలమైన వాతావరణంలో ఆమె అందాన్ని, అంతకుమించిన ఆమె అనురాగాన్ని, నిత్యకృత్యాల్లో ఆమె తనకు చేస్తున్న సేవను ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకునేసరికి తన హృదయంలో వివరించలేనంత ఆప్యాయత జనించింది.

ఆయన ఆమెను తాకేటంత దగ్గరకు సమీపించే సరికి ఆమె సిగ్గుతో తలవంచుకుంది. ఆయన అలాగే ఆమెప్రక్కగా మరీదగ్గరగా కూర్చుని చిన్నగా సన్నగా నవ్వాడు.

గాలికి వూగుతున్న కొబ్బరియాకుల సందుల గుండా వచ్చి పడుతున్న పున్నమి వెన్నెల ఆమె ముఖారవిందాన్ని రాగరంజితం చేస్తూ వింతశోభల్ని కూర్చుతున్నది.

తదేకదీక్షగా చూస్తున్న ముకుందరావుగారు తన చిటికెనవ్రేలితో ఆమె చెక్కిలినిమీటి, ఆ చెక్కిలి మీదుగా ప్రవహిస్తున్న సిగ్గుతెరలను చెల్లా చెదురు చేద్దామని ప్రయత్నించాడు. కాని ఆయన్ని ఆమె వారించగలిగింది.

"చూడండి, పాపాయి నిద్రనుండి లేస్తాడు మీ అల్లరికి—ఇక వాడి అల్లరివల్ల మీ స్నానానికి భోజనానికి ఆటంకం వాటిల్లుతుంది." అన్నది విమలాదేవి.

"ఈ మంచులో వాడిని నిద్రపుచ్చావు, జలుబు చేస్తుందేమో."

"పగలంతా యెంత చెప్పినా నిద్రపోకుండా అల్లరి చేశాడు. ఇలా వెన్నెట్లోకి తీసుకొచ్చి చిన్న కథ చెప్పేసరికి నిద్రపోయాడు."

"మంచు కురుస్తుంది వాడిని లోనికి తీసుకువెళ్దాం పద" అన్నాడు.

"మరచిపోయాను. టెలిగ్రాం వచ్చింది, ప్రమాదంగా వుందట!" అన్నది.

"ఆఁ—! టెలిగ్రాం వచ్చిందా? ఎక్కడి నుండి?" అన్నాడు ముకుందరావు.

"ఎవరో వనజాక్షట" అందేసింది విమలాదేవి.

ముకుందరావు నిర్ఘాంతపోయాడు!

వెన్నెలకాంతికి మబ్బు తునకలు అడ్డు తిరిగాయి. మసకచీకటిలాగా ప్రదేశం మారిపోయింది.

"ఎవరండీ యీమె? వారు యెప్పుడూ చెప్పారు కాదు?" అని ముభావంగా అడిగింది విమలాదేవి.

విమలాదేవికి ఆమెనుగురించి చెప్పకపోవడం సహించరాని విషయమేననిపిస్తోంది. తన గౌరవాన్ని కాపాడుకోవడానికి తన అంతస్థు నిలబెట్టుకోవడానికి ఆమెకు యీ రహస్యాన్ని తను చెప్పుకోలేదు. ఈనాడు ఆమెకు ప్రమాదం సంభవించడానికికూడా ఒకవిధంగా కారణం తనేనేమోననిపించింది. వెంటనే అతనికి షుమారు పదిహేనేళ్ళనాటి విషాద సంఘటన మళ్ళీ ఒక్కసారి కండ్లకు కట్టినట్లయ్యింది.

* * * *

ఆ పట్టణంలోని మారుమూలనువున్న ఒక మురికి పేటలోనికి కలరా జొరబడింది. ఇటువంటి మురికి పేటల్లోకి యే వ్యాధి ప్రవేశించినా తనకసి తీర్చుకుంటుంది. ఎంతోమంది గంటలమీద ప్రాణం వదిలారు. ముక్కుపచ్చలారని పదేళ్ళ ముకుందరావు కూడా తన తల్లిదండ్రులను కోల్పోయాడు. అతని తల్లి కడసారిగా కన్నీళ్ళువిడుస్తూ "పసివాడివి, దిక్కులేనివాడివి. యెలా బ్రతుకుతావుబాబూ..." అంటూ కళ్ళు మూసింది. తల్లి, తండ్రిపోయినతరువాత ముకుందరావుకు ఆ యింట్లో మిగిలింది కన్నీళ్ళే!

నాలుగునెలల అద్దె యెలా చెల్లించాలి? ఈ పచ్చి మంచినీళ్ళు త్రాగి యెలా బ్రతకాలి? యెన్నాళ్ళు యిలా రోజుల్ని తింటూ కన్నీళ్ళు త్రాగాలి? అనే సమస్యలతో అతని పసిహృదయం కుమిలిపోయింది.

అద్దె యజమానివచ్చి యింటికి తాళం వేస్తుంటే ముకుందరావు ఆ యిల్లు మారుమ్రోగేటట్లు దుఃఖం

చాడు. తల్లిదండ్రుల పాదాలవద్ద కూర్చుని తను తీయించుకున్న ఫోటో కూడా తీసుకెళ్ళే భాగ్యం అతనికి దక్కలేదు!

బజారుపట్టుకుని ముందుకు సాగుతుంటే జీవితానికి దారి కానరాక ధారగా కారుతున్న కన్నీళ్లు అతని మురికిచొక్కాయిని ముద్దచేశాయి! నీళ్లు కడుపునిండా త్రాగిన నల్లని మబ్బులు నింగిలో త్రేన్పుతున్నాయి. వాటి అరుపులు అతని గుండెల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

వీడయుగల తండ్రి చల్లనిపాదాలను తన కన్నీటితో కడగాలో—యే చిన్నయిల్లాలి సన్నిధిలో పనిపిల్లవాడిలా ప్రాధేయపడాలో అర్థంకాకుండా వుంది.

ఆకాశంలోని కారుమబ్బులు అటూయిటూ పరుగులిడుతున్నయ్. గాలి అతిజాలిగా వీస్తుంది. పట్నం చీకటిముసుగు వేసుకుందని అతని కింకా గుర్తుకురాలేదు! పట్నమంతా తిరిగి తిరిగి యిప్పుడు యే వీధిలో కొచ్చాడో తనకే తెలియకుండావుంది. చిన్న వానజల్లు చలిగాలితో కలిసి ముళ్ళుగుచ్చుకున్నట్లు రాలుతుంది. ఎక్కడ తలదాచుకోవాలో అతనికి అర్థంకాలేదు. బజారుప్రక్క వున్న ఒక డాబాలోని పంచ నిర్మానుష్యంగా కనుపించింది. మెల్లగా మెట్లెక్కి వరండాలోనికి వెళ్ళి పంచలోని ఒకమూలకు కదలకుండా ఒదిగి కూర్చున్నాడు.

ఆ యింటికి తలుపు వేసివుంది. రెక్కలు మూసుకున్న కిటికీలోనుండి వచ్చే సన్నని కాంతి అతని ప్రక్క సన్ననిగీతగా పరుచుకుంది. ఇంటికామందులు లోపల వెచ్చగా హాయిగా నిద్రపోతున్నారు కాబోలు అనుకున్నాడు ముకుందరావు.

వర్షం రెక్కలువిప్పుకుని విహారంచేస్తుంది. చలిగాలి రివ్వున దూసుకువస్తుంటే, అతని నరాలు జివ్వుమంటున్నాయి. శరీరం గజగజలాడసాగింది. అతని క్రింది పెదవి, పైపెదవిని వత్తిడిచేస్తుంది. క్రిందపెదవిమీద అతనికి కోపం వచ్చింది. కాని వాటిమీద కసితీర్చుకునే శక్తి అతనికి లేకపోయింది. ఒకవైపున నిద్ర రెప్పల్ని తిన్నుతుంది. తలుపులు కిర్రుమనగానే అతని కనురెప్పలు విప్పారాయి. కొంతసేపటికి బయటికివచ్చిన భారీ మనిషిని చూసి అతనికి భయమేసింది. మూటకట్టినట్లు మూలకు ముడుచుకుపోయాడు. అతని రాకవల్ల ముకుందరావు కేదో సుగంధ పరిమళం వీచినట్లయ్యింది.

"రేయ్, యెవడ్రా, ఆమూలని?" అని అన్నాడు.

అతని గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఏం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు.

"ఏయ్, యిదుగో, యీ మూలని యెవడో వున్నట్లున్నాడు. వచ్చిచూడు" అని లోపల యెవరినో పిలిచి అతడు గొడుగు వేసుకొని వెళ్ళిపోయాడు.

కొంచెం సేపటికి యెవరో వస్తున్న గజ్జెలధ్వని వినిపించింది. ఆ అడుగులు సంగీతపు సరిగమల్లాగ పడుతున్నాయి. వరండాలోని విద్యుద్దీపం మేల్కొంది. ముకుందరావుకు ఎక్కడాలేని భయమేసింది. ఆమె గుమ్మంవద్ద నిలబడి ముఖారవిందం ముందుకుసారించి అతన్ని చూసింది. వెంటనే బయటికి వచ్చేసరికి 'గప్పు'మని ఒక వింతసువాసన అతని నాసికా రంధ్రాల్లోకి చొచ్చుకుపోయింది.

లేతగులాబిరంగువంటి ఆమె శరీరఛాయను, సుకుమారమైన ఆమె అవయవాలను అంటిపెట్టుకొని వున్న ఆకుపచ్చని సిల్కుచీరను, కోపావేశాలకు తావులేని నిష్కళంకమైన ఆమె ముఖారవిందాన్ని, మల్లెపూలుతింటూ పారాడుతున్న ఆమె పొడవైన జడనూ పరికిస్తే ఆమె చదువూ సంస్కారమూ కలిగిన స్త్రీయని చెప్పవచ్చు.

వర్షం ఒక భీకర స్వరూపాన్ని పొందుతుందనే సూచనగా ఆకాశంలో రెండుమబ్బులు యుద్ధానికి తలపడ్డాయి. అందువలన ఉరుములు మెరుపులతో కూడిన పిడుగులు పడుతున్నాయి. చలిగాలి అతని యెదలో జొరబడి రొద పెడుతుంది.

"అబ్బాయ్, ఎవరునీవు?" ఆమెకంఠం తియ్యగావుంది. అతనికి యేం చెప్పాలో అర్థంకాలేదు. ఆమె చాలాసేపు అతని వాలకాన్ని పరికించింది. ఇంట్లోనుంచి పరుగుత్తుకొచ్చిన 'టామీ' అరుచుకుంటూ అతనిమీదకు దూకింది. ఆమె టామీని గద్దించింది. ముకుందరావుకు క్రొత్త ఆలోచనవచ్చింది. రైలుస్టేషనులో పడుకోవచ్చునని బయలుదేరాడు.

మెట్లు దిగిపోతున్న అతన్ని "అబ్బాయ్, ఒక్కమాట. యిలారా" అని ఆమె పిలిచింది.

అతడు వెనక్కితిరిగి మెట్లెక్కి వరండాలోకొచ్చాడు.

"ఈ అర్థరాత్రివేళ యిక్కడెందుకున్నావ్?" అనిఆమె ప్రశ్నించింది.

"ఎక్కడా చోటుదొరకలేదు. యిక్కడ దొరికింది" అన్నాడు దీనంగా-

"అయ్యో, నీకు మాయింట్లో చోటుదొరికిందా?" అన్నది.

ముకుందరావు మాటలు రాలేదు.

"మీ యిల్లెక్కడ?" ఆమె ప్రశ్నించింది.

"నాకు యిల్లులేదండి!" అన్నాడు. అతనికి కన్నీరు రాసాగింది. ఆమె ఆశ్చర్యపోయింది.

"అయ్యోరామ, నీకు తల్లి, దండ్రీ వున్నారా?"

అతనికి ఆమె మాటల్లో కొంత ఆదరణ కనుపించింది.

అతని విషాదగాథను ఆమె జాలిగా ఆలకించింది.

ఆమె చూపులు అతని కళ్లలోకి జాలిగా చూశాయి.

అతని కన్నీళ్లు ఆమె చీరకొంగుతో తుడిచింది. అతన్ని ఆప్యాయంగా బుజ్జగించింది.

"దేవుడు గొప్పవాడు బాబూ, నేడు నాకు దిక్కు చూపించాడు" అన్నది. దేవుడు తనని కనికరించాడనుకున్నాడు ముకుందరావు. ఆమె అతన్ని యింటిలోనికి తీసుకువెళ్లింది. ఇల్లు చాలా వింతగా కనుపించిందతనికి—ఇంట్లో సువిశాలమైన నాలుగు గదులున్నాయి. ఒకగదిలోని పందిరి మంచంమీదవున్న నలిగిన మల్లెపూరేకులు మంచి వాసన వెదజల్లుతున్నాయి. నవీనమైన పద్ధతిలో చేయబడిన ఒక బల్లమీద రేడియోవుంది. ఒకవైపున వీణవుంది. దక్షిణాది అద్దాలబీరువాలు రెండున్నాయి.

గుమ్మాలకుపైన గోడమీదవున్న చిత్రాలలో రాధాకృష్ణుల విరహోపాలు, తారాశశాంకుల పరిహాసాలు లీలగా కన్పిస్తున్నాయి. ఇందొకగదిలో పూజావిగ్రహం వుంది!

ఆమె అతన్ని వేడినీళ్లతో స్నానం చేయించి, బట్టలు విడిపించి ఒక పెద్ద తుండుగుడ్డ చుట్టుకోవడానికి యిచ్చింది. వంటగదిలో అతనికి భోజనం పెట్టింది. అనుకోనిరీతిగా వర్షం గాలివానగా మారిపోయింది. చలిబాధ తీవ్రరూపం దాల్చింది.

ఆ రాత్రి ఆమెఒడిలో నిశ్చింతగా అతడు నిద్రపోయాడు. అతడు ఆమెఒడిలో పడుకున్నప్పుడు తన తల్లి ఒడిలో పడుకున్నప్పుడు కలిగే విరంతరానందాన్ని పొందగలిగాడు.

మరుక్షణంనుండి అతని జీవితంచిత్రించ నారంభించింది. క్రొత్తబట్టలు! క్రొత్తజోళ్లు! క్రొత్త పుస్తకాలు!! అంతా క్రొత్తగానే కనుపించసాగింది.

అతడు బడినుండి తిరిగివచ్చేసరికి ఆమె భోజనంతోపాటు అనేకమైన వంటలు తయారుచేసేది. బడినుండి రాగానే అతని లేతబుగల్ని ముద్దుపెట్టుకుని, కౌగిటలో అతన్ని దాచేసుకుని అరమూతలు వేసేది. 'నా బాబు, నా కన్నతండ్రి' అనుకునేది. ముకుందరావుకు ఆమెయెడల భక్తి, గౌరవము యేర్పడ్డాయి.

కొంతకాలానికి అతన్ని చదువుకోసం యింకొక పట్టణం పంపింది. అక్కడ అతన్ని ఒక హాస్టల్లో చేర్పించింది. అతనికి యెంత డబ్బు కావలసి వచ్చినా, వుత్తరము ముట్టగానే పంపించేది. అతనివద్దకు తరుచు వెళ్లి చూసివచ్చేది. కాని సెలవులకు కూడా అతన్ని ఇంటికి రావద్దని లేఖవ్రాసేది.

కొంతకాలానికి—

అతడు ఒక మానవుడుగా తయారయ్యాడు. ఆమె అతని లేతహృదయానికి రంగులుపోసి వంపులు దిద్దింది. అతడు బి. ఎ. చదువుకున్న తరువాత ఆమెను గురించి తెలుసుకోవాలని కుతూహలపడ్డాడు. ఆమె యెవరు? ఏమిటి? అనే ప్రశ్నలు అతనికి వచ్చాయి. అయినా వాటిని తెలుసుకోవలసిన అవసరం కూడా అతనికి కలుగలేదు.

ఒకనాడు ఆమెను చూడాలని ప్రత్యేకముగా బయులుదేరి వెళ్లాడు.

ఆనాడు—

ఆ యింట్లో చూసిన దృశ్యం అతని గుండెలు బ్రద్దలు చేసింది. ఆ దృశ్యమే తీరని దారుణ పరిణామాలకు దారితీసింది.

ఆ రాత్రి అతడు పూజాగృహంలో పడుకున్నాడు. గది చీకటిగానే వుందికాని అతనికి నిద్రపట్టలేదు.

కొంతసేపటికి యెవరో తలుపుతట్టిన శబ్దం అతనికి వినిపించింది. వెంటనే సంభాషణలు వినిపించసాగాయి.

"ఇవాళ లాభంలేదు. మా అబ్బాయి వచ్చాడు." అని ఆమె అన్నది.

"అరెరె...వంద రూపాయలు తెచ్చాను. నా మీద ఒట్టు." అతడు బొంగురుగొంతుతో దకదకా మాటాడుతూనే వున్నాడు.

"హుఁష్...అబ్బ!...దయచేసి యివాల్టికి వెళ్ళిపొండి. మీకు పుణ్యముంటుంది." ఆమె అతన్ని బ్రతిమాలింది.

అతడి మాటలు తడబడుతున్నాయి.

"ఈ స్వర్గంలోనుండి మళ్ళి నరకంలోనికి వెళ్లేనా?"

"నా మాట విని వెళ్లండి."

"యె...యెలా వెళ్లేది? నువ్వే-చే-చెప్పు,"
అతడు ఒకవైపు వెక్కిళ్ళు వెక్కుతూ కీచుగా మాట్లాడుతున్నాడు.

"ఛీ, పాడుకంపు, త్రాగివచ్చావనుకుంటాను." ఆమె అసహ్యించుకున్నది.

"ఇది...పా...పాడుకంపా? ఎవడన్నాడో...చె...చెప్పు...వాణ్ణి మర్డర్ చేస్తాను" అంటున్నాడు.

"............"

అతడు—

"హుఁ—హుఁ—సారాయినిహా లేకపోతే...' అంటుండగానే ఆమె ఒక్క లెంపకాయి లాగికొట్టింది కాబోలు 'చెళ్ళు'మనే శబ్దం అతనికి పెద్దగా విన్పించింది.

"ముందు వాకిట్లో నుండి బయటికిపో—" అని ఆమె అతణ్ణి బయటికి నెట్టి తలుపు వేసుకుంది. ముకుందరావు యిది గమనించాడేమోనని ఆమె హృదయంలో ఆవేదన రేగింది!

ముకుందరావుకి తల తిరిగినట్లయ్యింది. ఆమె శీలాన్ని అమ్ముకునే స్త్రీ అని అతనికి ప్రత్యక్షంగా తెలిసిపోయింది. పశుప్రవృత్తితో బ్రతికే అబలఅని అర్థమయ్యింది. ఇక యీ నరకకూపంలో అతడు ఒక్క క్షణంకూడా నిలువలేకపోయాడు. ఒక్క అణుబాంబు పడిన సస్యశ్యామలమైన భూమి ఎడారిగా మారినట్లు అతని హృదయంలో ఆమెపైనున్న భక్తి దహించుకుపోయింది. ఒక వేశ్యచేతిలో పెరిగి పెద్దవాడినయ్యాననే ఆవేదన అతన్ని పీడించింది. వెంటనే యీయిల్లు శాశ్వతంగా విడిచిపోవాలని నిర్ణయించుకున్నాడు. పూజాగృహంనుండి ఆమె గదిలోనికివెళ్లి బయటతలుపు తీశాడు.

అతను వెళ్లిపోతున్నాడని గ్రహించి ఆమె హృదయం కృంగిపోయింది. గుండెల్లో అగ్నిజ్వాలలు బయలుదేరాయి. ఆమె చివాలున లేచి 'బాబూ'! అనుకుంటూవచ్చి అతని పాదాలమీద వాలిపోయింది.

అతను శిలావిగ్రహంలాగ స్తంభించిపోయాడు.

"బాబూ...నన్ను విడిచి వెళ్లిపోతావా? చిన్ననాటినుండి నీవేదిక్కని ఎంతో గారాబంగా పెంచుకున్నాను. ఈలోకంలో నీవుతప్ప నాకు వేరే దిక్కులేదు. ఇటువంటి పని యిక ఎన్నటికీ చెయ్యను."

ఆమె దీనస్థితిచూసి అతని కనుకొలకుల్లో రెండు కన్నీటిచుక్కలు నిలిచాయి.

"బాబూ, పాపాత్మురాలిని! నన్ను విడిచి వెళ్లావా బాబూ? నాకన్నతండ్రి, నీవు నన్ను విడిచి వెళ్లితే నేను తిండి తినకుండా యిలాగే మరణిస్తాను... ఇక నాజన్మలో యిటువంటిపని చెయ్యను" ఆమె దుఃఖాన్ని అతని హృదయం భరించలేకుండా వుంది. ఆమె కన్నీళ్లతో అతని పాదాలు తడిసిపోయాయి. అయినా అతని అంతఃప్రవృత్తి బలవంతంగా బయటికి నెట్టివేస్తూంది.

ఆమె హస్తాల్లో చిక్కుపడిన పాదాలను అతను బలవంతంగా పెకలించి లాక్కున్నాడు. ఆమెముఖం మీదపడి ఘోరున దుఃఖిస్తూ తన రెండు హస్తాలను జోడించింది. అతని కనుకొలకుల్లో నిలిచిన రెండు కన్నీటి బిందువులు ఆమె దోసిటిలో రాలాయి! ముకుందరావు కదిలిపోయాడు.

వెంటనే వుద్యోగం సంపాదించుకోగలిగాడు. కొంతకాలానికి వివాహం చేసుకున్నాడు.

రోజులు కలిసి వచ్చి ఒక ఆఫీసరుగా నియమింపబడ్డాడు.

అతని వివాహంనాడు ఆమె లేక పోయినందుకు ఒక నిగూఢమైన విషాదచ్ఛాయలు అతనిలో మిగిలిపోయాయి!

ఈనాడు వచ్చిన టెలిగ్రాం అతనిలో తుఫాను లేపింది. ఆమెకు ద్రోహంచేసిన నేరస్థుడులాగ అతను బాధపడ్డాడు.

అంత మహాపట్టణంలో ఎవ్వరూ కనికరించక పోయినా ఆమె కనికరించి కాపాడింది. తన స్వంత బిడ్డలాగా ఆదరించింది. ఆమె నిజంగా ఒక మాతృ స్త్రీ కాకపోవచ్చుకాని ఆమెలో ఉత్తమ మాతకుండవలసిన గుణాలు గూడుకట్టుకుని వున్నాయి. తమలో మాతృత్వం వుందనుకునే అనేకమంది స్త్రీలలో కూడా యిలాంటి వుత్తమ గుణాలు కనుపించవు.

ఆమె కనికరించక పోతే తను యేమయ్యేవాడు? ఏ రైలు స్టేషన్లో మూటలు మోసేవాడో! ఏ కాఫీ హోటల్లో కప్పులు కడిగేవాడో! ఏ సినిమాహాల్లో, సిగరెట్లు అమ్మేవాడో!

ఆమె తనమీద అపారమైన ప్రేమ చూపింది. తన జీవితానికి విలువబాట చూపించింది. తన యందున్న ప్రేమవల్ల పశుప్రవృత్తి మానుకుంటావని కన్నీరు కార్చింది. ఈనాడు తను ఒక ఆఫీసరు కాగలిగాడంటే కేవలం ఆమె దయవల్లనే!

ఆమె చేసింది తప్పుకాదు! ఆమె యీ లోకానికి ఒక వేశ్య కావచ్చు. కాని తనకుమాత్రం ఆమె అమ్మతో సమానం! తన మాతృస్థానాన్ని ఆమె ఆక్రమించుకున్న పవిత్రురాలు!

ఇంకా ఆలోచిస్తే అమ్మచేసింది తప్పుకాదు. ఆమె పరిస్థితులు అలాంటివి! దేశంలో ఆర్థిక బాధలకు లోబడే కొంతమంది నిర్భాగ్యులవలెనే ఆమె కూడా మారిపోయింది.

అతని ఆలోచనకు విమలాదేవి అడ్డువచ్చింది.

"ఏమిటండీ,మీలోమీరే ఆలోచించుకుంటారు? వనజాక్షి ఎవరో చెప్పరా?" అన్నది దీనంగా—

"ఎవరో కాదు విమలా—ఆమె మా అమ్మ!" అన్నాడు ముకుందరావు ఆనందంగా—

"ఆఁ—మీ అమ్మ! మీకొక అమ్మ వున్నదని నాతో ఎప్పుడూ చెప్పలేదేమండి?" అన్నది విమలాదేవి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ—

"తరువాత అంతా చెబుతాను. ముందు అన్నీ సర్దు. బయలుదేరుదాం" అన్నాడు.

తెల్లని చందమామను నల్లని మబ్బులు కప్పివేస్తున్నాయి. చీకటి, వెన్నెల తెరలుతెరలుగా భూమిమీద పరుచుకుపోతున్నాయి!

# కలగూరగంప

## నేటి భారతీయ చిత్రకళ

శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మ

మొగలాయి ప్రభుత్వ పరిపాలన ప్రారంభమునుండి భారతీయ చిత్రకళకు ఆదరణ కలిగెను. ఐతే, జహంగీరు హిందూ కళాకారులను ఆదరముతో ప్రోత్సహించిన ఫలితంగా హైందవ, రాజపుత్ర, పారశీక పద్ధతుల కలయిక చేత మొగలు శైలి ఉద్భవించెను. క్రమముగా కళాజగత్తులో ఈ క్రొత్త పద్ధతి రాజపుత్రుల దాక్షిణాత్యుల 'పహాడీ శైలి' పై తన ప్రభావమును చూపి 17 వ శతాబ్దమునుంచి 19 వ శతాబ్దివరకు దానిని పరిపుష్టము చేసెను.

పదునేడవ శతాబ్దారంభమునుండి పాశ్చాత్యులు భారతదేశానికి వారితోపాటు వారి చిత్రకళనుకూడా తీసుకువచ్చారు. 1650 క్రీ. శ. తరువాత నిర్మింపబడిన ఢిల్లీ ఎఱ్ఱకోట రాజాస్థానములో ఇటలీ "పేటచేరా" కళాపంథాలో చిత్రింపబడిన చిత్రాలు చాల ఆకర్షణీయములై, ఈ నాటికీ ప్రేక్షకులను ముగ్ధులను చేయుచున్నవి. షాజహాను చక్రవర్తి తర్వాత 'మొగలుకళ'లో పాశ్చాత్య ప్రభావము అతిశయించినది. ఈ ప్రభావము వలన "పర్‌స్పెక్టివ్"ననుసరించి "పేజెంటు" పద్ధతికూడా కన్పించినది. కానీ నిలబడలేదు.

### పాశ్చాత్య ప్రభావము

ఇప్పటికి సరిగా వంద సంవత్సరముల క్రితం తిరువాన్కూరు రాజా కీ॥ శే॥ రవివర్మ వుదయించారు. వారు చిత్రకళలో పాశ్చాత్య సాంప్రదాయముచే ఆకర్షించబడుటయేకాక పూర్తిగా అనుకరించి ప్రదర్శించారు. వారు రంగులువాడే విధానములోనూ, పరిప్రేక్షణలోనూ పాశ్చాత్య పద్ధతులు ఇమిడియున్నవి. భారతీయ కళపై పాశ్చాత్యకళా ప్రభావమున కిదియే నాంది.

అదే సమయంలో కలకత్తా, లాహోరు, మద్రాసు, బొంబాయి నగరాల్లో ఆంగ్ల కళాకారుల ఆధ్వర్యవ చిత్రకళాశిక్షణాలయములు నెలకొల్పబడినవి. తద్వారా యావద్భారతదేశంలోను క్రమముగా పాశ్చాత్యకళ ఆదరమును పొందినది. దేశీయ చిత్రకళను ఆదరించువారు లేక క్షీణించి, కుంభకారులవద్ద, రాజ ఆస్థాన శిల్పులవద్ద మాత్రమే అది నిలిచిపోయినది.

ఇరవవశతాబ్దారంభములో కలకత్తా (స్కూలు) చిత్రకళాశిక్షణాలయ ప్రధానాచార్యుడు మిస్టర్ హేవల్ భారతీయ కళాఖండాలను చూచి ముగ్ధుడయ్యెను. ఆయన భారతీయ చిత్రకారుడు శ్రీఅవనీంద్రనాథ్ ఠాకూరుచే భారతీయచిత్రకళా ప్రతిభను గుర్తింపచేశారు. శ్రీ అవనీంద్రనాథ్ ఇటలీ చిత్రకారుడు 'గిలహోర్డి' వద్ద రూపచిత్రణ, చిత్రలేఖనమును అభ్యసనము చేశారు. హేవల్ ప్రోత్సాహమువల్ల వారు దేశీయ పద్ధతిలో రాధాకృష్ణుల చిత్రాలను రచించారు. ఆ చిత్రాలను పరిశీలిస్తే గిలహోర్డి ఛాయలు లభిస్తాయి. భారతీయ కళా లక్షణాలను, జాపనీయుల "హైఫన్", "అంకోకురా" మొదలైనవారి 'వాష్ పద్ధతు'లను సమన్వయించి అవనీంద్రుడు క్రొంగ్రొత్త భారతీయ శైలిని సృష్టించారు. దానిలో క్రమముగా పాశ్చాత్యపద్ధతి అనుకరణ క్షీణించ మొదలిడి రాజపుత్ర శైలి పైన మళ్లీ భారతకళపైన నవీన చిత్రకారుల ఆదరాభిమానములు పెంపొందినవి. ఈ శైలికి అవనీంద్రనాథ్ ఠాకూరు, నందలాల్ బోసు, అబ్దుల్ రహమాన్ చౌగతాయి, అజిత్ కుమార్, దేవీప్రసాద్, శారదాచరణ్ మొదలైనవారు సూత్రధారులు. వారు అత్యంత సుందర చిత్రలేఖనమునకై పాశ్చాత్య పద్ధతుల ప్రభావంతో తమ శైలిలో పరిపూర్ణత్వము సాధించారు.

### నూతన శైలి అవతరణ

ఈ నూతన దశములో విప్లవవాది శ్రీ గగనేంద్రనాథ్ ఠాకూరు. వారు "పికాసో" "బ్రాక్"

జమ్" పద్ధతులయొక్క నూతనత్వమును, అంగ సౌష్ఠవమును, వానిలోని వాస్తవిక స్వరూపాన్ని గ్రహించి ఒక క్రొత్తపద్ధతిని తయారుచేశారు. వారి నీటిరంగుల చిత్రాలు కూడా విదేశీ నీటిరంగుల వాడుక విధానంపై ఆధారపడి యున్నవి.

తర్వాత శ్రీ యామినీరాయ్, శ్రీ రవీంద్రనాథ్ ఠాకూర్ ఒకే సమయంలో భారతీయ కళా క్షేత్రంపై రెండు రకముల కళా వాహినులను ప్రదర్శించారు. శ్రీ యామినీరాయ్ శిష్ట పద్ధతులను పరిశీలిస్తే మొదట వారు పాశ్చాత్య పద్ధతులలో "వాస్తవిక స్వరూప" శిక్షణను అభ్యసించినట్లు గోచరిస్తున్నది. తిరిగి నృత్య శైలిని, చివరి దశలో గ్రామీణపాటక జనులు, వారి పనిపాటలు పూర్తిగా తమ శైలిలో యిముడ్చుకున్నారు. కొలది యూరోపియన్ "ఇంప్రెషనిజం" లేక "పోస్టు యింప్రెషనిజం" ల ప్రభావములను గ్రహించి, యింకను సర్వ సమ్మిశ్రితములైన ప్రభావములతో మరొక క్రొత్త బాణీని సృష్టించారు. శ్రీ రవీంద్రుని చిత్ర పద్ధతి దీనికి పూర్తిగా విభిన్నమైనది. వారు సాంకేతిక శిక్షణాభ్యాసం పొందకయే సహజ భావాలతో చిత్రకళార్చన చేసారు.

తర్వాత నవీనకళాకారులలో అగ్రగణ్య చిత్రకారిణి కీ॥ శే॥ శ్రీమతి అమృత్ షేర్ గిల్ ను గురించి తెలుసుకోవలసియున్నది. అప్పటివరకూ భారతీయ కళాకారులు వారి చిత్రకళ స్థాయిని పెంపొందించారు. వారి అభ్యాసము, దృక్పథము పూర్తిగా భారతీయములైనవి. అమృత్ షేర్ గిల్ తన హంగరీ తల్లి సహచర్యమువల్ల ఫ్రాన్సు ఆర్టుస్కూలులో కళ నభ్యసించి "పోస్టుయింప్రెషనిజం" పద్ధతిలో ఇక్కడ క్రొత్త ప్రయోగములు చేయ మొదలిడినది. తర్వాత ఆమె వివిధ భారతీయ చిత్రలేఖనములైన, రాజపుత్ర, మొగలు, పహాడీ, అజంతా మొదలైన శైలులను తనకళారాధనలో ఉపయోగించినది. ఆమె చిత్రకళ ఫ్రాన్సు చిత్రకారుడు "గోయా" ప్రభావమును పూర్తిగా పొందినది. ఆమె చిత్రాలు పూర్తిగా మొగలు, రసపుత్ర చిత్రాలకు నవీన శైలివర్ణ సంస్కరణములు.

మిగిలిన చిత్రకారులలో శ్రీ కె. కె. హెబ్బారుకు ప్రముఖ స్థానమున్నది, కానీ అది షేర్ గిల్ తరహాలోని "గోయా" ప్రభావమును అనుసరించునదే.

పెస్తాన్ జీ బోమన్ జీ, త్రినిడాడ్, పీఠవాలా హాలదన్ కర్ ప్రభృతులు పాశ్చాత్య వాస్తవిక చిత్రకళకు ఆరాధకులైరి.

పికాసోపద్ధతి ఘనాకృతివాదమైన 'క్యూబిజమ్' శైలి. దానిని అనుకరించిన ప్రొఫెసరు లైంగు హేమర్ చిత్రకళా చరిత్రలో స్తుతి పాత్రులు. వంగ చిత్రకారులు కొందరు 'మాటిస్'ను అనుసరించిరి. వారిలో శ్రీ శైలోజ్ ముఖర్జీకి అత్యున్నతస్థాయి లభించినది. లోకకళ (జానపద) శిక్షణాలయంలోని ప్రముఖ చిత్రకారిణి 'సీలాఓడెన్' చిత్రాలు "రువో" (రో) కళా ప్రభావములను పొందాయి. శ్రీ గోపాల్ ఘోష్ చీనా సాంప్రదాయానుకరణ చేశారు. 'పికాసో' సృష్టించిన 'క్యూబిజమ్' శైలి, భారతీయముగా మార్చిన మహాకళాకారుడు శ్రీ జార్జికీట్, ప్రముఖులలో ఒకరు.

రాకపోకల సాధనాధిక్యతవల్ల దేశ దేశాల వివిధ సంస్కృతులయొక్క మేళవింపు అపారముగా సాగినది. ఏ దేశమైనను స్వీయ కళలను బాహ్య ప్రభావములనుండి కాపాడటానికి ప్రయత్నించటం వ్యర్థ

ప్రయాస. అందుచేత మనం గతంలో వివిధ కళా ప్రాభవములను మనలో విలీనం చేసుకున్నట్లే—ప్రస్తుతం కూడా విదేశీయుల ఉత్తమ పద్ధతులను తప్పక స్వీకరించాలి

ఆధునిక భారతీయ చిత్రకళా ప్రారంభము రాజా రవివర్మ శుభోదయంతో ప్రారంభమైనది. ఆయనకు పూర్వము, ప్రాచీన భారతీయ చిత్రకళా ప్రతినిధియైన శ్రీ బోలారాయ్ గారి అస్తమయంతో (1833) అది చరమాంకము పొందినది.

దాదాపు రెండు తరముల తర్వాత గానీ మన కళాక్షేత్రంలో కళా గురువులు శ్రీ అవనీంద్రనాథ్ ఠాకూరు ప్రవేశించలేదు. అప్పటికి భారతీయ చిత్రకళలో పాశ్చాత్య సాంప్రదాయ వ్యామోహము దుష్ప్రభావమును ప్రసరింపచేసినది. శ్రీ అవనీంద్రనాథ్ ప్రప్రథమంగా పాశ్చాత్యానుకరణకు వ్యతిరేకంగా క్రొత్త పుంతలు త్రొక్కారు. ఈ సమయంలోనే అవనీంద్రుని శిష్యాగ్రగణ్యుడు శ్రీ నందలాల్ బోసు మధ్యయుగంలోని శిల్పకళను శ్రద్ధగా అధ్యయనం చేశారు. మరొకవైపు అజంతా సౌందర్య రూపములను తన బాణీలో ఇముడ్చుకున్నారు. ఈ కారణంచేత శ్రీ నందలాల్, అవనీంద్రుని కళాశైలిని అలవర్చుకోవలేక పోయినారు. ఇందువలన రాజపుత్ర మొగలు పద్ధతుల ఏకీకరణమైన 'టెంపరా' పద్ధతి వారివల్ల క్రొత్తరూపాన్ని పొందినది.

శ్రీ నందలాల్ బోసు తర్వాత చిత్రకళ వంగ శైలి, పారిస్ శైలి, జానపదకళా శైలిగా విభక్తమైనది.

వంగ చిత్రకళా పాఠశాల విశిష్ట లక్షణములను చేటెవి నిర్మించలేక పోయినది. శ్రీయుతులు డా॥ అవనీంద్రనాథ్, ఇ. బి. హావెల్ లచే నడుపబడిన ఈ కళాకేంద్రం ప్రాచీనార్వాచీన భారతీయ చిత్రకళా శైలులను కలిపేస్థలమైనది. శ్రీయుతులు వినోద బిహారీముఖర్జీ, డి. బద్రీ, బి. సి. గుప్త, రాణీచాందా, ధీరేంద్రదేవాన్ బ్రహ్మ, కృపాల సింహ షేకావత్ మొదలైనవారు ఈ కేంద్రములోని అగ్రగణ్యులు.

అమృత్ షేర్ గిల్ అనుచరులైన శ్రీ కృష్ణకుమార్, శ్రీ హెబ్బార్, శ్రీ జార్జికీట్, శ్రీ శైలేజ్ ముఖర్జీ, శ్రీ యస్. యస్. రాజా మొదలైనవారు పారిస్ స్కూలులో ఉత్కృష్టమైన 'వాస్తవికవాద' కళాకారులు.

జానపద కళాశాల స్థాపకులు ఆచార్య యామినీ రాయ్ వారి కళాపాటవ బెంగాలు స్కూలులోనే ప్రారంభించారు. జానపద కళల ఆకృతుల నిర్మాణ పద్ధతితో వారు తమ చిత్రకళా రచనలను చేశారు.

శ్రీ యామినీరాయ్, శీలా ఓ.డెన్ గార్లే గాక, శ్రీయుతులు పి. యల్. నరసింహమూర్తి, కె. శ్రీనివాసులు గారలు కూడా ఆంధ్ర జానపదకళా శైలి ననుసరించి లోక కళను వికసింప చేయుచున్నారు. శ్రీ ఎ. పైడిరాజు గారు కూడా ఈ కోవలోని వారే.

అభ్యుదయ కళాకారులలో శ్రీయుతులు మానా సమర్థ్, భావేశ సాన్యాల్, యస్. యస్. షేంద్రె, మనోహరజోషి ముఖ్యులు. నవీనయుగ కళాకారులలో సుధీర్ ఖాస్తగీర్, కుమారస్వామి, దేవరాజ ధింగ్, ప్రదోషదాస్ గుప్త, చంద్రశేఖర్ సాక్సేనా, యం. ఎస్. హుస్సేన్, కె. సి. యస్. పణిక్కర్, రాధిన్ మైత్రా, ప్రాణకృష్ణపాల్, డి. బి జోగ్, బి. ఎ. మాలి, ఎస్. ఎల్. సేన్, సుధాంశురాయ్, రవిశంకర్ రావల్, సోమలాల్ షాహ్, అలమేల్కర్, రామకుమార్ మొదలయినవారు ప్రముఖులు.

నేడు ఈ కళాకారులు ఆధునిక కళాక్షేత్రములో వివిధ ప్రయోగములు జరిపి, భారతీయ కళా సాంప్రదాయాలను అత్యధిక శోభాయమానంగా చేయుటంలో నిమగ్నులై యున్నారు.



# గ్రంథ విమర్శనము

## రసవాహిని

[ప్రథమ భాగము]

ఖండకావ్య సంపుటి; రచన : శ్రీ పి. వి. యల్. వి. ప్రసాదరావు. ప్రాప్తిస్థానము : రచయిత : ఆంధ్ర శాఖ, హిందూ కళాశాల, గుంటూరు. వెల రు 1-50.

ఈ సంపుటిలో సమర్చన, సమర్పణ, కావ్యదేవి, ప్రణతి, ఆదర్శము, కాంతికైశికి, సుమనోంజలి, విజయోస్తు, సందేశము, భువనభారతి, భాగీరథి, భావదేవి, ప్రతిజ్ఞ, వింతప్రకృతి, గీతి, కవిత, ఉషాదేవి, కవిబ్రహ్మ భావచాలన, ప్రణయిని, భగ్నమాధురి, తిమ్మరుసు, అక్షరోత్పత్తి, ఉదయాంగనము, దీపకళిక, విచిత్రవిశ్వము, విజ్ఞప్తి — అనే శీర్షికలలో 27 ఖండకృతులున్నాయి. ఇందు 'కావ్యదేవి, ప్రణతి, ఆదర్శము, అన్న మూడు రచనలు సంస్కృతరచనలు. 'కావ్యదేవి' స్తుతి ప్రాచీన సంస్కృత మహాకవుల రచనకు దీటుగావుంది.

'రాగావళీ, రసమయీ, రమణీయమూర్తీ!
రమ్యోదయోదయ రహః ప్రణయానుభావా!
భావప్రియా, సహృదయా, సదయా, మదీయే
భావే కరోతు విజనిత్యనివేశ దేశమ్.

కంజాత కాంతికలికే, కమనీయకేళీ
కల్లోలినీ కలకలాప కలాకలాపే!
కల్యాణి! కల్పకగుణామయి, కావ్యదేవి!
దివ్యస్వరూపిణి! భవచ్చరణాసలోఽహమ్!

లావణ్యలాస్య లహరీ లలనప్రలోపమ్
లాలిత్య లాలితలతా లలితాభిలాషమ్
పర్యుత్సుకమ్, పరిణతిమ్, పరిణామఫేలమ్,
హేమాననం ధిరతు తుభ్యమలభ్య కాంత్యై.

శ్రీ ప్రసాదరావుగారికి సంస్కృతంలో రచనలు చేయాలనే అభిలాష వుండడమే గాక వీరికి తెలుగు రచనలో కూడా సంస్కృత సమాసాలు గుప్పటం సరదా. చరణాలకు చరణాలే అలా హృదయాహ్లాదకరంగా తరంగాలు తరంగాలుగా దొర్లిపోతాయి. కవికి రసవివశమైన గంభీరహృదయం వుంది. ఇది వీరు చిత్రించిన పార్థునిమూర్తి.

"అతి తుత్తుంగ ధనుర్ధరుం డతులితారావర్త
వీరుండు — సం
తత సర్వాదరణైక శీలు డసమా
నప్రస్ఫురద్దేహుం డా
తత తేజోద్ధృత దుర్నివారుడు తపోంచ
త్తిర్వాహిని శ్రీపతి
సత్కృతి విద్యా విభవాభిరామ బలవి
స్ఫీతుండు పార్థుండిలన్

మహామంత్రి తిమ్మరుసు స్మరణ కవిని ఉత్కంఠుని చేస్తుంది.

"పసరువయస్సులో, ఎముక
పటునిగోజులలోనె నాడు మా
నసమున కావ్య కన్యకల
నర్తనముల్ విలసిల్లె నేటికి
రసకవితా ప్రపంచము ల
రాజకమయ్యె కలమ్ముసాగదీ
పసితన మేమి? నీ సయిన
భక్తినటయ్య అమాత్యశేఖరా!

* * * *

నీవున్నావొక కీర్తిశేఖరహిమా
నీరేఖవో స్వామి! నీ
ధీ విన్యాసము తెన్గుదేశమున కం
దించెన్ పురాణాన్వ తే
జో వైశాల్యము — నీ చిరంతనతప
స్సుల్ పండి యీ దేశమే
శ్రీ విద్యానగర ప్రసాదముగ
మారెన్ మంత్రి లోకప్రభూ' —

'ఆత్మజ్యోతి' అన్న కావ్యంలో:

'లక్ష హాలాహలాల కోలాహలాలు
స్వల్పముగనైన నన్ను కదల్పలేవు
కలశపాథోధి గర్భంబు కలచి — చిలికి
చిలికి దెచ్చెద చిక్కని లలిత సుధలు

* * * *

'దుర్భర గురూహా పీడ వాంఛానిబంధ
శిథిలహిందూసమాజ సంస్కృతి సమగ్ర
శక్తి సంధాన నవనికేత ప్రదాన
ధర్మదీక్షైక కంకణధారి నేను.'

అన్నారు. ఇంత ఆవేశమున్న శ్రీ ప్రసాదరావుగారు, ఇలా ఏవో ఖండ కృతులతో కాలక్షేపం చేసేకంటే, తమ భావనా వ్యవస్థనంతా ద్యోతమానం చేస్తూ ఒక సమగ్రకావ్యాన్ని నిర్మించితే తాడూ పేడూ తేలిపోతుంది.

తె. సూ.

## మేఘ సందేశము
### [ఆంధ్ర పద్యకావ్యము]

అనువాదకులు: శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ, తెలుగు పండితుడు, గుంటూరు.

ఆదిలక్ష్మి ప్రచురణలు: అరండేలుపేట, గుంటూరు. వెల: 1-0-0.

"నా అల్ప తెనిగింపు చరిత్ర చర్వణమైనను నమ్మహాకావ్యమునందలి గాథానురాగమే నన్నీ సాహస కార్యమునకుఁ బ్రోత్సహించినది."

—గ్రంథకర్త 'విజ్ఞప్తి'నుండి.

"ఈ యాంధ్రీకరణము న్యూనాతిరిక్తమై, మూల గ్రంథములోని భావములను అరటి పండొలిచి యిచ్చిన రీతిని సులభముగా నందింపుచున్నది. మాతృకలోని రస భావ మేమాత్రము కొఱతపడకుండ నీ తెలుఁగు కృతి యందు నిండుకొనియున్నది."

—పీఠికాకర్త 'పరిచయము'నుండి.



మేఘసందేశ మెన్నిమారులైన పరివర్తింపదగినదే. దానియందు, గాథానురాగము కూడ నుండవలసినదే. అనురాగమునకుఁ దోడు, అనువాదమునకు, మరికొన్ని శక్తులు కూడఁ గావలసియుండుననుట విస్మరింపరానిది. ఎవరి శక్తిననుసరించి వారు చేయవచ్చును. చేయరాదని శాసనము లేదు. పరిచయ వాక్యములలోని, "ఈ యాంధ్రీకరణము న్యూనాతిరిక్తము —మాతృకలోని రసభావ మేమాత్రము కొఱతపడకుండ నీ తెలుఁగు కృతి యందు నిండుకొనియున్నది"—

ఈ రెండు వాక్యములు నొకదానితో నొకటి పొసఁగుట లేదు. న్యూనాతిరిక్తమగుచో రసభావములు కొఱవడమి యెట్లు? రసభావములు కొఱవడనిచో నీ యనువాదము న్యూనాతిరిక్తమగుట యెట్లు? పరిచయకర్త అభిప్రాయము, ప్రకృతానువాదము అన్యూనానతిరిక్తమని కాఁబోలును. తెలియక న్యూనాతిరిక్తమని వ్రాసెను. 'నిండుకొనియున్నది' అభావమును చెప్పుట యందు రూఢముగ వాడుకలో నున్నది. ధాన్యము నిండుకొనియున్నవి. పప్పు నిండుకొన్నది. ఇత్యాదులు—చూ. గ్రంథములకు పీఠికలు, పరిచయములు, వ్రాయుటకు నభ్యర్థింపఁబడువారు తెలిసికొని వ్రాయుట లెస్స. లేనిచో నిట్టి చిక్కులు వచ్చుచుండును. గ్రంథములు వ్రాయ నేర్చినవారు సరియైన పీఠికాకర్తల నేరికొనుటయు మంచిది. ఇఁక అనువాదము మాట:

విరహోద్దీపకమైన వాని నతనున్
వీక్షింపగా నాత్మకున్
దరుణీరత్నము జ్ఞప్తిరా, నది
యసాధ్యంబౌట దుఃఖించె ని
స్తర మంభోదుని ముందున న్నిలిచి
కాంతాయుక్తులే మేఘునిన్
బరికింపన్ స్మరతాపు లౌదు
రొరులం బల్కంగ నింకేటికిన్.

మూలము:

తస్యస్థిత్వా కథమపి పురః కౌతుకాధానహేతో
రన్తర్బాష్పశ్చిరమనుచరో రాజరాజస్య దధ్యౌ
మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథావృత్తి
చేతః
కణ్ఠాశ్లేషప్రణయిని జనే కిం పునర్దూరసంస్థే.

కౌతుకాధానహేతోః=అనుదానికి 'విరహోద్దీపకమైన వాని' అను తెనిఁగింపు హృదయంగమము కాదు. 'స్థిత్వా కథమపి పురః' = నిలుచఁబడి—యీ నాలు గవ్యయములకు ప్రత్యామ్నాయముగ నిరూప్యలమైన 'వీక్షింపఁగా' అనునది చేర్పఁబడినది. 'అంతర్బాష్ప

శ్వరం' = వినుకంబడినవి. 'తరుణీరత్నము జ్ఞప్తిరా నది యసౌఖ్యంశాలు' ఇట్లు వాక్యము సేయుట రస విధ్వంసన మనిపించికొనును. 'సుఖినః' — దీనికిఁ 'గాంతా యుక్తులు' అని తెనుఁగు చేయుట సరికాదు. 'అన్యథా వృత్తిచేతః' = దీనికి 'స్మరతాపులౌదురు' అని చేయుట సహృదయులకు దారుణశిక్ష విధించుట!

శ్లోకమునకు ప్రాణమువంటిదైన—

'కంఠాశ్లేష ప్రణయిని జనే దూరసంస్థే' అన్నది శాశ్వత బ్రహ్మకల్పముగ వినుకంబడినది. ఇట్లు ప్రతి శ్లోకమున, న్యూనములు, అతిరిక్తములు, లెక్కించుటకు వలనుపడనన్ని యున్నవి.

కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనా౽చేత
నేషు.

దీనికి—

"కాముల కించన్ జేతనాచేతనంబుల జ్ఞానం బొక యింతయుండదుకదా!"

అని తెనిఁగింపు!! ఇటీవల యనువాదములు పెక్కింటిలోనిది యిట్లే తెనుఁగు చేయఁబడుచున్నది. మేఘసందేశమునందలి గాఢానురాగమునకు వశం వదులై పోవుచున్న నేటి సాహితీకర్షకులు కవికులగురువు నందలి గౌరవముచేతనైన నిట్టి యనువాదములను మానుట మంచిది. పీఠికాకర్తలును శ్రద్ధ వహింతురు గాక!

## రా రా జు

### శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు

కవిరాజు గ్రంథమాల: పొన్నూరు

వెల; రూపాయి.

ప్రతులకు:—కొల్లా శ్రీకృష్ణారావు, పెదకూర పాడు, గుంటూరు జిల్లా.

"భారతి సంస్కృతిమీద (భారతి ప్రతిపాదిత మైన సంస్కృతిమీద) సంఘక్షేమదృష్టితో అభ్యుదయ కాములు తిరుగుబాటు లేవదీసిరి. మహారాష్ట్రమునుండి డాక్టర్ ఫూలే, బెంగాలునుండి రాజా రామమోహన రాయ్, ఆంధ్రనుండి వేమన, కందుకూరి వీరేశలింగం, తమిళ నాడునుండి పెరియార్ రామస్వామి, మలబారు నుండి డాక్టర్ నాయర్, కర్నాటకంనుండి బసవన్న వారి తిరుగుబాటుకు తొలి నాయకులు.

ఇంతకన్న తీవ్రధోరణిలో సమగ్రదృష్టితో త్రిపుర నేని రామస్వామి చౌదరి తిరుగుబాటు ఉవ్వెత్తున్న కావ్యరంగంలో లేవదీశారు. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, కొడాలి లక్ష్మీనారాయణ, గోపరాజు రామచంద్రరావు మొదలుగా గలవారు కొంతనుండి అందుకొనిరి. ఆ తిరుగుబాటు ప్రభావిష్టతం కలిగించింది. కాని దానికి యింకను పరిపూర్ణరూపం రాలేదు. అలలు లేచి వెనుకాడినవి; పల్లములలో నీరు నిలచియున్నది. ఆ కోవకు చెందిన పిల్ల వస్తాదు మన రారాజు కృతికర్త" పీఠికనుండి;

ఉదాహృతములైన పైవాక్యాలవల్ల ఈ గ్రంథ రచనకు వెనుకవున్న ఉద్యమమూ, తత్ప్రవర్తకులైన ఆచార్యపురుషులూ, ప్రయోజనమూకూడా పాఠకులకు సువిదితమై వుంటుంది.

దుర్యోధనవంశం నిరవశేషమైపోయి, పాండవ వంశజుడైన జనమేజయుడే రాజ్యానకు రావడంవల్లా, వైశంపాయనముని ఆ రాజుకు, ఆశ్రితుడు కావడంవల్లా, (మొన్న మొన్నటి జమీందారులకు ఆశ్రితులైన కొందరు కవులకుమల్లే) ఆ రాజు ప్రాపకం సంపాదించుకోవడంకోసం ఆ రాజుకు పూర్వులైన పాండవులను ధర్మాత్ములనుగాను, తద్విరోధులయిన దుర్యోధనాదులను పరమ పాపాత్ములుగాను, వైశంపాయనుని అభూతకల్పనలు చేసి ప్రకృతి రూపంలోవున్న భారతాన్ని సృష్టించివుంటాడనీ - కాదు సృష్టించాడనీ-బుద్ధివిధానం మనోవిధంగా అయివున్నట్లయితే, అంటే, పాండవవంశమే నిరవశేషమై పోయి, దుర్యోధన వంశజులే రాజ్యాధిపతులయే సందర్భంలో అప్పుడు వారి కాశ్రితుడై తీరవలసివున్న వైశం

పోయినదని- లేక మరెవడైనాసరే, భారతాన్ని మరో విధంగా వ్రాసివుండేవాడనీ, అప్పుడు దుర్యోధనుడికి- కాదు సుయోధనుడికి, ఇంత అన్యాయం జరిగివుండేది కాదనీ, యదార్థం బయటపడివుండేదనీ - పై వాదం యొక్క మూలభూతమైన తాత్పర్యంగా గోచరిస్తుంది. ఏమయితే నేం, ప్రకృత భారతంలో దుర్యోధనుడికి మాత్రం చాలా అన్యాయంజరిగింది. విషం పెట్టించడం, పాములచేత కరిపించడం, నీళ్లలో త్రోయించడం, ఇల్లు తగలబెట్టించడం, సభలో భార్యను పరాభవించడం, ఇవన్నీ అభూతకల్పనలు. వైశంపాయనముని, చేసినవి. దుర్యోధనునిమీద ఆరోపింపబడినవి. ఆ ముని చేసిన ద్రోహంవల్ల కొన్ని వేల సంవత్సరాలుగా ఇవన్నీ ప్రజల మనస్సుల్లో నాటుకొనిపోయి, దుర్యోధనుడిమీద ప్రకృతింపున్న భావాన్ని కల్పించాయి. జాతిమత భేద నిర్మూలనానికి ప్రయత్నించిన ప్రప్రథమ సంస్కర్త దుర్యోధనుడు. సంస్కర్తల కందరికీ ప్రథమాచార్యుడు! సూతసుతుడుగా, వ్యవహృతుడౌతూ వున్న కర్ణుడికి అంగరాజ్యం ఇవ్వడంలో అతనికి స్వార్థం యేమీ లేదు. కేవలం సంఘసంస్కరణాభినివేశమే! దుర్యోధనుడికి సంబంధించినంత వరకూ అభూతకల్పనలు కొన్ని, మొత్తం భారతం చరిత్రాత్మకమనడంలో సందేహ మెంతమాత్రమూ లేదు. జూదంలో రాజ్యమపహరించి అడవులకు పంపడం అధర్మం కాదు. ధర్మమే. అరణ్యవాసపుగడువు పదమూడేళ్ళని నిర్ణయించడంలో కూడా, వ్యవహార ధర్మశాస్త్రం యిమిడి వున్నది. ఆ పరిమితి దాటితే పాండవులకు రాజ్యంమీద వున్న హక్కుకు 'లిమిటేషన్' పట్టిపోతుంది. ఈ ధర్మసూత్రానికి ప్రవర్తకురాలు కైకేయి. ఆవిడ పద్నాలు గేళ్లు గడువు పెట్టింది. అది త్రేతాయుగం కనుక. ద్వాపరం కనుక గడువు పద్నాలుగల్లా పదమూడై పూరుకుంది. అసలిది చాలా ప్రబలమైనయుక్తి. అయితే మరి అజ్ఞాత వ్రతభంగంచేసి పాండవులను తిరిగీ అడవులకు పంపాలని తాపత్రయ పడడం ఎందుకు? దుర్యోధనుడు! అంతటి కార్యవాది కిది తోచి వుండదా? అతనికి తోచివుండకపోతే, కనీసం అతని మేనమామ శకునికైనా తోచవలసిన యూహకదా! ఇది- అంతే, ఇంతకూ ఈ భారతం పాండవాభిమానులు రచించిందాయె! ఇందులో దుర్యోధనుడికి సంబంధించిన ధర్మసూక్ష్మం మాస్తా మాస్తా ఎలా వ్రాస్తారూ? అని సమాధానం. ఇంకా ఎన్నోయెన్నో అన్యాయాలున్నాయి. అవన్నీ యిక్కడ వివరించడానికి వీలులేదు. కొన్ని వేల సంవత్సరాలుగా, గతానుగతికంగా, దుర్యోధనుడికి జరిగిపోతువున్న అన్యాయానికీ, ద్రోహానికీ-- విరుగుడుకలిగి యదార్థం బయటపడే శుభసమయం ఆసన్నమయింది. ఇందుకుగాను దేశం నలుమూలలనుండీ వుద్యమాలు బయలుదేరినాయి ఆ విస్తృత జలోజ్జృంభణం తాత్కాలికంగా అలలుతగ్గి వెనుకకు తగ్గినట్లు కనుపించినా, పల్లాలలో నీరునిలిచేవున్నది. 'నీరు పల్లమెఱుంగు నిజము దేవుడెఱుంగు' ఈనీటికి పల్లమేకాదు నిజంకూడా తెలుసు ఇది భగవత్స్వరూపం. ఈ నిలిచిన నీరు ఉత్తాల జలధియై వచ్చి' సుయోధనుడి అపయశో మాలిన్యాన్ని కడిగివేసి, నూత్న భారతాన్ని సృష్టించ గలదు.

ఈ రారాజు కావ్యంలో సుయోధనుఁడు ధర్మరాజుతో అన్నమాట;

"ఇంతకు నెటేపుట్టువుం గాంతువో? చేయరాని యకార్యము లన్నింటఁ జేసి, ధర్మమున్ బంతమ్ముఁ బటి మమ్ముగునుఁ బొల్చితీవు జగమ్ము, కోడియై గొంతుక విప్పవా? నిజము గోల్పడువా? మనుజోంగ్లు పుట్టరా?" ఈ మాట దుర్యోధన సహానుభూతి పరితప్తహృదయుడైన యీ రచయిత సరిగ్రుత కంఠంలో ఇలా మారో్మ్రోగింది. 'రారాజా! భవదీయ దివ్యయశో మారాధించు నైమర్మకుల్ ధీరుల్ సత్కవి శేఖరుల్ గలరు వందింపంగ వందింపగా' ఇది దైవోపహతుడైన రారాజునకు ఈతని యిచ్చిన యాశ్వాసము! ఎందుకు పుటరు? పుట నే పుట్టారు!

రచన ప్రశస్తంగావున్నది. దుర్యోధనుడితో ధర్మరాజు 'మాదైదుగురిలో నీ యిష్టమువచ్చిన వాని చేరికొని, గెలిచితివేని, రాజ్యమునీదెవన్న దానికి, బదులిచ్చుచు, నకుల సహదేవుల మద్దేశించి యతనన్న మాట—

'మాద్రీ ప్రసువుల కగ్గొనరింతువె?

పసిబిడ్డలఁ గవలఁ గోరఁ బాడియె? యనికిన్' ఇది రారాజు పాత్రముయొక్క కిరీటముపై నీకవి చెక్కిన యువర్ణమణి! ఈ కావ్యమునంతను ఈ యొక్క మాట వెలిఁగించు చున్నది.

—వారు, వీరు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.